సరస్వతీ గ్రంథమండలి :

# అమెరికా రాజ్యాంగము

అనువాదం :

వి. నారాయణరావు

సరస్వతీ గ్రంథమండలి :

# అమెరికా రాజ్యాంగము

రచయిత

డేవిడ్ కుష్మన్ కోయిల్

అనువాదం

వి. నారాయణరావు






పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కొ

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

B

# AMERICA RĀJYĀMGAMU

(The United States Political System and How It Works)

by
DAVID CUSHMAN COYLE


Translated by
V. NARAYANA RAO

Second Edition - July 1962 - Price Rs. 2-75





Publishers · ADDEPALLY & Co.
SARASWATHI POWER PRESS
RAJAHMUNDRY (A. P.) India

# విషయసూచిక

1

# పునాదులు

ప్రజాస్వామ్య వ్యవస్థలో మానవజాతి ప్రవర్తించే పద్ధతికే రాజకీయాలని పేరు. ప్రజాస్వామ్య సంఘంలో, అంతఃకలహం అవసరంలేకుండానే ప్రభుత్వపు చర్యలపైన, విధానాలపైన, విభిన్న, విరుద్ధ అభిప్రాయాలు ప్రకటించబడతాయి. రాజకీయ విధానాలమూలంగా, ప్రజలు నిర్ణయ ప్రమాణాలు సంతరించుకొని, దేశంలోని ఏ ప్రముఖ భాగానికి కష్టంగా ఉండనిఫలితాన్ని సాధించడానికై వానిని అమలు జరిపేందుకు ప్రభుత్వాధికారులను ఎన్నుకుంటారు.

అమెరికన్ రాజకీయాలు, మంచివీ, చెడ్డవీకూడా అమెరికన్ ప్రజల కలగాపులగపు స్వభావాన్ని, వాళ్ళ ప్రభుత్వ వ్యవస్థలనేకాకుండా రాజకీయపు టలవాట్లనుకూడా రూపొందించిన గతచరిత్రనూ ప్రకటం చేస్తాయి.

నేడు అమెరికన్ ప్రజలలో రమారమి సగంమందిమాత్రం బ్రిటిష్ జాతీయులు. ఇంచుమించు మిగతావారంతా ఐరోపాలోని వివిధ దేశాలవారు, నీగ్రోలు, యెర్ర-ఇండియనులు. ఏ కొద్దిమందో ప్రాచ్యదేశీయులు కూడ ఉన్నారు. అమెరికా ప్రభుత్వాన్ని నడిపించే రాజకీయ వ్యవస్థ తార్కికమైన ప్రణాళికా ఫలితంకాక, చాలవరకు ప్రజల సహజ ప్రవృత్తివల్లనే రూపొందింది. అది ముఖ్యంగా బ్రిటిష్ సంప్రదాయాలు, ఆచారాలపై ఆధారపడినా, సంయుక్త రాష్ట్రాలలో నివసించే అన్నిరకాల ప్రజల ప్రభావమూ దానిమీద ఉన్నది. దేశంలోని వివిధ ప్రభుత్వరంగాలలో రాజకీయపక్షాలూ, రాజకీయ కార్యకలాపాలూ ఎలాపనిచేస్తాయో చూపించడానికే ఈగ్రంథం ఉద్దిష్టమైంది.

**1607** నుండి **1776** వరకూ ఇంగ్లీషువారు అమెరికాలో స్థాపించుకొన్న వలసలలో బ్రిటిష్ పద్ధతిలోనే ప్రభుత్వాలు స్థాపించబడ్డాయి. అవే తరువాత దేశంలో వృద్ధిపొందిన ప్రభుత్వవ్యవస్థలకు చాలవరకు పునాదులయినాయి.

ఆ వలసల శాసన సభలు వలసలకొరకు శాసనాలుచేసేవి. స్థానిక ప్రభుత్వాలను ఏర్పరిచేవి. పన్నులు విధించేవి. రాజ్యవ్యయం కోసం అంచనాలు తయారుచేసేవి. అప్పుడప్పుడవి రాజ్యపాలకుని నడవడి సక్రమంగా ఉండేటట్టు చేయడానికై కోశాధికారం చెలాయించేవి. స్థానిక ప్రభుత్వాలు ఇంగ్లండులోని పద్ధతి ననుసరించి రూపొందించబడ్డాయి.

స్థానిక పరిస్థితులనుబట్టి వలసలలో కౌంటీలు, టౌన్‌షిప్పులు, మనార్‌లు బరోలు ఏర్పడ్డాయి. అందులో చాలాభాగం నేటికీ ప్రధానమైన మార్పులేవీ లేకుండా నడుస్తున్నాయి. విప్లవానికి పూర్వపురోజులలోనే వలసలలో కౌంటీ కోర్టులు, శాంతి నెలకొల్పేనిమిత్తం ఉద్దేశించబడిన న్యాయమూర్తులు, షెరీఫ్‌లు, కారొనెర్లు ఉండేవారు. పెద్దనేరాలను విచారించడానికి ఉన్నత న్యాయ స్థానాలూ, ఉండేవి. ఇంగ్లండులోని ప్రివీకౌన్సిలుకు పునర్విచారణాధికారం ఉండేది.

ఇంగ్లండులో సంప్రదాయసిద్ధంగా వస్తున్న హక్కులు-అంటే-సమావేశమయి, ప్రభుత్వానికి అర్జీపంపుకునే హక్కు, జ్యూరీ సమక్షంలో విచారించబడే హక్కు, పన్నులు విధించే శాసనసభకు ప్రతినిధుల నెన్నుకునేహక్కు, వంటివి-వలస దేశీయులు తమకు ప్రసాదించబడ్డట్టే భావించుకున్నారు. వలసరాజ్యంగా ఉన్నకాలంలో చాలవరకూ, బ్రిటిష్‌ప్రభుత్వం ఫ్రెంచివారీ తోటి, కెనడాలోని ఫ్రెంచి యిండియనుల తోటి-వలసదేశీయులను తరచు యుద్ధంలోకి దింపినా వాళ్ళు ఇంగ్లండునుంచి ఏ సైనిక సహాయమూ పొందలేదు; ఇంగ్లండుకు ఏ పన్నులూ చెల్లించలేదు. చివరకు బ్రిటిష్‌పార్లమెంటు అమెరికనులపై పన్నులు వేయడానికి ప్రయత్నించినపుడు తమకు ప్రాతినిధ్యంలేని శాసనసభ తమపై పన్నులువేయడం తమ ప్రాచీన స్వామ్యాధికారంగా అమెరికనులు భావించారు.

అట్లాంటిక్ మహాసముద్రంమీద వార్తాసౌకర్యాల లోపంవల్లా, దూరం ఎక్కువ కావడంవల్లా వలసరాజ్యాలకు చట్టరీత్యావచ్చే స్వేచ్ఛకన్నా ఎక్కువ స్వేచ్ఛ అనుభవించడానికి వీలయింది. ముఖ్యంగా వారి స్థానిక ప్రభుత్వాలలోనూ, క్రమంగా ముందుకు జరుగుతున్న సరిహద్దు ప్రాంతాలలోనూ బ్రిటిష్ రాజుగారి అధికారం లుప్తం కాసాగినది. బ్రిటిష్ పతాకం క్రింద గడచిన **175** ఏండ్లలోనూ అమెరికనులు ఎక్కువగా స్వపరిపాలననూ, స్వవిశ్వాసానికి అలవాటుపడ్డారు; కాని వారి ప్రభుత్వవ్యవస్థపై బ్రిటిష్‌రాజూ వారికి ప్రాతినిధ్యం వహించలేని పార్లమెంటూ అధికారం వహించడం వల్ల, పార్లమెంటుతో వలసల బాంధవ్యం తొలగిస తరువాత తప్ప సుసంఘటిత రాజకీయ పక్షాలు ఏర్పడడానికి వీలులేకపోయింది. ముఖ్యమైన రాజకీయ వివాదాలన్నీ రాజ్యపాలకులకూ శాసనసభ్యులకూ మధ్యనో, లేక స్థానికపదవులకు నిలబడిన అభ్యర్థుల మధ్యనో ఉండేవి. వలసరాజ్యదశలో ఫ్రెంచివారి

తోను, ఇండియనులతోను తరచుగా సంభవించే యుద్ధాలను నిర్వహించ డానికి ఏదో ఒక విధమైన వలసలకూటమి ఏర్పరచాలని అనేక ప్రతిపాదనలు చేయబడ్డాయి. ఈ ప్రతిపాదనలేవీ ఫలవంతం కాకపోయినా దీనివలన అమెరికనులకు సమైక్య కార్యాచరణ అనే భావం మాత్రం పరిచితమైంది. 18వ శతాబ్దారంభంలో ఇంగ్లండుతో తగాదాలు విషమించినపుడు అమెరి కనులు సమైక్య కార్యాచరణ పద్ధతిని అవలంభించారు.

1774 లో వారు కాంటినెంటల్ కాంగ్రెస్ మహాసభ (Continental Congress) సమావేశ పరచారు. కాంటినెంటల్ కాంగ్రెస్ మహాసభకు చట్టరీత్యా బలమేమీలేదు. అదికేవలం వారి ఆగ్రహాన్ని ప్రకటించే "అధికా రిక సమావేశం మాత్రమే!" అది ప్రజల హక్కులూ, బాధలూ ప్రకటిస్తూ తీర్మానంచేసి 1775 లో మరొక సమావేశం ఏర్పాటుచేసింది. అప్పటికి మస్సాచుసెట్స్‌లో యుద్ధం ప్రారంభమవడంతో ఈ సమావేశం ఇంకా స్పష్ట మైనపనులు చేసింది. ఇది వలసలను పరిపాలించే అధికారం వహించింది. జాతీయ సైన్యాన్ని నిర్మించి దానికి జార్జివాషింగ్టన్‌ను సర్వసైన్యాధిపతిగా నియమించింది. 1776 లో రెండవ కాంటినెంటల్ కాంగ్రెసు మహాసభ స్వాతంత్ర్య ప్రకటనను ఆమోదించింది. ఆప్రకటన ఆంగ్లేయులకు సంప్ర దాయసిద్ధంగావచ్చిన హక్కులూ, స్వేచ్ఛ,మానవులకుగల అనన్యసంక్రామ్య స్వామ్యములూ, అమెరికన్ వలసల స్వప్రభుత్వనిర్మాణానికి పునాదులు-అని ప్రకటించింది. స్వాతంత్ర ప్రకటన వెనుక రాజ్యాంగానికివలె శాసనబలం లేదు కాని, అమెరికాలో రాజకీయ కార్యాలకు ప్రమాణభూతమైన నైతిక సూత్రాల ప్రకటనగా దానికి అనంతమైన ప్రాముఖ్యతఉంది.

1777 లో కాంటినెంటల్ కాంగ్రెస్ మహాసభ ఒక సమాఖ్యను ఏర్పాటు చేయడానికి తీర్మానించి-ఆ తీర్మానాన్ని రాష్ట్రాల ఆమోదార్థమై పంపించింది. 1781 నాటికి దానిని అన్నిరాష్ట్రాలూ ఆమోదించాయి. తత్ఫలితంగా "సమాఖ్యానియమావళి" (Articles of Confederation) అనే పత్రం ఆ రిపబ్లిక్‌కు మొదటి రాజ్యాంగమయింది.

ఈ సమాఖ్యా నియమావళి ప్రకారం ఏర్పాటయిన ప్రభుత్వం అసమర్థ మైనదీ, బలహీనమైనదీ అయింది. కాని, అప్పటి రాష్ట్రాలు ఆమోదించ గలిగింది ఆ విధమయిన రాజ్యాంగం మాత్రమే! రాష్ట్రాలు మంజూరు చేయగలిగిన కొద్ది అధికారాలూ ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క వోటు

చెప్పున ఉన్న (ఏకైక) శాసనసభ యైన కాంగ్రెసుకు అప్పగించబడ్డాయి. అప్పటి ప్రభుత్వంలో కార్యనిర్వాహకశాఖ, న్యాయపాలకశాఖ లేవు.

ఈ రాజ్యాంగం క్రింద దేశమూ, రాష్ట్రాలూ సర్వనాశనమయినాయి. ద్రవ్యం పూర్తిగా విలువలేని దనిపించేటంతవరకూ ద్రవ్యోల్బణం విజృంభించింది. అందుకే "కాంటినెంటల్‌కు కొరగావు". అంటే గుడ్డిగవ్వకు కొరగావు అన్నఅర్థం అమెరికన్‌భాషలో ఏర్పడింది. రాష్ట్రాలమధ్య వర్తకం విపరీతంగా పడిపోయింది. ఈస్థితి తొలగించి, వాణిజ్యాన్ని సక్రమంచేసి, పన్నులువిధించి, ఆర్థికవ్యవస్థ కూలిపోకుండా ఆపగల బలవత్తర సమాఖ్యా ప్రభుత్వం కావాలని చాలమంది అమెరికన్ వర్తకులు కోరారు.

**1785** లోను **1786** లోనూ వివిధరాష్ట్రాల వర్తక ప్రముఖుల మహాసభలు జరిగాయి. వాటిఫలితంగా **1787** లో ఫిలడల్ఫియాలో సమావేశం ఏర్పాటయింది. అక్కడ రాజ్యాంగం రచించబడింది.అందుచేత ఆ రాజ్యాంగం "వాణిజ్యసూత్రం" మీద నిర్మించబడిందని చెప్పవచ్చు. దీనితోకలిసివున్న ఇతర సూత్రాలు సమాఖ్యాప్రభుత్వానికి వివిధ ఆర్థికస్వామ్యాలూ, విధులూ కల్పించాయి. ఆ సమావేశాన్ని ఏర్పాటుచేసినవారల, దానికి హాజరయినవారల ముఖ్యోద్దేశాలను ఈసూత్రాలు ప్రతిబింబించాయి.

ఫిలడెల్ఫియా సమావేశ ప్రతినిధుల్లో చాలమంది, కాంగ్రెస్ సభ్యులు గానో, లేక ప్రభుత్వాధికారులు గానో పనిచేసిన న్యాయవాదులూ, భూస్వాములూ, వర్తకులూ, కూలివాళ్ళకీ రైతులకీ, దేశ సరిహద్దు పెంచుకుంటూపోతున్న పురోగామివర్గానికీ ఆ సమావేశంలో ప్రాతినిధ్యంలేదు.వర్తకాన్ని పెంపొందించగలిగేదీ, బలమైనదీ, ఏ చిక్కువచ్చినా నిలువగలిగేవీ, అయిన ప్రభుత్వాన్ని అచటి ప్రతినిధులు నిర్మించగోరారు. "ప్రజలకు" నామతః బాధ్యతవహించగల ప్రభుత్వాన్నే వారు కోరారుకాని, అధ్యక్షుణ్ణికాని, చివరకు కాంగ్రెసు సభనుకాని, సామాన్యప్రజలందరూ ఎన్నుకొనడానికి అంగీకరించే ఉద్దేశం వాళ్ళకిలేదు. దేశంలోని చిన్న, పెద్ద రాష్ట్రాలమధ్య విభేధాలూ, భయాలూ, అసూయలూ పోగొట్టగల ఒడంబడికను ఒక దానిని ఈసమావేశం సాధించవలసి వచ్చింది.

ఒకవంక ఖండంలో బలీయమైన కేంద్రప్రభుత్వాన్ని ఏర్పరుస్తూ మరొకవంక కేంద్రానికి తప్పనిసరిగా ఇవ్వనవసరంలేని అధికారాలను రాష్ట్రాలను అనుభవింపనివ్వాలని ఉద్దేశించడంవల్ల, రాజ్యాంగం సమాఖ్యా రాజ్యాంగం

కాక తప్పించికాదు. ఈ ఉద్దేశ్య ద్వయం వెనుక-కేంద్రప్రభుత్వం మరీ బలీయమైనదైతే నిరంకుశం కాగలదన్న భయంకూడాఉంది. ఈభయమే అధికార విభజన సిద్ధాంతానికి-అంటే శాసననిర్మాణ, కార్యనిర్వాహక,న్యాయ పాలక శాఖలు మూడూకాని, అందులో ఏ రెండుకాని, ఒకేవ్యక్తిక్రింద ఉంటే ప్రభుత్వం నిరంకుశంగా పరిణమించ వచ్చుననే సిద్ధాంతానికి— పునాది అయింది.

అమెరికారాజ్యాంగం 1788 నుండి తీవ్రమయిన ప్రమాదాలేమీ లేకుండా, నిలువ గలగడం చూస్తే-అది అమెరికన్ ప్రజల తత్వానికీ, అవస రాలకీ సరిపడిందని తెలుతున్నది. ఆ రాజ్యాంగాన్ని రచించినవారు అమెరి కన్‌జాతి ప్రకృతిని ఆమూలాగ్రం అర్థం చేసుకొన్నవారూ, ఇతరదేశాల, ఇతరకాలాల చరిత్రను కూలంకషంగా నేర్చినవారు. వారి పరిశ్రమ ఫలి తంగా అది 1778 వ సంవత్సరపు తత్‌క్షణ సమస్యలను పరిష్కరించడమే కాక, ఆ రచయితలు ఊహించి ఉండని పరిస్థితులకు అనుగుణంగాకూడా ఉపయోగపడింది. వంద సంవత్సరాలు గడిచిన తరువాత ప్రముఖ ఆంగ్లేయపరిశీలకుడు "జేమ్సు బ్రైస్" అమెరికా రాజ్యాంగాన్ని గురించి ఇలా వ్రాశాడు :

"ఈ రాజ్యాంగం-దాని ప్రణాళికలోని మహోన్నతమైన పరిణతిలో, ప్రజల పరిస్థితుల కనుగుణంగా సరిపడడంలో, భాషలోని సారళ్యము, క్లుప్తత, నిష్టపతలలో, నియమాలవిషయంలో నిశ్చితత్వమూ, వాని వివరాల విషయంలో అనుసరణీయతా, వివేకయుతమైన పాళ్ళలో ఉండడంలో- ఇతర లిఖిత రాజాంగాలన్నిటికన్న మిన్నయైనది."

ఈరాజ్యాంగం సృష్టించిన సమాఖ్యా ప్రభుత్వం ఒక కల్పిత సర్వస్వాధి కారయుత రాజ్యం-సరిగ్గా ఒక కార్పొరేషను ఎలా ఒక కల్పితవ్యక్తో, ఎలక్ట్రా నిక్ మెదడు ఎలా ఒక కల్పిత ఆలోచనాయంత్రమో అలాగే ఈ రాజ్యం కూడా ఒక కల్పితవిషయం, సహజసిద్ధం కాదు.

ఇప్పుడు దాని అస్థిపంజరాన్ని కప్పుతూవున్న సజీవమైన కండరాలు- దానిని పనిచేయించిన వ్యక్తులు సమకూర్చారు.-అంటే, రాజకీయరంగం లోను, రాజ్యతంత్రంలోను అనుభవంపొందుతున్న అమెరికనులు సమ కూర్చారు.

రాష్ట్రాలకు సర్వస్వాధికారం సహజసిద్ధమైనది. అవి వాటి భూభాగంలో అంతస్థపారుడికున్న అధికారాలన్నీ అనుభవించడానికీ, తమ సర్వస్వాధికారాన్ని, అంతర్జాతీయ న్యాయసూత్రాలకు మాత్రం లోబడి తమ ఇష్టంవచ్చినట్లు నిర్వచించుకోవడానికీ అధికారాన్ని పోరాడి సంపాదించుకొన్నాయి.

విప్లవసంపం ప్రారంభింపబడినప్పుడే రాష్ట్రాలు తాత్కాలిక శాసనసభలను ఏర్పాటుచేసుకొని 1776–1780 మధ్య రాజ్యాంగాలు రచించుకొని, సంపూర్ణ వ్యవస్థితప్రభుత్వాలను ఏర్పాటుచేసుకొన్నాయి. తరువాత సమాఖ్య ప్రభుత్వ నిర్మాణం రూపొందడంలో ఉపయోగింపబడిన సూత్రాలలో చాలా భాగం మొదట ఒకటిరెండు రాష్ట్రాలవారు ఆచరించి చూసినవే!

మొదట రాష్ట్రాల రాజ్యాంగాలు చాలచిన్నవిగా ఉన్నవి; అయినా, అవి సమగ్రంగా ఉండాలని ఉద్దేశించబడ్డవి. ఉదాహరణకు రాష్ట్రాలకు ప్రత్యేకమైన శాసననిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయపాలక, శాఖలు ఉండేవి–సమాఖ్యా ప్రభుత్వానికి ఇవిలేవు.

మహా సమాఖ్యా నియమావళి (Articles of Confederation) లో ప్రతిరాష్ట్రమూ సర్వస్వాధికారయుతమైనది. అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వానికి రాష్ట్రాలుఇచ్చిన అధికారాలుతప్ప మరేమీలేవు. కొత్తరాజ్యాంగం వ్రాసేటప్పుడు ఈసూత్రంమీదనే అది రచించబడింది–కాకపోతే దానివలన ఏర్పడిన కొత్తసమాఖ్య కొంచెం ఎక్కువ సమగ్రమైనదిగా ఉంటుంది. అంటే దానికి రాష్ట్రాలు యిచ్చిన అధికారాలు ఇంకొంచెం ఎక్కువ ఉంటాయి. అంతే తేడా.

1787 లో ఫిలడెల్ఫియాలో ప్రతినిధులు సమావేశమయినప్పుడు వాళ్ళు "మహా సమాఖ్యా నియమావళి"కి సవరణలుమాత్రమే ప్రతిపాదించాలని నిశ్చయించబడింది. పైగా, ఆ సవరణలు ఏకగ్రీవంగా అంగీకరించబడితేనే అమలుజరపాలని అనుకున్నారు. కాని ప్రతినిధులు సమావేశమయిచూడగా, ఆ ప్రయత్నాన్ని పూర్తిగా మార్చడంతప్ప గత్యంతరంలేదని బోధపడింది. అందువల్ల వాళ్ళు మహాసమాఖ్యా నియమావళినే కాకుండా – ప్రాతిపదిక శాసనాన్ని మార్చడానికి ఎట్టి శాసనసమ్మతమైన విధానాన్ని అనుసరించాలో నిర్దేశించే సూత్రాన్నికూడా రద్దుచేయ నిశ్చయించారు. వీటికి బదులుగా కొత్తరాజ్యాంగంలో ఒకకొత్తసూత్రాన్ని రచించారు. ఆనాడు ఉన్న తొమ్మిది

రాష్ట్రాలు మొదట ఆ రాజ్యాంగాన్ని ఆమోదించి కొత్తసమాఖ్యను ఏర్పరుస్తాయి; తరువాత మిగిలిన రాష్ట్రాలు వీలయినప్పుడు చేరవచ్చు.

ప్రతినిధులు నిర్దేశించే బాధ్యతల నన్నిటిని నిర్వహించ గలదీ, తన తోవలో వచ్చే అడ్డంకుల నన్నిటినీ తొలగించుకోగలదీ అయిన ప్రభుత్వాన్ని రూపొందించడమే యీ సమావేశపు ప్రధాన కర్తవ్యం. నేడు పశ్చిమ యూరప్‌లోని దేశాల ఏకీకరణకు జరిగే ప్రయత్నాలపట్ల అమెరికనులు ఈ చారిత్రక అనుభవందృష్ట్యా సానుభూతి ప్రదర్శిస్తున్నారు. ఆదిలో తమ రాజ్యాంగ నిర్మాతలు ఇంచుమించు ఇలాటి సమస్యలనే ఎలా ఎదుర్కో వలసివచ్చిందో వాళ్ళు చిన్నప్పుడే పాఠశాలల్లో చదువుకొన్నారు.

సమావేశం ప్రారంభమయేసరికి రెండురకాల పథకాలు అందులో ప్రతిపాదించబడ్డాయి. ఒకటి—పెద్దరాష్ట్రాల ప్రయోజనాలకు అనుకూలంగా ఉండేది. దీనికి "వర్జీనియాపథకం" అని పేరు. దీనికి పోటీగా చిన్న రాష్ట్రాలన్నీ "న్యూజెర్సీపథకం" అనే పేరుతో మరొక పథకాన్ని తయారు చేశాయి. ఈ రెంటిలో దేన్ని ఆమోదించాలా అన్న ప్రశ్న వచ్చింది.

అధికార విభజన వంటి కొన్ని లక్షణాలలో ఈ రెండు పథకాలలోను సామ్యంఉన్నది. శాసననిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయపాలకశాఖలు ప్రత్యేకంగా నిర్మించబడే సూచనలు రెండు పథకాలలోను ఉన్నాయి. కాని, శాసనసభ స్వరూపంవిషయం, పెద్దరాష్ట్రాలతోను దానికి ఉండగల సంబంధం విషయంమాత్రం అతిక్లిష్టసమస్యగా తయారయింది. ఈ సంఘర్షణ ఆ సమావేశాన్నే భగ్నంచేసే స్థితి వచ్చింది. మనకాలంలో ఐక్యరాజ్య సమితి ప్రణాళికలో పొడసూపిన సమస్యయిదే. ప్రపంచంలో వివాదాస్పద విషయంపై ఐక్యకార్యాచరణకు పూనుకొనే అసమాన రాజ్యాల సమాఖ్యను దేనినైనా ఎదుర్కొనే సమస్యకూడ ఇదే! పరిచితమైన పలనరాజ్య ప్రభుత్వంలోని పద్ధతి ననుసరించి వర్జీనియా పథకం రెండు సభలున్న కాంగ్రెసు సభ ఉండాలని ప్రతిపాదించింది. అందులో ఒకసభలో ప్రజలు ఎన్నుకొన్న సభ్యులు ఉంటారు; ఆ సభ్యులు రాష్ట్రశాసన సభలు నియమించిన (నామినేటుచేసిన) ప్రతినిధులలోంచి ఎగువసభకు సభ్యులనెన్నుకుంటారు. ఈ రెండుసభలలోనూ రాష్ట్రాలకు వాటివాటి జనాభాల నిష్పత్తిలోనో, లేక పన్నుల నిష్పత్తిలోనో లేక యీ రెంటి కలయికల నిష్పత్తిలోనో ప్రాతినిధ్యం లభిస్తుందనే విషయమే-యీ ప్రణాళికలో ప్రధాన వివాదాస్పదాంశమైంది.

ఈ ఏర్పాటువల్ల పెద్దరాష్ట్రాలకు వాటి పరిమాణకారణంగా-ఒక్కొక్కరాష్ట్రానికి ఒక్కొక్కవోటు చొప్పున ఉన్న కాంటినెంటల్ కాంగ్రెసులో లేని బలం ఈ సమాఖ్యా ప్రభుత్వంలో వస్తుంది.

కాని న్యూజెర్సీపథకం అప్పటికి ఉన్న ప్రభుత్వంలో అంత పెద్ద మార్పులు ప్రతిపాదించలేదు. ఆపథకం రాష్ట్రాలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్కఓటుచొప్పున ఉన్న ఏకైకసభ గల ప్రభుత్వం ఉండాలని ప్రతిపాదించింది.

చాలావారాలపాటు, ప్రతినిధులీ కఠినసమస్యపై వాదించుకొన్నారు. న్యాయమైన అధికారవిభజన ఉన్న ప్రభుత్వంలో చిన్న, పెద్దరాష్ట్రాలు పాల్గొనేమార్గం ఏది? ఈ ప్రశ్నకు సంతృప్తికరమైన జవాబు ఏదీ కన్పించలేదు. కాబట్టి అసలు సంయుక్తప్రభుత్వం సాధ్యమూ, ఆచరణీయమూ అనే విషయంలోనే సందేహాలు కలగడం ప్రారంభమయింది.

చివరకు కొన్నెటికట్ రాష్ట్రానికి చెందిన విలియమ్ శామ్యూల్ జాన్సన్ అనే ఆయన ఈజటిలసమస్యకు పరిష్కారమార్గం చూపించాడు. దానికి "కొన్నెటికట్ పరిష్కారం" అనేపేరు వచ్చింది. దానిప్రకారం ప్రతిరాష్ట్రానికి జనాభా ప్రాతిపదికపై ప్రాతినిధ్యంలభించే "ప్రతినిధులసభ" ఒకటి ఉంటుంది. ఆర్థికవిషయకమైన సర్వశాసనాలనూ చేసే అధికారం ఆసభకే ఉంటుంది. రాష్ట్రాలన్నిటికి సమానమైన ప్రాతినిధ్యంఉన్న ఎగువసభ సెనేట్‌కూడ ఒకటి ఉంటుంది. చివరకు ఈ పథకం ఆమోదించబడింది.

ఏ శాసనమైనా చట్టకావడండానికి అది ప్రతినిధులసభ, సెనేట్-రెంటిచేత ఆమోదించబడాలికాబట్టి, తమకు ఇష్టంలేని ప్రతిపాదనను సెనేట్‌లో వ్యతిరేకించి ఆపుచేసే అవకాశం చిన్నరాష్ట్రాలకు కలిగింది; ఈవిధంగానే ప్రతినిధుల సభలో తమ సంఖ్యాబలాన్ని ఉపయోగించి తమకు అయిష్టమైన ప్రతిపాదనను ఆపుచేసేబలం పెద్దరాష్ట్రాలకు కలిగింది. ఈ పద్ధతి చాలా బాగా పనిచేసింది. పెద్దరాష్ట్రాలకూ, చిన్నరాష్ట్రాలకూ మధ్య వాటి స్వప్రయోజనాల విషయంలో **1787** లో అంత భయంకరంగా ఎదురైన సంఘర్షణ-రాజ్యాంగనిర్మాతలు భయపడినంతగా నిత్యవివాద కారణం కాకుండా పోయింది. స్వప్రయోజనాలకై జరిగే భౌగోళిక సంఘర్షణలు తరచు ఏకవర్గ సంబంధం గలవిగానో, పారిశ్రామిక, వ్యావసాయిక, ఖనిజ ప్రాంతాలవారి ప్రయోజనాలకు ప్రతిద్వంద్వులుగానో ఉంటాయి. ఉదాహరణకు న్యూమెక్సికో,

అరిజోనా రాష్ట్రాలు, జనాభాలో కాలిఫోర్నియా రాష్ట్రంకన్న చాలా చిన్నవి. ఈరాష్ట్రాలు హూవర్ ఆనకట్టవల్ల లభించే కొలెరెడో నదీజలాల విషయంలో చాలాకాలంనుంచీ పేచీ పడుతున్నాయి. కానీ ఇంతమాత్రాన రాష్ట్రాల పరిమాణ ప్రాతిపదికపై ఈవాదాన్ని పరిష్కరించడానికి కాంగ్రెసులో చిన్న రాష్ట్రాలూ పెద్దరాష్ట్రాలూ వేరువేరుగా చీలిపోలేదు.

దిగువసభకు సభ్యులు ప్రజలచేత అంటే-వోటుగలవారందరిచేత-ఎన్నుకోబడాలని రాజ్యాంగం నిర్దేశించింది. వోటుహక్కును, ఆస్తి, మతం, మొదలయిన కొన్నిఅర్హతలున్న తెల్లవారికే పరిమితంచేసే అధికారాన్ని రాష్ట్రాలు అట్టే పెట్టుకున్నాయి.

'అమెరికా ప్రజలచరిత్ర' అనే గ్రంథంలో "వుడ్రోవిల్సన్" తొలిరోజుల్లో దేశంలోని 40,00000 నివాసులలో 1,20,000 మందికి వోటుహక్కు ఉన్నదని అంచనావేశాడు.

18 వ శతాబ్దిలో, ఆ మాత్రం మందికి వోట్లుండడమే ప్రమాదకర ప్రజాస్వామ్యంగా భావించబడింది. తరువాత పందసంవత్సరాలలో వోటుహక్కు ఇంకా ఎక్కువమందికి ఇవ్వబడుతూవచ్చింది. దేశం పశ్చిమంగా విస్తరించింది. కొత్తరాష్ట్రాలు ఏర్పాటు అవడంతో సరిహద్దుప్రజల ప్రభావంవల్ల దేశంలో సమానత్వభావం అభివృద్ధి అయింది. 1860 నాటికి ఇంచుమించు అన్నిరాష్ట్రాలు తెల్లవారిలో 21 సంవత్సరాలు పైబడిన పురుషులందరికీ వోటుహక్కును ఇచ్చాయి. అంతర్యుద్ధం ముగిసిన తరువాత ఒక ప్రక్క దక్షిణరాష్ట్రాలవారు ఎన్నో అడ్డంకులు పెడుతున్నా నీగ్రోలకు వోటుహక్కు ఇస్తూ రాజ్యాంగం సవరించబడింది. 1920 లో రాజ్యాంగానికి సవరణ మూలంగా స్త్రీలకుకూడా వోటుహక్కు ప్రాప్తించింది.

ప్రతినిధుల సభకంటె సెనేటుకు ప్రజలతో తక్కువ సాన్నిహిత్యం ఉండాలని ఉద్దేశించబడింది. అందుచేత ఒక్కొక్క రాష్ట్రంనుంచి ఇద్దరు సెనేటర్లు రాష్ట్ర శాసనసభలనుండి ఎన్నుకోబడాలని రాజ్యాంగం నిశ్చయించింది. దీనిఫలితంగా ప్రతినిధుల సభకంటె సెనేట్ ఎక్కువ మితవాద ప్రవృత్తి కలదయింది. సెనేట్‌సభ్యులు తరచు ధనవంతులు; వ్యాపార రంగంపట్ల, బ్యాంకులయెడల సానుభూతిగలవారే అయి ఉండేవారు. కాని మితవాద వ్యతిరేక రాజకీయవర్గాల బలంవల్ల ఇతోధిక విస్తృత ప్రజాస్వామ్యం కావా

లనేభావం ఉద్దీప్తమై, తత్ఫలితంగా 1913 లో సెనేటుకు సభ్యులను ప్రత్యక్షంగా ఎన్నుకొనడానికి రాష్ట్రాల ప్రజలకు హక్కునిస్తూ రాజ్యాంగం సవరించబడింది. అందువల్ల 1913 నుండి సెనేటుసభ్యులు తమ రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రతినిధులుగా వాషింగ్‌టన్‌కు పంపబడే రాయబారులుగాక, కొంచెం పెద్దహోదాగల కాంగ్రెసు సభ్యులుగా భావించబడుతూ వచ్చారు.

ఇటీవలికాలంలో ప్రతినిధుల సభకంటె సెనేటుసభయే తక్కువ మిత వాద ప్రవృత్తికలిగి ఉంటున్నది. బలమైన ప్రాపకంగల వర్గాలవారి ఒత్తిడి వల్ల ప్రతినిధులసభ ఆమోదించిన కొన్ని అవివేక లక్ష్యహీనశాసనాలు సెనేటు చే తిరస్కరింపజేయటానికి ప్రతినిధులసభ సెనేటుసభపై ఆధారపడి ఉం టొందని కొందరు పరిశీలకులభావం. వోటర్లు అంతా తొందరపాటుతో ప్రతి కూలాభిప్రాయాలతో ఉన్నప్పుడు వారిలో పరివర్తన కలుగుతుందనే విశ్వా సంతో ప్రజాందోళనను ఎదిరించి నిలువగలిగేది సెనేటుసభ. ఆరేళ్ళపాటు సభ్యత్వాన్ని నిర్వహించే సెనేటుసభ్యులకు వ్యతిరేకంగా, - రెండేళ్ళకే వోటర్లఎదుట నిలువబడవలసిన ప్రతినిధులసభవారు తరచు పనిజరగడానికి వీలులేనంతగా ఖర్చుకోసివేసి, "పొదుపు" చేస్తున్నట్లునటించి, "ఘనత కోసం" ప్రాకులాడుతారు. కాని, ప్రభుత్వకార్యక్రమం జరపడానికి అవసర మయినంత ధనంకోసం, కాంగ్రెసుసభ్యులు సెనేటుసభ్యులపై ఆధారపడక తప్పదు.

రాష్ట్రాలు తమకు నచ్చినపద్ధతిలో అనగా శాసనసభలద్వారాగాని, ప్రత్యే కంగా ప్రజలేగాని, లేక గవర్నరుద్వారా ఎంచుకొనే ప్రతినిధులుఉండే ఎన్నికకూటమి (ఎలక్టోరల్ కాలేజి) ద్వారా అధ్యక్షుడు ఎన్నుకోబడాలని రాజ్యాంగం మొదట నిర్దేశించింది. ఒకరాష్ట్రంకావాలని కోరితే తప్ప ఆ - రాష్ట్రప్రజలందరికీ అధ్యక్షుని ఎన్నికలో పాల్గొనేవీలు ఇవ్వాలనిగాని, కనీసం అధ్యక్షుని ఎన్నికదార్లను ఎన్నుకొనే అవకాశమైనా ఇవ్వాలని గాని అనుకో లేదు.

కాని, ఈ విషయంలో, తదనుగుణమైన రాజ్యాంగసవరణ అక్కరలేకుం డానే ప్రజాస్వామ్యం కావాలనే కోరిక కారణంగా, రాజ్యాంగపు అర్థం చల్లగా మారిపోయింది. ప్రతిరాజకీయపక్షమూ (అధ్యక్షుని) ఎన్నికదార్ల ఎన్ని కలో అభ్యర్థులను నిలబెడుతోంది. వారంతా అధ్యక్ష ఉపాధ్యక్ష స్థానాలకు తమపార్టీఅభ్యర్థికే వోటుచేస్తామని ప్రతిజ్ఞచేస్తారు. ఈ యెన్నికదార్లనుత మ

యిష్టంవచ్చినవారిని ఎన్నుకొనే స్వేచ్ఛ ఉండదు. అధ్యక్షుని ఎన్నుకొన డానికి తగిన పెద్ద అర్హతలేవీ లేని పార్టీ 'జోహుకుందార్లు' (hacks) కొం దరు ఎన్నికదారులై పోతున్నారు.

1948 లో దక్షిణరాష్ట్రాలలో డెమాక్రటిక్ పార్టీ అభ్యర్థులుగా నిలబడిన వారు కొందరు డెమాక్రట్ అభ్యర్థి అయిన ట్రూమన్‌కు వ్యతిరేకంగా వోట్లు వేయడంతో ఈ సంప్రదాయికవిధానం భగ్నమవుతుందేమోనన్న భయం కలి గింది. చివరకు ట్రూమన్ ఎన్నుకోబడ్డాడు కాని, ఈ విధానం వలన గందర గోళానికీ, ప్రజాభిప్రాయ విరుద్ధ నిర్ణయానికీ, అవకాశం ఉన్నదన్న విషయం ప్రజలదృష్టికి వచ్చింది.

ఎన్నికదారుల కూటమి (Electoral College) విషయంలో - రాజ్యాంగంలో లేకుండా ఆచారంగా వస్తున్న మరియొక విషయం - ఒక రాష్ట్రంలో అత్యధిక సంఖ్యాకమైన వోట్లువచ్చిన పక్షానికి ఆ రాష్ట్రంలోని ఎన్నికదార్ల వోట్లన్నీ యిచ్చి వేయడం. ఓడిపోయినపక్షానికి రాష్ట్రపు ప్రజల వోట్లలో 49% వచ్చినా ఎన్నికదారుల వోటు ఒక్కటీరాదు. దీనిఫలితంగా దేశంమొత్తంపై ప్రజలఓట్లకు, దేశంమొత్తంపై ఎన్నికదార్ల ఓట్లకు మధ్య పెద్ద అంతరం కన్పిస్తుంది. గెలిచినపక్షానికి ప్రజలందరి ఓట్లలో 55% మా త్రమే రావచ్చుకాని ఎన్నికదారుల ఓట్లు మాత్రం 80 లేక 90% రావచ్చు. ఇటువంటి ఫలితంవల్ల అధ్యక్షుని ఎన్నిక "ఏకగ్రీవ" మనే భ్రమకలుగు తుంది. అది అధ్యక్షుని అధికార ప్రాబల్యానికి, ముఖ్యంగా విదేశవ్యవహారా లలో బాగా తోడ్పడుతుంది.

కాని దీనివల్ల ఒక అభ్యర్థికి కొద్దిరాష్ట్రాలలో ఎక్కువప్రాబల్యం ఉండి, ప్రజలఓట్లలో అధికసంఖ్యవచ్చిన ఇంకొక అభ్యర్థికి చాలా రాష్ట్రాలలో కొద్ది కొద్ది మెజారిటీతో రావడంవల్ల ఎక్కువ ఎన్నిదార్ల ఓట్లువచ్చి అతడు అధ్య క్షుడుగా ఎన్నికఅయే అవకాశం కూడా ఉన్నది. ఉదాహరణకు 1888 లో గవర్నర్ క్లీవ్ లండ్‌కు ప్రజలఓట్లలో అధికసంఖ్య వచ్చింది. కాని బెంజమిన్ హారిసన్ అధ్యక్షుడుగా ఎన్నికఅయినాడు. ఈ లక్షణంవల్ల ఏకరాష్ట్రాలప్రా ముఖ్యం చాలవరకు తగ్గిపోతూ ఇప్పటికి ఇది రాజ్యాంగ వ్యవస్థలో దుర్ల క్షణంగా భావించబడుతూంది. ద్విపక్ష వ్యవస్థగాని రాజకీయ వివాదాలలో తీవ్రంగా పాల్గొనడంగాని లేని రాష్ట్రాలకు, సక్రమద్విపక్ష వ్యవస్థ ఉన్నట్లు చెప్పబడే రాష్ట్రాలతో సమానంగా అధ్యక్షుని ఎన్నికలలో ప్రాధాన్యఉండాలా? అన్న ప్రశ్న రావచ్చు.

ఎవరో ఎన్నికదారుడు అకస్మాత్తుగా తనకు రాజ్యాంగంయిచ్చిన అధికారాన్ని బయటకుతీసి, తన యిష్టం వచ్చినట్లు వోటుచేసే ప్రమాదం లేకుండాచేసి అధిక సంఖ్యాకుల యిష్టాన్ని నెరవేర్చే మరొక మారు పద్ధతిని ప్రస్తుతవిధానికి బదులుగాగా ఏర్పాటు చేయడానికి అమెరికన్ ప్రజలు సుముఖుగా ఉన్నట్టు కన్పడుతోంది. కాని తీవ్రమైన ప్రజాభిప్రాయ వైఫల్యం కలుగనంత కాలమూ అలాంటి సవరణలు ప్రతిపాదించడంలో చాలా ఔదాసీన్యం కూడా ఉన్నది. ప్రభుత్వంలో ఏ శాఖకూడ విచ్చలవిడిగా వ్యవహరించకుండా నిరోధించేందుకు రాజ్యాంగం జాగ్రత్తగా "నిగ్రహసమన్వయ" (Checks & balances) విధానానికి అనుగుణంగా రూపొందించబడింది. ఉదాహరణకు అధ్యక్షుడు కాంగ్రెసుచేసిన శాసనాన్ని "వీటో"చేయవచ్చు. అవి తిరిగి కాంగ్రెసుసభకు వెళుతుంది. మళ్ళా రెండు సభలూ దానిని మూడింట రెండుపంతుల ఆధిక్యంతో ఆమోదిస్తే తప్ప శాసనంకాదు.

కాంగ్రెసు తగిన ధనాన్ని యివ్వ నిరాకరించడం ద్వారా అధ్యక్షుని చర్యలను – సర్వసైన్యాధ్యక్షుడుగా అతనికిగల రాజ్యాంగ దత్తాధికారాలతోసహా అన్నిటిని – వీటో చేయవచ్చు. అధ్యక్షుడు చేసికొన్న ఒక ఒడంబడికను సెనేట్‌వీటో చేయవచ్చు. పరిపాలన శాఖల లోని ముఖ్యోద్యోగులూ, ఫెడరల్ న్యాయమూర్తులూ అంతా సెనేట్ ఆమోదానికి లోబడి అధ్యక్షునిచేత నియమించబడతారు.

కాంగ్రెసు చేసిన శాసనాలు రాజ్యాంగ విరుద్ధాలని ప్రకటించే అధికారాన్ని రాజ్యాంగం సుప్రీంకోర్టుకు ఇవ్వలేదుగాని, ఆచారప్రాబల్యం వల్ల కొన్నిపరిస్థితులు కారణంగా కోర్టు ఆ అధికారాన్ని వహించే అవకాశం కలిగింది. అధ్యక్షుడూ, సుప్రీంకోర్టు సభ్యులూ, కార్యనిర్వాహక, న్యాయపాలక శాఖలలో ఇతర ముఖ్యోద్యోగులూ, "ఇంపీచ్‌మెంట్" అనబడే దండన విధానంద్వారా పదవీభ్రష్టులు చేయబడవచ్చు. ఆదండన సమయంలో ప్రతినిధుల సభవారు దోషనిరూపణచేస్తారు. సెనేట్ సభవారు న్యాయ నిర్ణయ బాధ్యతవహిస్తారు. అధ్యక్షుడు జాక్‌సన్ అటువంటి దండనను సెనేట్‌లో ఒక్కవోటు ఆధిక్యంతో తప్పించుకొన్నారు. సెనేట్ ఇంతవరకూ నాల్గువిషయాలలో ఇంపీచ్‌మెంటును ఆమోదించింది. ఆ నాలుగూ ఫెడరల్ న్యాయమూర్తులపై అభియోగాలే !

'నిగ్రహ సమన్వయ' సూత్రమూ అధికార విభజన సూత్రమూ – రెండూ పరస్పర విరుద్ధ సూత్రాలు అయినా యీ రెండూ కలిస్తే అమెరికా ప్రజలకు ఇష్టమయిన మధ్యేమార్గం ఏర్పడుతుంది. శాసన నిర్మాణ, కార్య నిర్వాహక, న్యాయపాలక అధికారాలను పూర్తిగా విడదీసి, పరస్పరం సంబంధం లేకుండా చేయడం అసాధ్యం. అయినా ఈ మూడింటిలో ఏ రెండూ ఒక కాబోయే నియంత చేతిలోనో, రహస్య పోలీసు వ్యవస్థ చేతిలోకో పోకుండా నిరోధించడం వాంఛనీయం. ఈ విధమైన పాక్షిక విభజనా, నిగ్రహసమన్వయ విధానమూ ఇప్పుడు మనం అనే "నియంతృత్వప్రభుత్వం" నుండి దేశాన్ని రక్షించడానికి ఏర్పాటు చేయబడ్డాయి. ఇందులో ఇంతవరకూ వారు కృత కృత్యులయినారు. రాజ్యాంగ రచయితలు 'ఫెడరల్ ప్రభుత్వం చేసే దుష్ట శాసనాల వల్ల ప్రజల హక్కులకు భంగం కలుగకుండా రక్షించే హక్కుల పత్రాన్ని రాజ్యాంగంలో చేర్చలేదు. అయితే అక్కడక్కడ గతంలో ప్రజలు రాజు పాలనలోను, పార్లమెంటు పాలనలోను అనుభవించిన కొన్ని అన్యాయాలు నిషేధిస్తూ కొన్ని సూత్రాలున్నాయి. రాజ్యాంగపు మొదటిసూత్రం ప్రభుత్వాన్ని Bill of attainder ను అంటే "శిక్షించబడడానికి ఒక వ్యక్తిని, అతని కుటుంబాన్ని ప్రత్యేకించడాన్ని నిషేధించింది. అలాగే – Ex post facto law ను, అంటే ఒక పని నేరమని నిర్ణయింపబడక పూర్వం చేయబడగా ఆ తరువాత దానిని నేరంగా నిర్ణయించి శిక్షించడాన్ని కూడా నిషేధించారు.

చాలా నియంతృత్వ దేశాలలోవలె హఠాత్తుగా ఒకవ్యక్తిని పోలీసులు బంధించకుండా హెబియస్‌కార్పస్ హక్కు అందరికీ వర్తింపజేయబడింది. మూడవ సూత్రంలో ఫెడరల్ నేరం ఏదైనా జ్యూరీ సమక్షంలో విచారించబడాలని విధించబడింది.

ఇప్పటి కమ్యూనిస్టులు "బహిష్కరణ" అనే పనికి పూర్వంరాజులు ఉపయోగించిన "దేశద్రోహపు నేరం" మోపే హక్కు దురుపయుక్తం కాకుండా శ్రద్ధ వహించ బడింది.

కాని రాజ్యాంగాన్ని రాష్ట్రాలకు ఆమోదార్థం పంపే సరికి సంపూర్ణమైన హక్కులపత్రం అందులో చేర్చబడని కారణాన రాజ్యాంగం అమలులోకి వచ్చాక ఏర్పడిన క్రొత్త కాంగ్రెసుసభ చేయవలసిన మొదటిపని రాజ్యాంగానికి అట్టి హక్కుల పత్రాన్ని చేర్చడానికి వీలుగా సవరణను ప్రారంభించడమేననే ఒప్పందంతో కొన్నిరాష్ట్రాలు దానిని ఆమోదించాయి.

రాజ్యాంగానికి మొదటి పదిసవరణలు కలిపితే ఏర్పడేహక్కుల పత్రానికి, ఐక్యరాజ్య సమితివారు అనుసరించిన మానవ స్వత్వాల ప్రకటనకూ చాలా విషయాలలో తేడా ఉంది. 18 వ శతాబ్దంలో ఆంగ్లేయులు తమ ప్రభుత్వాల వల్ల పడ్డ కష్టాలూ, వారి పూర్వీకులు పోరాడి పోగొట్టిన అన్యాయాలూ – అమెరికా రాజ్యాంగంలో భద్రబఱుప బడిన హక్కులకు మూలాధారాలు.

కాని యీ రోజుల్లో హిట్లరూ, సోవియట్‌దేశమూ క్రొత్తరకం అన్యాయాలను సృష్టించడమో, అనాగరిక కాలంనాటి వాటిని త్రవ్వితీయడమో చేశాయి.

రాజ్యాంగంలో ప్రధానమైన లక్షణాలివి. ఇవి అమెరికాప్రజలు, ప్రజల రాజకీయ నిర్మాణ శక్తులు కోరిన విధంగా రాజ్యవ్యవస్థను నిర్మించుకోడానికి అనువైన, బలీయమైన పునాదిని కల్పించాయి. ఇందులో ఎన్నికలు, కాంగ్రెస్‌సభ అధికారాల వంటివి నేటికి ప్రధానమైన మార్పేమీ లేకుండా అనుసరించ బడుతున్నాయి. ఎలొక్టొరల్ కాలేజీ (ఎన్నికదారుల కూటమి)సుప్రీం కోర్టు వంటివి మార్పుచెందాయి.

కాని మొత్తంపై రాజ్యాంగం మాత్రం అది ఏ లక్ష్యంకోసం సృష్టించ బడిందో దానికోసమే యిప్పటికీ పనిచేస్తోంది. ఒక జాతిగా ఏర్పడిన అమెరికన్ ప్రజల కోసం పనిచేయ గల సామర్థ్యం ఉన్న ప్రభుత్వాన్ని ఏర్పరచి ఆ ప్రభుత్వం సర్వతంత్ర స్వతంత్రులైన ప్రజలకు లొంగి ఉండేటట్లు చేయడమే ఆ లక్ష్యం.



# పార్టీలు

అమెరికన్ ప్రజలకు ద్విపక్ష విధానమే అభిమతం. గతించిన రెండు పందల సంవత్సరాలలోను,వాళ్ళు ఒక్క పార్టీ మాత్రమే ఉన్నప్పుడల్లా,దాన్ని రెండు ముక్కలుగా చీల్చడమో, మరొక క్రొత్తదాన్ని ఆరంభించడమో చేశారు. మూడుపక్షాలు వచ్చినపు డల్లా ఒక దాన్ని ఎన్నికల్లో నాశనం చేశారు.

వలసరాజ్య దశలో విగ్గులు, టోరీలు చాలా భిన్నమైన రాజకీయ విధానాలను అనుసరించారు. ఆ విధానాలు ఎంత భిన్నమైనవంటే, వాటివలన వాళ్ళ విభేదాలు 1775 లో యుద్ధానికి దారితీశాయి. ప్రస్తుతం ఉన్న రెండు పక్షాలూ ఇంచుమించు ఒకే విధానాన్ని అనుసరిస్తున్నాయి. అందుకనే వీటికి "ట్వీడిల్‌డమ్", "ట్వీడిల్‌డీ" అనిపేస్లన్నాయి. రెండేళ్ళకొకసారి ఈ రెండు పక్షాలువారూ ఒక యుద్ధం చేయడానికి ఒప్పందం కుదుర్చుకున్నారు. అందులో పరాజిత పక్షానికి ప్రమాదకరమైన గాయాలు తగలకుండా ఉండేందుకు తగినంత రక్షణ ఉంటుంది !

అమెరికన్ పార్టీలలోని వైలక్షణ్యం రాజకీయ నాయకుల పథకాల ఫలితంగా కాక, ఆ దేశచరిత్రవల్లా, పరిస్థితు ల వల్లావచ్చింది. నిజానికి, రాజ్యాంగంలో పార్టీల విషయమే ప్రస్తావించ బడక పోవడం చాల చిత్రమైన విషయం.

విప్లవానికి పూర్వం, నవీన పద్ధతిలో సంఘటితమైన పార్టీలే లేవు. కాని, రాజునీ, గవర్నరులనూ సమర్థించేవారిని 'టోరీ'లనీ వలసల శాసనసభలను, స్వపరిపాలన సూత్రాలను బలపరచే వారిని 'విగ్గు'లనీ అనేవారు. ఈ విగ్గులకు టోరీలకు మధ్యనున్న తగవా యుద్ధంతో సర్దుబాటయింది. ఆ యుద్ధంలో విగ్గులు (దేశభక్తులు) గెలుపు సాధించడమే కాక, ప్రతిపక్షాన్ని పూర్తిగా తుడిచి పెట్టేశారు. టోరీలు కెనడా, బహామాలకు పారిపోయారు.

అమెరికాలో నేటికీ కొందరు మితవాదులను టోరీలని పిలుస్తున్నాం విప్లవం తరువాత మళ్ళా రాజు పరిపాలన పునఃస్థాపించాలనే ప్రయత్నం చేస్తున్న పార్టీ ఏదీ ఇంతవఱకూ రాలేదు.

అమెరికా కూడ విప్లవం జరిపిన దేశాల వలెనే ఆరంభంలో ఏక పక్ష రాజకీయ విధానాన్నే ఏర్పరచుకొన్నది.జార్జివాషింగ్టన్,విప్లవనాయకులలో ఇంకా అనేకులు ఆ విధానం అలాగే ఉండాలని వాంఛించారు. తన అంత్యోపన్యాసంలో వాషింగ్టన్ – ప్రజలను, పార్టీలకు, ముఖ్యంగా భౌగోళిక విభేదాలపై నిర్మింపబడే వాటికి అతీతంగా ఉండమని హెచ్చరించాడు.సాధారణంగా పాక్షిక లక్షణం వల్ల వచ్చే వినాశనకరమైన దుష్ఫలితాలకు గురి కావద్దని గంభీరమైన హెచ్చరిక చేశాడు. అట్టి లక్షణం తఱచు ప్రజలలో తిరుగుబాటులను ఏక్కువచేస్తుంది.

విగ్గులకు, టోరీలకు మధ్య జరిగిన తీవ్ర యుద్ధం వాషింగ్టన్‌కు జ్ఞాపకం ఉంది. దేశపు వివిధ భాగాలలో పార్టీలు బలపడి, అవి పోటీ ప్రభుత్వాల నేర్పాటుచేసి, సైన్యాలు ప్రోగు చేసుకొంటే వచ్చే స్థితిని అతడు గ్రహించాడు. నిజానికి అతడు భయపడినట్లుగానే తరువాత 1861 లో జరిగింది.

జేమ్సు మాడిసన్ ఫెడరలిస్టు పత్రికలో రాజ్యాంగాన్ని ఆమోదించ వలసిందిగా వాదిస్తూ, ప్రజలు పక్షాలుగా చీలిపోవడం వల్ల వచ్చే హింసను ఆపి అరికట్టడానికి తగినట్టుగా – నూతన ఫెడరల్ ప్రభుత్వాన్ని, రూపొందించడం లాభదాయకమని చూపించాడు.

ఉదాహరణకు 'ఎలెక్టొరల్ కాలేజి' అధ్యక్షుని ఎన్నికల్లో పార్టీ రాజకీయాలకు తావు లేకుండా చేయడానికి ప్రత్యేకంగా నిర్మించబడింది. రాజ్యాంగ నిర్మాత లనేకులు అధ్యక్షుణ్ణి ఎన్నుకోబడ్డ రాజు గాను, నేటి ఫ్రాన్సు అధ్యక్షుడు, ఇంగ్లండు రాజు వలె పార్టీలకు అతీతంగా ఉండేవ్యక్తిగాను భావించారు. రాజ్యాంగం మొదట వ్రాయబడినప్పుడు — అన్నిరాష్ట్రాల నుండి ప్రతినిధులు సమావేశమై ఎక్కువతక్కువల విచక్షణలేకుండా ఇద్దరు వ్యక్తులను ఎన్నుకోవాలని నిర్దేశించ బడింది. అప్పుడు అత్యధిక సంఖ్య ఓట్లు వచ్చినవాడు అధ్యక్షుడుగాను, తరువాతి వాడు ఉపాధ్యక్షుడు గాను ఎన్నిక అయినట్లు ప్రకటిస్తారు. ఈ పద్ధతి వలన ప్రజల నిర్ణయంలో అత్యుత్తమ వ్యక్తి, అతనితరువాతి అత్యుత్తమ వ్యక్తి, అధ్యక్ష, ఉపాధ్యక్ష స్థానాలకు తప్పకుండా ఎన్నికకావడం సాధ్య మవుతుం దని భావించారు.

1787లో రాజ్యాంగం రచించబడిన నాటికికూడా నిశ్చితమైన రాజకీయ పక్షాలుగా ప్రజలు సంఘటితం కాకపోయినా, ఆ రాజ్యాంగాన్ని బలపరచ

డమా, లేదా, అనే సమస్యపై వారు చీలిపోయారు. మొత్తంమీద వర్తకులు ధనికులు, మితవాదులు, భూస్వాములు అలెగ్జాండర్ హామిల్టన్ నాయకత్వాన రాజ్యాంగం ఆమోదింప బడాలని వాదించారు. శ్రామికులూ, రైతులూ - ప్రధానంగా స్థానిక రాజకీయ నాయకులూ-స్థానిక స్వపరిపాలన పోతుందనే భయంతో రాజ్యాంగాన్ని వ్యతిరేకించారు. చివరకు రాజ్యాంగం కొద్ది తేడాతో అంగీకరింప బడింది. అయినా ఓటు హక్కు ప్రధానంగా ప్రజలలో ఆస్తి వున్న అల్ప సంఖ్యాకులకే పరిమితమై ఉండడం వల్లనే అలా జరిగింది. కాని జార్జి వాషింగ్టన్ పలుకుబడివల్లా, వర్తకాభివృద్ధులలో రాజ్యాంగం సత్ఫలితాలు తేవడంవల్లా ఇంచుమించు వాషింగ్టన్ రెండవ పదవీకాలం (Second term) పూర్తి అయ్యేవరకూ ప్రతిపక్షాలు ఏర్పడడానికి వీలు లేకపోయింది. తరువాత నూతన అధ్యక్షుడు ఎవరనే సమస్యరాగా, విభిన్న వ్యక్తులను బలపరచే ప్రజలు విభిన్న రాజకీయ పార్టీలుగా విడిపోయారు. ఒక పక్షాన వర్తకులకూ, ధనవంతులకూ నగరాలలో మధ్యతరగతికి ప్రాతినిధ్యం వహించే ఫెడరలిస్టు లున్నారు. వీరు ఈశాన్య రాష్ట్రాలలో బలవంతులు. రెండవ పక్షాన థామస్ జెఫర్సన్ అనుయాయులైన రిపబ్లికనులు. వీరు ముఖ్యంగా [వర్జీనియా వాసులనుండి టెనెస్సీ పనివారల వరకు గల] పల్లె ప్రజలకు, నగరాలలో గల కూలివారికి ప్రాతినిధ్యం వహించేరు.

ఈ విభేదాలు చూచి వాషింగ్టన్ చాలా ఖిన్నుడైనాడు. కాని స్వేచ్ఛ కోరే ఒక జాతి తన సహజ విభేదాలకు పరిష్కారమార్గం తానే చూసుకోవలసి ఉన్నది. అందుచేత అతని మాటలు ఎవ్వరూ లక్ష్యపెట్టలేదు.

ఈ విధంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ఏకపక్షవిప్లవ ప్రభుత్వం ద్విపక్ష విధానంగా అనతికాలంలోనే పరిణమించినది.

1796లో ఫెరడలిస్టులుజయంపొంది జాన్ ఆడమ్స్‌ని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. 1800 వ సంవత్సరం నాటికల్లా రెండుపార్టీలు స్పష్టంగా విడిపోయి అధ్యక్ష,ఉపాధ్యక్షపదవులకు వాటి అభ్యర్థులను స్థిరంగా యేర్పాటు చేసుకొనే స్థితికి వచ్చాయి. థామస్ జెఫర్సన్‌ను ఆరన్‌బర్‌ను అభ్యర్థులుగా నిలబెట్టి రిపబ్లికనులు విజయం పొందారు. కాని వీరిలో ఎవరు అధ్యక్ష స్థానానికో నిశ్చితంగా చెప్పకూడదు కాబట్టి-వీరి ద్దరూ లంకె వేయబడినట్లు

ఉండిపోవలసి వచ్చింది. రాజ్యాంగ విధిప్రకారం సభ జెఫర్సన్‌ను అధ్యక్ష స్థానానికి ఎన్నుకుంది. కాని జెఫర్సన్, సభలో 35 బ్యాలెట్ల తరువాతగాని బర్‌ను ఓడించలేక పోయాడు. ఇందువల్ల ఓడిపోయిన పక్షపు ప్రతినిధులు, గెలిచినపక్షపు ప్రణాళికలను తేలికగా, ఓడించగలరని స్పష్టమయింది.

ఈ అసందర్భ ఫలితం రాజ్యాంగానికి 12 వ సవరణకు దారి తీసింది. తత్ప్రకారం ఎన్నికదారులు అధ్యక్ష, ఉపాధ్యక్ష స్థానాలకు వేరువేరుగా వోటు చేస్తారు. అందుచేత గెలిచిన ఇద్దరు అభ్యర్థులలో ఎవరు ఏ స్థానానికో కాంగ్రెసు నిశ్చయించవలసిన అవసరం తప్పింది. కాని ఈసవరణతో ఎలెక్టరల్ కాలేజిని యేర్పాటుచేసిన ప్రధానోద్దేశ్యం భగ్నమయింది.దేశంలో పార్టీలున్నాయనీ, ఎలెక్టొరల్ కాలేజీలో ఎన్నికదార్లు ముందుగానే తమపార్టీ ఎంచుకొని ఉంచిన అభ్యర్థులకు వోటు చేయడానికి ఒప్పుకొన్న డూడూ బసవన్నలని ఈ సవరణవల్ల అంగీకరించి నట్లయింది.

ఈ సందర్భంలో – నేడు డెమోక్రటిక్ పార్టీకి మూలం అని భావించబడుతున్న జెఫర్సన్‌పార్టీ మొదట రిపబ్లికన్ పార్టీ అని ఎందుకు పేర్కొనబడేదో చెప్పడం భావ్యం.

19 వ శతాబ్దారంభంలో జెఫర్సన్ అనుయాయులు మేము'రిపబ్లికను'లమని చెప్పుకునేవారు. కేవలం వారు రాచరికానికి వ్యతిరేకులనే ఆమాట భావం. అమెరికను విప్లవానికి మంచి అనుకరణ అనే భావంతో వారు ఫ్రెంచి విప్లవాన్నికూడా అభిమానించారు. కాని ఫెడరలిస్టులు ఫ్రెంచి విప్లవంలోని గిలొటిన్ హత్యాకాండను అసహ్యించుకున్నారు. పైగా ఫ్రెంచిరాజు అంటే వారికి సానుభూతి ఉండేది. వారు జెఫర్సన్ అనుయాయుల్ని'డెమోక్రట'నీ, (ప్రజాసామ్యవాదులు) ఫ్రెంచి విప్లవాన్ని అభిమానించేవారని నిందించేవారు. ఆరోజుల్లో డెమాక్రసీ (ప్రజాస్వామ్యం) అనేమాటకు 'వివేక హీన జన బాహుళ్య ప్రభుత్వం' అని అర్థం. కాని నెపోలియన్ పరిపాలించి పోయిన తరువాత ఆ మాట చాలమటుకు ఆ విపరీతార్థాన్ని కోల్పోయింది. కాని, ఇప్పుడు ఫ్రాంక్లిన్ రూజువెల్టు తాను రేడికల్ నని చెప్పుకొనట్లే ఆ రోజులలో జెఫర్సన్‌కూడా తాను డెమాక్రట్ నని చెప్పుకో లేదు.

తాము ప్రారంభించిన బలీయ సమాఖ్యా ప్రభుత్వం జయప్రదం కావడంతో ఫెడరలిష్టులు అనతి కాలంలోనే నాశనమయినారు. ఫెడరల్ యూనియన్ యేర్పాటు కావడంతో దేశం త్వరితగతిని అభివృద్ధి చెందింది. ఎవలా

చియన్ పర్వతాలు దాటి, బహామా, టెనిస్సీలలోకి జనం ప్రవాహంలో ఈశాన్య రాష్ట్రాలను మించి జనాభా పెరిగింది. 1801లో పదవి స్వీకరించిన తరువాత అమెరికా జాతీయ విస్తరణోద్యమం పూర్తి చెయ్యడంలో జెఫర్సన్ తన పాత్రను చక్కగా నిర్వహించాడు. బలీయ సమాఖ్యా ప్రభుత్వాన్ని ఏర్పాటు చెయ్యడానికి అంతకుపూర్వం అతనికిగల అభ్యంతరాలను అతడు విడనాడాడు. మిసిసిపీ నదికి పశ్చిమాన గల లోయ అంతా ఉన్న లూయిజియానా రాష్ట్రాన్ని సాహసించి కొనేశాడు.

ఫెడరలిస్టులు అతనితో పోటీ చెయ్యలేకపోయారు. వారి పార్టీ నాశనమయిపోయి చివరకు వారు 1820లో ఎన్నికల్లో తమ అభ్యర్థినికూడా నిలబెట్టలేకపోయారు. మళ్ళీ దేశం ఏకపక్ష దేశం అయింది. కొన్నిసంవత్సరాలపాటు దేశంలో ప్రతిపక్షం లేదు కాబట్టి ఈ కాలాన్ని 'సామనస్య యుగం' అని అన్నారు. కాని రిపబ్లికన్ నాయకులలో నిరంతర ప్రవర్ధమాన విభేదాలు ఉండి, రెండు పార్టీలు మళ్ళా ఏర్పడ్డాయి. రిపబ్లికనులు రెండుముక్కలుగా చీలిపోయారు. జాన్క్విన్సీ ఏడమ్స్ నాయకత్వాన జాతీయ రిపబ్లికనులు అనే పేరుతో ఒక వర్గం 'యథాస్థితి సంరక్షకవాద' పక్షంగా (కన్సర్వేటివ్) ఏర్పడింది. 1824లో ఏడమ్స్ ఎన్నికైనాడు. కాని 1828లో డెమోక్రటిక్ రిపబ్లికనులు అని పేరు పెట్టుకున్న రెండవ వర్గం వారు ఆంద్రు జాక్సన్‌ను అధ్యక్షునిగా గెలిపించుకున్నారు. 1832 లో జాతీయ రిపబ్లికన్‌లు పోయి 'విగ్గులు' అధికారంలోనికి వచ్చారు. నామ మాత్రమైన ఈవిగ్గులు 'దేశభక్తు' లైన విప్లవ కాలపు విగ్గుల లాటి వారు కాని, ఇంగ్లండులోని విగ్గుల లాటి వారు కారు. ఎన్నికల్లో వోట్లు సంపాదించు కొనడానికి ఆకర్షకరమైన పేరు పెట్టు కొన్న మిత్రవాదులు మాత్రమే! ఈ కాలంలో జాక్సన్ రాజకీయ విధానాన్ని బలపరచే క్రొత్త సరిహద్దు రాష్ట్రాల సంఖ్య పెరగడంతో ఫెడరలిస్ట్-నేషనల్-రిపబ్లికన్ లీగ్ పార్టీ బలం క్షీణించింది. అయినప్పటికి విగ్గులు ఇద్దరు యుద్ధ వీరులను అధ్యక్షులుగా గెలిపించారు. వారు: 1840 లో హెన్రీ హారిసన్, 1848లో జాచెరీటేలర్ లు.

1850లో బానిసత్వ సమస్య విషమరూపం ధరించింది. విగ్గులు, డెమోక్రటిక్ - రిపబ్లికనులు కూడా ఈ విషయమై భేదాభిప్రాయాలు గలవారై ఉన్నారు. ఉత్తర దక్షిణ ప్రాంతాలలోని డెమోక్రట్లు పరస్పరం కలహించారు. లీగ్ పార్టీ చీలిపోయి రిపబ్లికన్ అనే పేరుతో బానిసత్వ వ్యతిరేకత

ప్రధానాశయంగా ఒక పక్షం ఉద్భవించింది. ఆ పార్టీ అభ్యర్థిగా అబ్రహం లింకన్ 1860లో అధ్యక్ష స్థానానికి ఎన్నికైనాడు.

వాషింగ్‌టన్ హెచ్చరించినట్లుగా 1860లో రెండు పక్షాల మధ్య సమస్యలూ భౌగోళిక విభేదాలపై ఉద్భవించినవి కావడంవల్ల మరింత ఉద్రేక యుతమై చివరకు విషమించాయి. ఉద్రేక యుతమైన బానిసత్వ సమస్యతో పాటు-ఎక్కువ ఎగుమతి పన్నులు వేయాలనే ఈశాన్య ప్రాంతీయుల వర్తక ప్రయోజనాలకూ, తక్కువగా వేయాలనే ప్రత్తిపండించే దక్షిణ ప్రాంతీయుల వ్యవసాయ ప్రయోజనాలకూ మధ్య తగాదాకూడా ఒకటి చిరకాలంగా సాగుతున్నది. ఈరెండు విభేదాలు దేశాన్ని భౌగోళికంగా ఒకేవిధంగా విభజించాయి. అందుచేత భిన్న పక్షాల వారు అంతర్యుద్ధానికి సన్నద్ధులు కాగలిగారు. ఈ పని లింకన్ ఎన్నిక కావడంతో ప్రారంభమయింది.

అంతర్యుద్ధ ప్రారంభం నుండీ అమెరికా ప్రజలలో విభేదాలు ఒక్క విధంగా మాత్రమే ఉండలేదు. వారిలో ప్రభవించిన యీ ప్రాదేశిక విభేదం మిగతా చిన్న విభేదాలను అంతమొందించగలంత బలమైన విభేదంకాదు. కార్మిక శాసనాలపై, పన్నుల వ్యయంపై, సాంఘిక రక్షణపై. ఇంకా అనేక విషయాలపై వారిలో విభేదా లున్నాయి. మొత్తంమీద, ధనికులకు నిర్ధనులకు మధ్యా, నగర వాసులకు రైతులకు మధ్యా గల విభేదాలు ఉత్తర దక్షిణ ప్రాంతాల మధ్యా, ఈశాన్య పశ్చిమవాసుల మధ్యా గల విభేదాలను అధిగమించాయి. అందుచేత రెండు ప్రాంతాల మధ్య అంతఃకలహానికి తగిన స్థితి లేకపోయింది.

అమెరికాలో విప్లవాలు కూడా లేకుండా సురక్షితంగా ఉంది. రష్యాలో కెరన్స్కీ విప్లవం లాంటిది-జర్మనీ,ఇటలీలలో హిట్లర్, ముసోలినీల విప్లవాల లాంటివి జరగడానికి కావలసిన స్థితి 1775 నుండి యీ దేశంలో లేదు. ఒకవేళ ఏదైనా తిరుగుబాటు వచ్చినా దేశపు అపార వైశాల్యంలో ఆ తిరుగుబాటు వ్యాపించ గలిగేది కాదు. ఏ తిరుగుబాటూ దేశంలో తగుపాటి ప్రాంతానికి వ్యాపించ లేదన్న భయంవల్ల తిరుగుబాట్లు దేశంలో సంభవించేవి కావు. ఇటలీలో ముస్సోలిని ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి చేసిన దండయాత్రవంటి దానిని అమెరికాలో వాషింగ్‌టన్ నగరంపై జరగడాన్ని మనం ఊహించలేం.

అదృష్టవశాత్తు ఏర్పడిన యీ పరిస్థితులు అమెరికాలోని డెమోక్రటిక్, రిపబ్లికన్ పార్టీలు నేటి స్థితికి రావడానికి ప్రధాన కారణా లయినాయి. ద్విపక్ష వ్యవస్థలో వివిధ రూపాలతో రెండు శతాబ్దాల నిరంతర పరిశోధనా ఫలితంగా అమెరికన్ ప్రజలు-బహు విధ రాజకీయ విభేదాల ప్రవర్తనకు అవకాశమిచ్చేదీ, విప్లవాలను, అంతః కలహాలను నిరోధించేదీ, అయిన ఒక మంచి వ్యవస్థను సాధించ గలిగారు.

అమెరికాలో నేడున్న ద్వి పక్ష విధానం పూర్వాలోచిత ప్రణాళిక ప్రకారం ఏర్పడినది కాదు. అది కేవలం కాలక్రమేణ ఏర్పడినదే. జయించిన పార్టీ ఆధిపత్యాన అత్యధిక సంఖ్యాకులకు అంగీకారమైన ప్రభుత్వాన్ని ఏర్పరచే ఉద్దేశ్యంతో చేసిన యత్నాల ఫలితంగా ఇట్టి వ్యవస్థ సిద్ధించింది. చాలా కాలం పాటు, అధ్యక్ష స్థానమూ, సెనేటు, ప్రతినిధుల సభ ఒకే పార్టీ అధిపత్యంలో ఉండేవి. అయినా ఈ అధికార కాలంలో అల్ప సంఖ్యాక పక్షానికి తాను ఎన్నటికైనా అధికారం వహించ గలననే ఆశ వమ్మై పోయేటంత పెద్ద అఘాతాలూ ఏక్కువ ఎదురవలేదు.

ఈ వ్యవస్థ ఇటు యూరపులోని అనేకపక్ష ప్రభుత్వవ్యవస్థ కంటే అటు బ్రిటనులోని ద్విపక్ష ప్రభుత్వ వ్యవస్థ కంటే భిన్నమైనది. యూరపు వానికిగాని, బ్రిటిష్ పౌరునికి గాని అర్థశూన్యంగా కన్పించినా, యీ అమెరికన్ వ్యవస్థకు చిత్రమైన పద్ధతి ఉన్నది.

యూరపు ప్రజా స్వామ్యంలో చాల పార్టీలున్నాయి. ప్రతి పార్టీకి నిశ్చితమైన, స్పష్టమైన నియమావళి ఉన్నది. ఒకటి క్రిష్టియన్ సమాజ వాద పార్టీ అయితే - మరొకటి కేతలిక్ మితవాద పార్టీ కావచ్చు. చరిత్రగతిలో చిత్రమైన మార్పుల మూలంగా 'రాడికల్ సోషలిస్టు' పార్టీ అనే పేరు గల పార్టీ మధ్య తరగతి వారి వర్తక ప్రయోజనాలకు పాటు పడుతూ ఉండవచ్చు. ఇక కమ్యూనిష్టుల సంగతి చెప్పనే అక్కరలేదు. వాళ్ళకి మంచి క్రమశిక్షణ ఉంటుంది. తమకోసం చేతులు కాల్చుకోడానికి సిద్ధపడిన ఏ అసూయకపు పార్టీతో అయినా సరే వాళ్ళు భుజం కలిపి పనిచెయ్యగలరు.

వేరువేరు విధానాలను సమర్థించే పార్టీలు అనేకం ఉండం వల్ల బహుపక్ష వ్యవస్థలో ఏ పార్టీ విధానం ఇష్ట మయితే ఆ పార్టీని బలపరచే అవకాశం ఉంది. నవీనకాల జీవితం అతి సంకీర్ణమైనది కావడంవల్లా అనేక రాజకీయ, ఆర్థిక, మత సంబంధ సిద్ధాంతా లున్నందువల్లా, అనేక విధానా

లతో పార్టీలు నిప్పు రవ్వల్లాగ ఉద్భవింపవచ్చు. అలాగే ఉద్భవించి నాయి కూడా.

అయితే – పార్లమెంటరీ విధానంలో ప్రజాస్వామ్య ప్రభుత్వానికి పార్ల మెంటులో అధిక సంఖ్యాక పక్ష బలం ఉండాలి. ఎప్పుడు ప్రధానీ, అతని మంత్రివర్గమూ ప్రవేశ పెట్టిన ముఖ్యమైన చట్టం ఆమోదించబడక పోయినా ప్రభుత్వం "పతనం" అయితీరాలి. అప్పుడు ప్రధాని మంత్రి వర్గంతో సహా రాజీనామా ఇవ్వాలి. లేక వాళ్ళ రాజ్యాంగం అనుమతిస్తే, పార్లమెంటును రద్దుచేసి క్రొత్త ఎన్నికలు జరిపించాలి.

అందుచేత ప్రజాస్వామ్య దేశాలలో ప్రభుత్వాన్ని స్థాపించడానికి సామా న్యంగా అధిక సంఖ్యాకుల బలం సమీకరించుకోడానికి అనేక పక్షాల 'సహ కారం' అవసర మవుతుంది. కాని ప్రతిపార్టీ తన విధానం పవిత్రమయిన గంగాజలం లాంటి దనే చెప్పుకుంటుంది. అయితే ప్రజాస్వామ్యాన్ని కూల ద్రోసి నియంతృత్వాన్ని స్థాపించితేనే తప్ప ఏ ఒక్క పార్టీ పూర్తిగా తన విధానాన్ని అమలు జరుపలేదు. అందుచేత ప్రజా స్వామ్యంలో పార్టీనా లంటే ఏ పార్టీ అయినా తన పవిత్రమైన గంగాజలంలో కొన్ని యితరపక్షాల 'మురికి నీళ్ళు' కలపక తప్పదు. అందుచేత అనేక సంయుక్త ప్రభుత్వాలు వచ్చి, పోయి చివరకు నిలచి పని చెయ్యక, ఏ అభ్యుదయమూ సాధిం చక పోయే ప్రమాదం ఉన్నది. అనేక పక్షాలున్నచోట దేశస్వేచ్ఛను కాపా డడానికి తరచు మితవాద, తటస్థ పక్షాల కూటమి ఒకటే శరణ్యం కావడం మరింత నిరుత్సాహకరమైన విషయం.

దేశపు రాజకీయ పరిస్థితిని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ – కుడి ప్రక్కగా ప్రభుత్వాన్ని పడదోసి మరొక ముస్సోలినినో, హిట్లరునో ఏర్పాటు చేయాలని ప్రయత్నించే ఫాసిస్టులు ఉన్నట్లూ, ఎడమ ప్రక్కగా చెకోస్లవేకియాలో వలె ప్రభుత్వాన్ని ఎప్పుడు స్వాధీనం చేసుకుందామా అని పొంచి చూచే కమ్యూనిష్టు లున్నట్లూ ఇరుపక్షాల మధ్యా ప్రజాస్వామ్య విధానానికి అను కూలురు ఉన్న పార్టీలు వసరుగా నిలబడి ఉన్నట్లూ అందులో కొందరు ఎడమ ప్రక్కకూ మరికొందరు కుడిప్రక్కకూ వాలిపోయి ఉన్నట్లూ సామా న్యంగా చిత్రిస్తారు. ఈ స్థితి చాలా ప్రమాదకరమైనది. ఇందువల్ల రెండు నియంతృత్వ పక్షాలూ ప్రజాస్వామ్య పక్షాన్ని చీల్చివేస్తాయి.

ఉదాహరణకు ఫాసిస్టులు కొందరు అమాయకులైన మితవాదుల్ని "దక్షిణ పక్షీయులందరూ నిజానికి ఒకే వర్గానికి చెందినవారే" సనే మాటతో వాళ్ళపార్టీలోనికి ఆకర్షించుకోవచ్చు. "అందరు వామపక్షీయులు ఒక కోవలోవారే" అనే మాటతో కమ్యూనిస్టులు కొందరు అతివాదుల్ని ఐక్య కార్యాచరణకు పిలువ వచ్చు. ఈప్రయత్నాలుసిద్ధిస్తే ప్రజలు అటు ఫాసిస్టు నియంతృత్వాన్నో, ఇటుకమ్యూనిస్టు నియంతృత్వాన్నో ఎన్నుకోవలసిన స్థితి వస్తుంది. ఈలాటి స్థితిలో రెండు రకాల ఆత్మహత్యలలో ఏదోఒకటి వరించ డానికే స్వేచ్ఛ ఉన్నదనే భావం పోవాలంటే – ఈ స్వేచ్ఛా ప్రపంచానికి ముందు నుయ్యో, వెనక గొయ్యో ఉండగా మధ్య మరే మార్గం లేకుండా పడి ఉందనే అలంకారిక వాక్యాన్ని విశ్వసించడం మానెయ్యాలి.

మధ్యలో ప్రజాస్వామిక శక్తు లుండగా ఫాసిస్టులు, కమ్యూనిస్టులు చెరి యొక ప్రక్క ఉండి వారిని లాగుతూన్నట్లు రాజకీయ పరిస్థితులను చిత్రిం డడం మంచి పద్ధతికాదు. నిజమైన చిత్రం – పొడుగైన సన్నని భుజములు కలిగిన త్రిభుజంలాగా ఉంటుంది. అందులో ఒక చివర ప్రజా స్వామిక సంస్థలు, పార్టీలు ఉంటాయి. వారితో పోటీచేస్తున్న నియం తృత్వ శక్తులు మిగత రెండు భుజాల మీద ఉంటాయి. ఫాసిస్టులు అనగా అభివృద్ధి నిరోధకులూ, కమ్యూనిస్టులు అనగా సమూల పరిణామ' వాదులూ ఇరు పక్షాలవారూ కూడా నియంతృత్వ సైనిక రాజ్యాన్ని ఏర్పాటు చేయాలనే ప్రయత్నిస్తున్నారు. ఇంతనూ–ఎవరు ప్రభుత్వాన్ని చలాయించా లనే సమస్యపైనే వాళ్ళలో విభేదం. 1939లో హిట్లరు, స్టాలిన్‌లలాగ వీళ్ళు తరుచు కలుస్తారు. ఫాసిస్టు, కమ్యూనిస్టుపార్టీలు కలిస్తే ప్రభుత్వాన్ని పడగొట్టగల అవకాశం ఉన్న శాసనసభ లన్నింటిలోనూ వీళ్ళిద్దరూ తరుచు ప్రభుత్వాన్ని పడగొట్టే ఆశతో కలిసి వోటు చెయ్యడం కద్దు.

ప్రజాస్వామ్య వ్యతిరేక పక్షాల సభ్యులు ఒక పార్టీ నుండి మరొక పార్టీ లోనికి, ఏ మాత్రం లాభించే అవకాశంఉన్నా, తేలిగ్గా గంతువేస్తుంటారు. ఉదాహరణకు తూర్పుజర్మనీలో కమ్యూనిస్టు ప్రభుత్వం అనేకమంది మాజీ నాజీలను తన సైన్యంలోను, ఇతరత్రాను ఉపయోగించు కుంటోంది.

అమెరికన్ల దృష్టిలో అనేకపక్ష వ్యవస్థలో ఉన్నప్రధానమైన ప్రమాదం- ఎన్నికలు వచ్చినప్పుడల్లా దేశపుస్వేచ్ఛ సర్వమూ ప్రజాస్వామ్య 'తటస్థ– పక్షాల విజయంపై పూర్తిగా ఆధారపడి ఉండడమే. ఎన్నికలు అంటే

స్వేచ్ఛకూ, సర్వవినాశనానికీ మధ్య పోటీ అన్నమాట. ఆ పరిస్థితులలో కాలుతున్న పెనం లోంచి నిప్పులోనికి గెంతడానికి మాత్రమే ప్రజలకు స్వేచ్ఛ. రెండవ ప్రపంచ యుద్ధకాలంనుండి యూరపులోని చాలా దేశాలు ఈ స్థితిలో ఉన్నాయి. ప్రజలకు ప్రభుత్వంఎడల ఇష్టమున్నా లేకపోయినా ఆ కాలుతున్న పెనంమీద కూర్చొని తీరాల్సిందే. దానిమీదనుంచి పడిపోతే నియంతృత్వ శక్తుల మంటల్లోకి – తూర్పు యూరపు దేశాల ప్రజల్లాగ–పడి పోవలసివస్తుంది.

అమెరికన్ వ్యవస్థ ఎంత లోపభూయిష్ఠమూ అసమగ్రమూ అయినా, స్వేచ్ఛాయుతంగా ప్రభుత్వాన్ని నడిపించడంలో భిన్న పద్ధతులను ఎంచు కోడానికి వీలుండడం అందులోని సుగుణం.

జాతీయ రక్షణను నిర్వహించడంలోనూ, అభివృద్ధిని సాధించడంలోనూ లంచగొండితనాన్ని, అనవసర వ్యయాన్ని రూపు మాపడంలోనూ ఒక పార్టీ కన్న మరొక పార్టీకి ఎక్కువ సామర్థ్యం ఉన్నదని ప్రజలు అనుకోవచ్చు. కాని ఒకవేళ తాము ప్రతిఘటించేపార్టీ గెలిచినా, ఆపార్టీ కనీసం అమెరికా క్షేమానికి పాటుపడుతుందనీ, ప్రజాస్వామ్యంకోసం నిలబడుతుందనీ ఒక్క ఎన్నికల జ్వరతీవ్రతలో తప్ప మిగిలిన సమయాల్లో ప్రజలు విశ్వసిస్తారు. ప్రజలు ప్రమత్తుగా ఉన్నపుడు ప్రభుత్వాన్ని కూలదోసి, ఒక వేళ అధికా రాన్ని స్వీకరించినా – దేశాన్ని రష్యాకి అమ్మేస్తే ఆత్మహత్యా సదృశ విధా నాన్ని అనుసరించే సామర్థ్యం గల పార్టీ అమెరికాలోలేదు.

కాని అట్టి స్వేచ్ఛాయుతమైన ఎన్నిక జరగాలంటే ఉన్న రెండు పార్టీల లోనూ సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వాన్ని తగినంత బాగా నిర్వహించడానికి కావలసినంత మంది నాయకులు, అనుయాయులు, వలసిన నియమావళీ ఉండాలి. ప్రజలు తమ ప్రభుత్వం అనుసరించాలని అనుకొనేసూత్రాలను ఆచరించడానికి గెలిచిన పార్టీ శాయశక్తులా కృషి చేయాలి.

అమెరికాలోని ద్వి పక్ష వ్యవస్థలో ఎక్కువ మంది పౌరులు కావాలనికోరే అన్ని నియమాలనూ,కార్యక్రమాలనూ రెండుపార్టీలూ పాటించాలని అంగీక రిస్తే, ట్వీడిల్‌డమ్, ట్వీడిల్‌డీ పక్షాల మధ్య గల సారూప్యం బహు ప్రయో జనకరమనీ, అర్థవంతమనీ బోధపడుతుంది.

ప్రతి పార్టీ తాను అధికారంలోకి వస్తే చేసే పనులు ముందుగా ఆకర్ష కంగా చిత్రించి చూపించడానికి ప్రయత్నిస్తుంది. కాబట్టి అది యించు

మించు ప్రజల ముఖ్యావసరాల నన్నిటినీ ప్రణాళికలో చూపిస్తుంది. అందుచేత అమెరికన్ ప్రజలకు డెమోక్రటిక్ రిపబ్లికన్ పక్షాల విధానాలలో పెద్ద తేడా ఏమీ కనపడక ఆ పార్టీల అభ్యర్థుల మాత్రమే వేరు వేరుగా కనబడడంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు. ఎన్నికల్లో గెలిచి ప్రభుత్వాధికారం హస్తగతం చేసుకోవడమే ఏ పార్టీకైనా లక్ష్యంగాని, తనకు విరుద్ధంగా ఉన్న మరొక సిద్ధాంతాన్ని ఎదుర్కోడం మాత్రం కాదు.

అయితే, ఈ పార్టీలుపూర్తిగా ఒకేవిధమైన ప్రణాళికలతో, కార్యక్రమాలతో భిన్నఅభ్యర్థులను నిలబెడతాయన్న మాట సర్వసత్యంకాదు. 'ట్వీడిల్‌డమ్' అంటే సరిగ్గా 'ట్వీడిల్‌డి' ఎందు కవుతుంది.

అమెరికాలోని డెమోక్రటిక్, రిపబ్లికన్ పక్షాలలో నిజమైన తేడా ఏమిటో విదేశీయునికి ద్విపక్ష వ్యవస్థకు అలవాటుపడిన ఆంగ్లేయుడికైనా సరే-బోధపరచడం అమెరికనుల చాలాకష్ట మవుతుంది. ఎన్నికలమాట అటుంచి రెండు పార్టీల లోనూ మితవాదుల సంఖ్యలో తేడా ఉంది. తరచు అల్ప సంఖ్యాక పక్షం, ప్రభుత్వ పక్షం కంటే ఎక్కువగా దేశ వ్యయం తగ్గించాలని కోరుతుంది. రాష్ట్రాల అధికారాల విషయంలో తరుచు రాష్ట్రాలవైపు మొగ్గు చూపుతుంది. ఇవికాక ఒక పార్టీ కంటే మరొక పార్టీకి ఇష్టమైన స్థానిక ప్రయోజనాలు చాలా ఉన్నాయి.

ఫెడరలిష్టులకు, జెఫర్సన్ అనుయాయులకు మధ్య గల పాత విభేదాల నీడలు ఇంకా మిగిలి ఉన్నాయి. కొంతమంది రిపబ్లికనులు వర్తక ప్రయోజనాలను ఎక్కువగాచూస్తే, కొందఱు డెమోక్రట్లు శ్రామికుల ప్రయోజనాల కోసం ఎక్కువగా పాటుపడతారు. కాని ఇరుపక్షాలలోను ఈ సూత్రానికి విరుద్ధవిషయాలు చాలాఉన్నాయి. కాంగ్రెసులో అలవాటు ప్రకారం జాతీయ అంతర్జాతీయ సమస్యలపై ముఖ్య శాసనాలు ప్రతిపాదించ బడినప్పుడు సభ్యులు అధిక సంఖ్యాక, అల్పసంఖ్యాక వర్గాలుగా చీలి పోవడం జరుగుతుంది. కాని ఆ చీలిక ఎప్పుడూ ఒకేవిధంగా ఉండదు.

కాని, తాత్కాలిక సమస్యలతోగాని ఎన్నికల్లో నిలబెట్టిన అభ్యర్థితోగాని, ప్రసక్తి లేకుండా ఎప్పుడూ ఇటు డెమోక్రటిక్ పార్టీకో, అటు రిపబ్లికన్ పార్టీకో వోటు చేసే వ్యక్తులు ఏ పార్టీలోనూ ఎన్నికల్లో అధిక సంఖ్యాక బలాన్ని సమకూర్చగలిగినంత మంది ఉండరు. అమెరికనుల ఉద్దేశ్యంలో

ఈ లక్షణంకూడ ద్విపక్షవ్యవస్థకు అవసరమయిన లక్షణాలలో ఒకటి. ఒక పార్టీయే ఎప్పుడూ గెలుస్తూంటే – ప్రజలకు ఏకపక్ష వ్యవస్థలో ఉన్నట్టే ఉంటుంది. అప్పుడు 1824లో 'డెమోక్రటిక్ – రిపబ్లికన్' లు చేసినట్లు– పార్టీయే రెండువర్గాలుగా చీలవలసివస్తుంది. ద్విపక్ష వ్యవస్థ సక్రమంగా పనిచేస్తున్న దశలో ఎన్నికల్లో జయాపజయాలను ఏ పార్టీకీ చెందని తటస్థ వర్గం – అంటే రెండుపార్టీల పనులను పరిశీలించి, ఎవరికి వోటు వేయాలో నిశ్చయించుకునే వాళ్ళవర్గం – నిశ్చయిస్తుంది. ప్రతి ఎన్నికల్లోను ఈతటస్థ వర్గంవారు 'డెమోక్రటిక్-రిపబ్లికన్'ల మధ్య ఉన్న తేడా విషయంలో ఆ రోజుల్లో ఉన్న అభిప్రాయాన్ని ఆధారంగా చేసుకుంటారు. సామాన్యంగా డెమోక్రట్లకన్న రిపబ్లికనులను ఎక్కువ మితవాదులుగా ఎంచుతారు-ఆ పదానికి ఆరోజుల్లో వాళ్ళ అర్థం ఏమైనాసరే! తరువాత ఆనాడున్న అభివృద్ధి, లంచగొండితనం, శాంతి వంటి సమస్యలను గురించిన భావాలేన్నో వాళ్ళ మీద పనిచేస్తూంటాయి. కాని చాలవఱకు వీళ్ళు రెండు పార్టీల అధ్యక్ష అభ్యర్థుల వ్యక్తిత్వాలనుపోల్చి వోటుచేస్తారని చెప్పవచ్చు.

సంయుక్త రాష్ట్రాలలో కొన్నిరాష్ట్రాలు పూర్తిగా డెమోక్రటిక్ పార్టీవి, మరి కొన్ని రాష్ట్రాలు పూర్తిగా రిపబ్లికన్‌పార్టీవి కావడం ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రధాన లోపంగా ఎంచబడు తున్నది. కాని రాష్ట్రంలో బలమైన పక్షపు ప్రాథమికఎన్నికల్లో ప్రతర్థులలో కొందరిని ఎన్నుకొనే అధికారం ఉన్నా, ఈ రాష్ట్రాలకు ఫెడరల్ ఎన్నికల్లో పాల్గొనే అధికారం నిజానికిలేదు. ఈ ఏకపక్ష రాష్ట్రాలు జాతిమొత్తంపై జరిగే ఎన్నికల్లో ప్రముఖపాత్ర వహించ లేవు కాబట్టి, దేశపు ప్రజాస్వామ్యం సురక్షితంగా ఉన్నది. అభ్యర్థులతోను, తత్కాలపు సమస్యలతోను ప్రసక్తిలేకుండా 'ఉమ్మడిగా' ఒక పార్టీకే వోటు చేసే వర్గం-మత సంబంధమైనదిగాని, జాతి భావయుతమైనది కాని-లేకపోవ డం అమెరికా దేశపు అదృష్టం. వివిధ పార్టీల విధానాలను, వారి అభ్యరుల మంచినిచూసి స్వేచ్ఛలో ఎన్నుకునే అధికారంగల వోటర్లచే తరచు నిశ్చ యింపబడే ఎన్నికలమీద ప్రజాస్వామ్యం ఆధారపడి ఉంటుందని అమెరి కనుల అభిప్రాయం. బ్రిటన్‌లో ఇందుకు కొంచెం భిన్నంగా ఉండే ద్విపక్ష వ్యవస్థ ఉన్నది. అక్కడ లేబర్ కన్సర్వేటివ్ పక్షాలమధ్య అమెరికాలోని డెమోక్రటిక్ రిపబ్లికన్ పక్షాలకంటే విధానాలలో, నియమాలలో ఎక్కువ అంతరం ఉన్నదని బ్రిటిష్‌వారి నమ్మకం. అది నిజమైతే ఆ అంతరానికి కారణంకూడా ఏదోఒకటి ఉంటుంది.

సక్రమమైన ద్విపక్ష వ్యవస్థలో అంతఃకలహానికి దిగకుండా పౌరులు తమ యిష్టంవచ్చిన పార్టీని ఎన్నుకోడానికి అవకాశంఉంటూ, వారు శాంతి యుతంగా సాధించడానికి వీలయినంత విధాన వైవిధ్యాన్ని సాధించాలని వాంఛిస్తారనేది-ఇందుకు మంచికారణం అయి ఉంటుంది. కాని అమెరికా ప్రజలకు వారి పురోగమన మార్గం విషయంలో తీవ్ర భేదాభిప్రాయాలు ఏవీ లేవు. ఉన్న రెండు బలీయ పక్షాలలోను ఏసీ నియంతృత్వానికిగాని, ఆర్థిక వినాశనానికిగాని ఇంక ఏవిధమైన సంక్షోభానికిగాని దారితీయాలని కోరదు. కాని ఈ మార్గంమాత్రం చాల విశాలమయింది. అందులో అనేక చిన్న, పెద్ద సందులున్నాయి. కొన్నిచోట్ల అడ్డదారులు త్రొక్కడానికి అవకాశాలున్నాయి. పార్టీలలో తరుచు ఈ మార్గంలోని గమన తీవ్రత విషయంలోనే తేడాలు ప్రధానంగా కనిపిస్తాయి. అప్పుడు ఎన్నికల్లో జనుల అభిప్రాయాలకు ఆ తేడాలు ఆధారమౌతాయి.

అధికారం ఉన్నపార్టీకి ఉన్నబలాన్ని తమవైపుకు తిప్పుకొనడానికి ప్రజలకు అసంతృప్తికరంగా ఉన్న విషయాలను, వాప విమర్శించే విష యాలను ఏరి ప్రతిపక్షం తన ప్రణాళికలో చేర్చుకుంటుంది. కాని అసంఖ్యాక ప్రజానీకాన్ని భయపెట్టేసి దూరంగా తొలగద్రోసే విషయాల్ని మాత్రం రెండుపార్టీలూ దగ్గరకు రానీయవు. సమర్థులైన, కార్యవాదులైన, రాజకీయ వేత్తలు ఎంచుకునే సమస్యలు-రెండు పార్టీలూ వీలున్నంత ఎక్కువ భిన్న త్వాన్నికలిగి ఉంటూ, ఏపార్టీకి "రాజ్యాంగాన్ని కూలద్రోయాలనే వాంఛ ఉన్నదనే నింద రాకుండా" ఉండేవిగా ఉంటాయి.

బ్రిటిష్ పార్టీలు ఒకదానికొకటి మరింత దూరంగా ఉన్నాయంటే - అందుకు కారణం-బ్రిటిష్ రాజకీయ నాయకులు తాము ఎన్నుకోబడితే విపరీతమైన మార్పులు తేగలమని వాగ్దానాలు చేయ గలగడమే! మొదటి ప్రపంచ యుద్ధసమయంలో మొత్తం ఐర్లండు ప్రజలు విప్లవం తెస్తామని భయపెట్టి నప్పటినుంచైనా - బ్రిటిష్ ప్రజలు, అమెరికన్ ప్రజలకం తక్కువగా ఉద్రేకం కలవారుగా ఉన్నారు. వాళ్ళు చర్చిల్ వైపునుండి అట్లీవైపుకి. అట్లీవైపునుండి చర్చిల్ వైపుకి తుపాకుల సహాయం లేకుండానే మారిపోగలరు. అమెరికనులు దేశంలో సోషలిస్టుల విజయాన్ని అంత శాంతియుతంగా అంగీకరించక పోవచ్చుగాని, వాళ్ళుకూడా హూవర్ పక్షం నుండి రూజ్‌వెల్ట్ పక్షానికి, ట్రూమన్ పక్షంనుండి ఐసెన్‌హోవరు పక్షానికి

అంతఃకలహం లేకుండానే మారగలరు. ఆచరణ సాధ్యమైన ద్విపక్ష విధానంలో రెండు పార్టీలమధ్య నిజంగా ఉండే అంతరానికి దీనిని కూడాఒక-నిర్వచనంగా గ్రహించవచ్చును.

అందుచేత డెమోక్రటిక్, రిపబ్లికన్ పార్టీలలో పరస్పర విరుద్ధ గుణాలు వివిధ ప్రమాణాలలో అనేకం ఉన్నాయి. కనుక ఆ పార్టీ ఎప్పుడూ నాశనమై పోయే స్థితిలోనే ఉంటుంది. కాని వచ్చే ఎన్నికల్లో గెలవాలనే నాయకుల ఆసక్తి పార్టీని విచ్ఛిన్నం కాకుండా అట్టిపెట్టుతుంది. కాని కొన్ని సమయాల్లో తిరుగుబాటు తత్వంగల ఒక్కొక్క నాయకుడు తన పార్టీనుండి బయటికీ వచ్చి, మూడవపార్టీని స్థాపించవచ్చు. సామాన్యంగా పాతపార్టీ విపరీత మితవాదపద్ధతిని అనుసరిస్తున్నదనే భావం ఈపనికి కారణమవుతుంది. ఈవిధంగా 1912 లో రిపబ్లికన్ పార్టీనుండీ థియోడోర్ రూజ్‌వెల్ట్ బయటికివచ్చి, ప్రోగ్రెసివ్ పార్టీ (లేక బుల్ మూస్ పార్టీని) స్థాపించాడు. 1924 లో రాబర్ట్ లాఫొలెట్టి ది ఎల్డర్ ప్రోగ్రెసివ్‌గానే మారాడు— ఇదికూడా రిపబ్లికన్ పార్టీ నుండి రాలిన నిప్పురవ్వే! 1948లో డెమోక్రటిక్‌పార్టీనుండి రెండు'రవ్వల పార్టీ'లు అవిర్భవించాయి. వాలెస్ అనుయాయులైన ప్రోగ్రెసివ్‌లు డెమోక్రటిక్ పార్టీని అతి మితవాద పక్షమని విమర్శించారు. డిక్సిక్రాట్‌లు దాన్ని అతి తీవ్రమయిన పక్షమని విమర్శించారు. కాని 1912లో బుల్ మోజుల్ల చీలికవల్ల రిపబ్లికన్‌లుఓడిపోయి వుడ్రోవిల్సన్ గెలవడానికి అవకాశంకలిగినా ఈ కుక్కగొడుగులేవీ, పాతపార్టీని నాశనంచేసి ఆ స్థానాన్ని ఆక్రమించలేక పోయాయి.

ఏదో ఒక సూత్రం విషయంలో పేచీపడి, ఆ సూత్రమే ప్రాతిపదికగా స్థాపింపబడడంవల్ల ఆ సూత్రాన్ని అంగీకరించే వారిని మాత్రమే ఆకర్షించ గలగడం — ఈ తృతీయ పక్షాలలోని ప్రాథమిక దౌర్బల్యం. ఈ 'రవ్వల పార్టీ'ల అనుయాయులు చాలమంది దేశంలో డెమోక్రటిక్, రిపబ్లిక్‌పక్షాలను నాశనంచేసి, మొత్తంపార్టీ వ్యవస్థ సంతతిని రాజకీయ సిద్ధాంతాలను అధారంగా పునర్మించాలని బహిరంగంగా చెప్తారు.

మితవాదులూ, జాతీయ ఫాసిస్టులు తీవ్ర దక్షిణ పక్షీయులూ అందరూ ఒక్క పక్షంలోఉండాలనీ, మిగిలిన లిబరల్స్ అందరూ, కమ్యూనిస్టులనూ తీవ్ర వామపక్షీయులను కూడా కలుపుకోగల అభ్యుదయ పక్షంలో ఉండాలని వారి ఆకాంక్ష. అప్పుడు ప్రజలకు ఎంచుకోడానికి నిజమైన వీలున్నద వారంటారు.

కాని ఈ విధంగా గొర్రెలనుంచి మేకలిని వేరుచెయ్య చూడడం ఆత్మహత్యాకరమైన కుతర్కం తప్ప మరేమీకాదు. ప్రజాస్వామ్యం నాలుగు కాలాలపాటు నిలచి ఉండదలుచుకుంటే స్వేచ్ఛను—అది ఎంత అసమగ్రమైనదైనా సరే—సంరక్షించుకోడానికి అవకాశం కలిగించగల పార్టీ వ్యవస్థను ఇవ్వాలి. అనేక విరుద్ధప్రయోజనాలను అంతర్యుద్ధానికి దిగకుండా ఏదోవిధంగా సరిపెట్టడానికి తగిన వ్యవస్థ అమెరికాలోని పార్టీలకు ఉంది. అది బహు లోపభూయిష్టమై, అర్థహీనమైన ఒడంబడికలతో కూడినదై ఉండవచ్చు. కాని అంతవరకు అది నాశనం కాకుండా పటిష్టంగా నిలచి ఉండగలిగింది.

అమెరికాలోని రెండు బలీయపక్షాలనూ సారథ్యంవహించే కార్యవాదులైన రాజకీయ వేత్తలలో ఎక్కువమందికి సిద్ధాంత ప్రాతిపదికమీద విరుద్ధపక్షాల నిర్మాణం అభిమతం కాదు. నిరాశోపహతులైన వోటర్లు తమ పార్టీ నుండి విడిపోయి తృతీయ పక్షం ఏర్పరిస్తే వాళ్ళు తలుపులు బిడాయించుకోరు. వీలయినంతమంది తృతీయ పక్షాభిమానులను తిరిగి తమ పార్టీనీడలో చేర్చుకోడానికి రాజీ ప్రతిపాదనలనేకం చెయడానికి వారు వెనుకాడరు. వోటర్లనందరినీ భయపెట్టేటంతటి భయంకరులైన నాయకులను మాత్రం తమ పార్టీలోకి రానీయకుండా నిరోధిస్తారు. ఈవిధంగా విడిపోయిన వారినందఱను తిరిగి కూడకట్టుకొనడంలో ప్రత్యేకాసక్తి ద్విపక్ష వ్యవస్థకు ప్రధాన బలం.

ఉన్న పెద్దపార్టీలలో ఏదో ఒక దానిని భయపెట్టే తృతీయ పక్షాలతోపాటు అసంఖ్యాకంగా చిన్న పార్టీలు చాలఉన్నాయి. ఇందులో కొన్ని స్థానికంగా పెద్దపార్టీలే కావచ్చు. రైతు, కూలీ పార్టీ, ప్రోగ్రెసివ్ పార్టీల వంటివి మధ్య పశ్చిమ ప్రాంతం Midwest లో ఈ శతాబ్ద ప్రారంభంలో రాష్ట్రపు ఎన్నికలలో గెలిచాయి.

మిగిలిన చిన్న పార్టీలు దేశవ్యాప్తంగా పనిచేసేవే అయినా అవి కొన్ని లక్షల వోట్లకన్నా ఎక్కువ ఎప్పుడూ తెచ్చుకోలేవు. వాటి సభ్యులు రాష్ట్రపు ఎన్నికల్లోనైనా గెలుస్తామని ఆశించరు. అయితే సోషలిస్టులు మాత్రం మిల్వాకీ, బ్రిడ్జిపోర్ట్ నగరాలను చాల కాలం పాటు పాలించారు. కొద్దిమందే అయినా, ఉత్సాహవంతులైనట్టి, తమ అనుయాయులను సంఘటిత పరచుకొని చిన్నపార్టీలు ఎన్నికల్లో నిలబటడానికి ముఖ్య కారణం — తమకు వచ్చే వోట్లను త్రిప్పుకోడానికైనా తమ విధానాన్ని పెద్దపార్టీలు అనుసరిస్తా

యనే వారి ఆశ. తమ నాయకులను ప్రభుత్వంలోకి పంపనక్కరలేకుండానే ప్రజామోదం పొందడానికి అవసరమైన పరిపక్వతరాని భావాలను ప్రజలలో ప్రచారంచేయడానికి ఈ చిన్నపార్టీలు పనికివస్తాయి. ఉదాహరణను 20 వ శతాబ్దారంభంలోని సోషలిస్టు భావాలనేకం మారువేషాలతో ఇప్పటి రిపబ్లికన్ డెమోక్రటిక్ పార్టీ విధానాలలో ముఖ్య భాగాలు అయినాయి. అలాగే ఒకానొకప్పుడు మద్య నిషేధవాదులు తమ ప్రతిపాదనను రాజ్యాంగానికి సవరణగా అంగీకరింపచేయగలిగారు. లిబరల్ పక్ష అభ్యర్థిని అయాచితంగా బలపర్చడం మూలంగానో, అభివృద్ధినిరోధక అభ్యర్థికి వోట్లువేయించడం ద్వారానో కమ్యూనిస్ట్ పార్టీకూడా తనచేతిలో కొద్ది వోట్లే ఉన్నా, ఎన్నికలలో కొంతవరకు ప్రాముఖ్యత వహిస్తున్నది. ఇక-ఎన్నికలలో ప్రముఖపాత్ర తీసుకొనే అదృశ్యశక్తుల విషయం చెప్పనిదే సంయుక్త రాష్ట్రాంలోని పార్టీ వ్యవస్థను పూర్తిగా వర్ణించినట్లుగాదు. ఈ వర్గాలు ఎన్నికల్లో ప్రత్యక్షంగా పాల్గొనవు. ఒక అభ్యర్థిని వీరు ఎన్నికలకు గెలిపించ దలచుకొన్నప్పుడు ఏదోఒక పెద్దపక్షం ఆ అభ్యర్థిని నిలబెట్టేటట్టు చేస్తారు.

ఉదాహరణకు సంయుక్తరాష్ట్రాలలో జాతీయ కార్మికపక్షం ఒకటి లేకపోవడానికి కారణం — అమెరికన్ కార్మిక సమాఖ్యా బహుకాలం క్రితమే కార్మికుల వోట్లకోసం రెండు పెద్దపక్షాలు పోటీపడేటట్టు చేయడానికి నిశ్చయించుకొనడమే. తమకు స్నేహపాత్రులైనవాళ్ళకు - ఒకచోట రిపబ్లికన్ అభ్యర్థి కావచ్చు, మరియొకచోట డెమోక్రటిక్ అభ్యర్థి కావచ్చు — కార్మిక నాయకులు తమ సహకారం ఉంటుందని ప్రకటిస్తారు. ఓడిపోయే పక్షానికే తమబలం అంతా ధారపోసేబదులు, గెలిచే పక్షంలో కూడా తమకు ప్రాపకం ఉంచుకోవడంవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందని వారి నమ్మకం. పైగా—అమెరికాలో కార్మికవర్గం అనేది ప్రత్యేకంగా ఒకటి ఉన్నదా అనేది సంశయాస్పద విషయం. అమెరికన్ కార్మికులు ఎల్లప్పుడూ తమ సంఘనాయకుల ఆదేశానుసారమే వోట్లు వేయరు. 'వర్గచైతన్యం' కొన్ని యూరపు దేశాలంతగా ప్రముఖపాత్ర వహించ దనడానికి ఇదొక గుర్తు.

రాజకీయాలలో పాల్గొనే ఇతర సంస్థః సంయుక్తరాష్ట్ర వాణిజ్యసభ, వర్తకులకు ప్రాతినిధ్యం వహించే జాతీయ ఉత్పాదక సంఘం, వ్యవసాయ క్షేత్ర సంఘ సమాఖ్య, వ్యవసాయదారుల సంఘం, స్త్రీ వోటర్ల సంఘం మహిళా సమాజాల సమాఖ్య, అమెరికన్ మాజీ యుద్ధ సైనికుల దళం, అమెరికన్ విప్లవపుత్రికల సంఘం (D. A.R.) ఇత్యాదులు.

దేశ శ్రేయస్సుకోసం ప్రజా వ్యవహారాలను పరిశీలించే సంఘాలకూ, స్వప్రయోజనాల కోసం శాసన సభ్యులలో ప్రాపకాన్ని సంపాదించి పని చేసే సంఘాలకూ మధ్య న్యాయశాసనం పన్నుల విషయంలో కొంత విచక్షణత పాటిస్తుంది. 'లాబీలు' అని వర్గీకరించబడిన వర్గాలకుగాని, రాజకీయ పార్టీలకుగాని విరాళాలుగా వచ్చే మొత్తాలను ఫెడరల్ పన్ను కట్టవలసియున్న ఆదాయం నుంచి మినహాయించడానికి వీలులేదు.

ఈ విధంగా దేశంలోని ప్రధాన రాజకీయ పక్షాలు బహువిధ పరిస్థితుల, బహువిధ శక్తుల ఒత్తిడికి లోబడి పనిచేస్తూ ఉంటాయి. అవి కేవలం వోటు వారుని కోరికలు తీర్చడానికే పనిచేయవు లేక కేవలం తెరవెనుక రాజకీయ నాయకుల ప్రయోజనాల కోసమే వర్తించవు. ఈ రెండుపార్టీల చుట్టూ కూడా భిన్నపక్షాలు, ప్రత్యేకసంస్థలు – తమకు కావలసిన దానిని వాగ్దానం చేస్తే తాము ఇప్పించగల వోట్లు వేలకొద్దీఉన్నాయనీ, లేకపోతే ఆవోట్లుఎదరి పక్షానికి పడతాయని భయపెట్టేవి–ఉంటాయి. ఎన్నికల్లో తమకు విజయం చేకూర్చే వాగ్దానాలు చేయడమూ, కాల క్రమాన తదనుగుణంగా వ్యవహరించడమూ పార్టీ నాయకుల బాధ్యత.



# పార్టీ నిర్మాణం : నిర్వహణ

అమెరికా అధ్యక్షుని ఎన్నికల్లో మొదట పార్టీలు తలయెత్తినపుడు వాటికి దేశవ్యాప్త నిర్మాణం లేదు. అప్పుడు జాతీయ విధానాలలో అభిప్రాయ భేదాలూ, అధ్యక్షపదవికి పోటీపడే భిన్న జాతీయనాయకులూ మాత్రమే ఉండేవారు. కాంగ్రెస్ విభిన్న కూటాలుగా చీలిపోయి 'కాకస్' అనే సభలుగా చేరి అధ్యక్షపదవికి అభ్యర్థులను ఎన్నుకొనేది. కాని ఈ 'కాకస్' సభలు అనతికాలంలో అప్రతిష్ఠ పాలయినాయి. కాంగ్రెస్‌లో సభ్యులు కాని పార్టీ నాయకులు, ఎన్నికలోనే కాకుండా అభ్యర్థుల ప్రతిపాదనలో కూడా తమకు పలుకుబడి ఉండాలని కోరారు. మితిమించి వోటర్ల మనసులకు నొప్పి కలిగించి వారి వోట్లు పోగొట్టుకోకుండా చూచుకుంటూ అభ్యర్థుల ప్రతిపాదనల విషయంలో తమ ఆధిపత్యం ఉంచుకోడానికి సమర్థులైన రాజకీయ వేత్తలు పడిన శ్రమతోనే చాలవరకు దేశంలోని పార్టీల చరిత్రనడచింది.

**1824** లో డెమోక్రటిక్-రిపబ్లికన్ 'కాకస్' సభ ఆండ్రూ జాక్సన్‌ను అభ్యర్థిగా ప్రతిపాదించక పోవడంతోవోటర్లు ఆశాభంగం పొందారు. ఈ తప్పును నాలుగు సంవత్సరాల అనంతరం సవరించుకొని జాక్సన్‌ను ఎన్నుకొన్నప్పటికీ, అభ్యర్థులను ప్రతిపాదించడంలో 'కాకస్'పద్ధతి మాత్రం అగౌరవం పాలయింది. అప్పుడు ప్రతి స్పర్ధులైన ఇరుపక్షాలవారూ సమావేశాలు (Conventions) జరపడం అరంభించారు. స్థానిక సమావేశాలు రాష్ట్ర సమావేశాలకు ప్రతినిధులను ఎన్నుకొనేవి. ఈ సమావేశాలు స్థానిక, రాష్ట్ర దేశీయ పదవులకు అభ్యర్థులను ఎన్నుకొనేవి. ఈపద్ధతివల్ల పార్టీలో పనిచేసే వ్యక్తుల కందరికీ వారి వివిధములైన అంతస్థుల కనుగుణంగా సమావేశమయి వోటుచేసే అవకాశం లభించింది. కనుక-ఇది ఒకవిధంగా ప్రజాస్వామిక పద్ధతే అని భావించారు. కాని, పార్టీలో సభ్యుడుకాని సామాన్యుడైన వోటరుకు ఎన్నికల రోజున తప్ప మరెప్పుడూ మాట చెల్లుబడి ఉండేదికాదు. ఈలోపాన్ని చాలామంది విమర్శించారు. అందుచేత కాలక్రమాన చాలా రాష్ట్రాలు ప్రాథమిక (ప్రైమరీ) ఎన్నికల విధానాన్ని అనుసరించాయి.

చాల రాష్ట్రాలలో నేడు ఎన్నికల సంవత్సరాలలో వసంత ఋతువులోనో, వేసవి అరంభంలోనో ప్రాథమిక ఎన్నికలు జరుగుతున్నాయి. ఈ ఎన్నికల్లో ఈ స్థానిక, రాష్ట్ర పదవులకూ కాంగ్రెస్‌కూ అభ్యర్థులను ఎంచుకుంటారు. కొన్నిరాష్ట్రాలలో జాతీయ సమావేశానికి ప్రతినిధులను కూడా ప్రాథమికపు

ఎన్నికలలో ఎన్నుకుంటారు. ఆ ప్రతినిధులు జాతీయ సమావేశంలో కనీసం మొదటి కొన్ని వోట్లైనా ఫలానా అధ్యక్షస్థానపు అభ్యర్థికి వేస్తామని వాగ్దానం చేయవలసిరావచ్చు. అలాకాక ఒక్కొక్కప్పుడు ప్రాథమిక ఎన్నికల్లో వోటరే స్వయంగా అధ్యక్షపదవికి తనకు ఇష్టమైన అభ్యర్థిని సూచించే అవకాశం కూడా ఉండవచ్చు.

రిపబ్లికన్ పక్షంకాని, డెమోక్రటిక్ పక్షంకాని అధ్యక్ష అభ్యర్థికి తన ప్రతిపాదనను సిద్ధంచేసుకొని సమావేశమయ్యేస్థితి ఈ ప్రాథమిక ఎన్నికలలో ఇంకా ఏర్పడలేదు. ప్రాథమిక ఎన్నికల్లో విజయంపొంది కూడా జాతీయ సమావేశాలలో ప్రతిపాదించబడే అదృష్టానికి నోచని అభ్యర్థులు సహజంగా అధ్యక్ష ప్రతినిధులను ఎన్నుకొనే రాష్ట్ర ప్రాథమిక సభలసంఖ్యా అధికారం ఎక్కువచేయాలని కోరుతారు. కాని, సమావేశాలను నడిపించే రాజకీయ వేత్తలుమాత్రం ప్రాబల్యం తమ చేతిల్లో ఉండాలని వాదిస్తారు.

అధ్యక్ష స్థానానికి తమ పార్టీ అభ్యర్థిని నియమించే అధికారం జాతీయ సమావేశానికి ఉన్నంతకాలమూ ఆ సమావేశం అమెరికన్ ప్రజలు ఆసక్తితో పాల్గొనే మహోత్సవంగా ఉండేది.

సమావేశ రంగస్థలంమీద అల్లకల్లోలంగా గందరగోళంగా ఉన్న సభ్యులను చూస్తూన్న ప్రజలకు ఇలా విచ్చలవిడిగా గోల చేసే ఈ మందచేత అధ్యక్షుడు ఎన్నుకొనడానికి ఒక గొప్ప ప్రజాస్వామిక దేశం ఎలా అంగీకరిస్తున్నదా అని ఆశ్చర్యం కలగడం సహజం. కాని, అలా ఊహిస్తే పైకి కనిపిస్తున్నదాన్ని మాత్రమే చూచి అదే సత్యమని అనుకోవడం అవుతుంది. అక్కడ ఉన్న ప్రతినిధులు అధ్యక్షుణ్ణి ఎన్నుకోవడంలేదు- వాళ్ళు పార్టీలోని ఇతర సభ్యులతో పరిచయం చేసుకుంటూ వారిని ఉత్సాహ పరుస్తున్నారు. అంతే. ఈ లోపున సమర్థులైన రాజకీయ నాయకులు తెరవెనుక ఉండి,వారి బలాబలాలుసరిచూచుకొని పార్టీని ఏకంచేసి,ప్రజలవోట్లను సంపాదించేసామర్థ్యంగల అభ్యర్థినినిర్ణయిస్తారు. కాని, అంతమాత్రాన నాయకులుప్రతినిధుల అభిప్రాయాన్ని అలక్ష్యం చేయరు. కాని, మనకు కనిపించని చిన్న చిన్న సభలలో వాళ్ళ అభిప్రాయాలను ఏకోన్ముఖంగా చేస్తారు.

ఈలోపున సమావేశాలలో ప్రదర్శకులు, ప్రతినిధులు, బ్యాండు వాయిద్యాలతోను, మార్చింగ్‌తోను, ఉష్ణమండలపు వేసవి వేడిమితోను, ఉడుకెత్తి

పోతూఉంటారు. చివరకు అభ్యర్థి ప్రతిపాదన పూర్తిఅయ్యేసరికి యీ కోలాహలం పరాకాష్టకు చేరి, పరాజిత ప్రతినిధి సమూహం కూడా ఉత్సాహంతో చివరకు ఈ గుంపులో చేరి హర్షధ్వానాలు చేసేటంతగా విజృంభిస్తుంది.

ఇదంతా టెలివిజన్‌తెరమీద చూస్తున్నవారనేకులకు యిది అనాగరికంగా కనిపిస్తుంది. నిజానికి ఇది కొంతవరకు అనాగరికమే! కాని మానవజాతి అభ్యుదయంలో యుద్ధనాట్యానికి సుదీర్ఘమైన, ఫలవంతమైన చరిత్రఉన్నది కదా! ప్రపంచమంతటా అనాగరిక ప్రజలుతమజాతిని ఏకంచేసి,సోమరులలో ఉత్సాహంరేకెత్తించి,యుద్ధాలకు పురికొల్పడానికై సహజంగాయుద్ధనాట్యానే వినియోగించారు. అందుచేత జాతీయ సమావేశాలను ఏర్పాటు చేసిన రాజనీతిజ్ఞుల స్వభావాన్నికూడా బహుశః అంతతేలికగా త్రోసివేయకూడదేమో!

కాని, టెలివిజన్ ఉపయోగిస్తే – జాతీయ సమావేశపు అవలక్షణాలు చాలా తెలగిపోగలవు. ఒక్కొక్కరికి అరవోటు చొప్పున ఇద్దరేసి ప్రతినిధులను జంటగా పంపే మామూలు అలవాటును టెలివిజన్ మార్చివేయడం మాత్రం నిశ్చయం. ఇందువల్ల వోట్లువేయడంలో విపరీతమైనఆలస్యం జరుగుతూ, కాలయాపన చేయడం కోసం ప్రయత్నించే రాజకీయ నాయకులకు కొంత అనుకూలించ వచ్చు. అంతేకాక – ఒక ప్రతినిధివర్గ నాయకుడు 1952లో చెప్పినట్లుగా–టెలివిజన్‌లో కన్పించాలనే వాంఛ ఉన్న ప్రతినిధుల 'కీర్తి కాంక్ష' దీనివల్ల తీరవచ్చు. కాని,టెలివిజన్ ప్రేక్షకులు మాత్రం దీనివల్ల విసుగెత్తిపోతారు; వోటర్లను విసిగించడం విరస రాజనీతి గదా! చాలా టెలివిజన్ కెమేరాలకు దూరదర్శక కటకాలుంటాయనీ, చాలమంది బధిర పేక్షకులకు పెదవుల కదలికవల్ల మాటలు గ్రహించే నేర్పు ఉన్నదనీ తెలుసుకోవడంవల్ల సమావేశంలో ప్రతినిధుల ప్రవర్తన కూడా బాగుపడే అవకాశమున్నది! కాని, జాతీయ సమావేశాల నిర్వహణ విధానంలో ఎట్టి మార్పులు జరిగినా – సమావేశంగా కూడిన పార్టీ ప్రతినిధులు అధ్యక్ష ప్రతిపాదన నాటకాన్ని ప్రదర్శించే పద్ధతిపోయి, వేరొకమార్గం అవలంభించబడుతుందనే విషయం సందేహాస్పదం.

ఈ జాతీయ సమావేశంలోనే పార్టీ తన విధానాన్ని, అచరణీయ నియమావళిని కూడా తయారు చేసుకొంటుంది. సమావేశపు మొదటి 5 రోజుల్లోనూ, తీర్మానాల సంఘం ఒకటిఏర్పడి కార్మికుల, వర్తకుల, మాజీ ఉద్యోగుల, నీగ్రోల మహిళల ప్రతినిధుల వాదాలన్నీ వింటుంది. గట్టిపోటీ

ఉన్న రాష్ట్రంలో ఒక గుంపు వోటర్లను త్రిప్పగలనని సంఘాన్ని నమ్మించ గల ఏవ్యక్తి చెప్పదలచుకున్న మాటలనైనా శ్రద్ధతో ఆసంఘం ఆలకిస్తుంది. ఆ వ్యక్తులు చెప్పిన పద్ధతులకు తమ పార్టీ విధానంలో స్థానం ఇవ్వడం మూలంగా వోట్లు వస్తాయని సంఘంవారు నమ్మితే-ఆవిధంగా చేస్తారు.కాని, ఆ పద్ధతులు పార్టీ ప్రధాన సూత్రాలకే విరుద్ధంగా ఉంటే ఆ పని చేయరు. పార్టీ ప్రధాన సూత్రాలకు విరుద్ధమైన విధానం అంటే - పార్టీలోని సభ్య సామాన్యానికి మనసునొప్పించి, ఎన్నికల రోజున చాలా మంది జనం వోట్లు వెయ్యకుండా ఇళ్ళ దగ్గరే ఉండి పోయేట్టుచేసే విధానం అని అర్థం.

ఉదాహరణకు మానవసత్వాలకు సంబంధించిన భాగాలను, అల్ప సంఖ్యాకులతో సమానత్వంఇస్తూ శాసనాలు చేయాలనే తీర్మానాలను 1948 లో డెమోక్రటిక్ సమావేశంలో తీవ్రంగా వ్యతిరేకించారు. మానవ స్వత్వా లను అంగీకరిస్తూ ఒక విస్పష్టమైన తీర్మానం ఆమోదిస్తే — అల్పసంఖ్యాక వర్గాలనుండి లక్షలకొద్దీ వోటర్లు తమకు అనుకూలంగా తిరుగుతారని ఒక వర్గంవారూ, ఆ తీర్మానం అంగీకరిస్తే, అప్పటి వఱకూ నిత్య సభ్యులుగా ఉన్న లక్షలకొద్దీ వ్యక్తులు విడిపోతారని ఇంకొక వర్గంవారూ వాదించారు. ఇలాటి వాదనలే కార్మిక, వ్యవసాయ విధానాల విషయమైకూడా సాగ వచ్చు. ముఖ్యంగా ఈ విధానాలతో సంబంధం గలవారు రెండు వర్గాల వారికీ జుట్టూ జుట్టూ ముడిపెట్టగల ఘటనాఘటన సమర్థులైతే — ఇలాటి వాదనలు మరీ ఎక్కువగా సాగుతాయి.

సాధ్యమైనప్పుడల్లా "విధాన నిర్ణాయకసంఘం" ఎవరినీ నొప్పించకుండా అందరికీ సంతోషం కలిగించే పదాలే వాడి, దేశఆంతరంగిక వ్యవహారాలు, ఆదాయ వ్యయపు టంచనాలు, పన్నులు, అమెరికన్ జీవన విధానం — ఇలాటి ముఖ్య విషయాలలో మాత్రమే ఎక్కువ శ్రద్ధ ప్రదర్శిస్తుంది.

పార్టీప్రధానంగా దాని గతచరిత్రపై ఆధారపడినడుస్తుంది. గతచరిత్రయే పార్టీ ప్రచారకుల ఉద్దేశంలో వాళ్ళ పార్టీ మంచిదని, ఐకమత్యం కలదని, నమ్మదగ్గదని చెప్పటానికి తగిన ఆధారం. ప్రతిపక్షపు పనులన్నీ వోటర్లలో అప్రతిష పాలు అయినాయనీ, ఆ పనులతో పోల్చి చూచినపుడు తమపార్టీ చాలా శ్లాఘనీయమైనదని వాక్రుంటారు. ప్రతి పార్టీకి సంప్రదాయ సిద్ధమైన ఒక వ్యక్తిత్వం ఉంటుంది. ఎదుటి పక్షపు హీన గుణాలతో దీన్ని పోల్చి పొగుడుతూంటారు. ఉదాహరణకు, రిపబ్లికనులు తమ పార్టీ అత్యంతసమ

ష్ఠమైనదనీ, విశ్వసనీయమైనదనీ, ఇంచుమించు కమ్యూనిష్ట్ వారుజాలు అనమర్థమైన డెమోక్రటిక్ పార్టీలాంటిది కాదనీ సగర్వంగా చెప్పుకుంటారు. ఇక డెమోక్రట్లు తాము ప్రజల మిత్రులమనీ, ప్రజల అభ్యుదయాన్ని కోరు తామనీ, ధనవంతుల మిత్రులైన డెమోక్రట్లు ఈ 20వశతాబ్దంలో ఉండవల సినవారు కాదనీ అంటూ ఉంటారు.

ఈ గుణాలకు విరుద్ధంగా ఉండే ముఖ్య సభ్యులు కొందరు రెండుపార్టీ లలోనూ ఉన్నారు. కాని సంప్రదాయసిద్ధగుణాలు కొంత సత్యమైనవేనని ప్రజలు అనుకుంటారు.

ఎన్నికల ప్రణాళికను ఎన్నడూ ఏ వోటరూ చదువడు. రాజ కీయ వక్తలు మాత్రం దాన్ని అప్పుడప్పుడు ఉదహరిస్తూఉంటారు. ఎక్కువ మంది జనానికి కష్టం కలిగించే విషయం ఏదైనా అందులో ఉంటే ఎదుటి పార్టీ వారు దాన్ని ఉటంకిస్తారు. మామూలుగా, అభ్యర్థి తనఎన్నికల ప్రచారోద్యమంలోని ఉపన్యాసాలలోనే తన వాస్తవిక ప్రణాళికకు రూప కల్పన చేస్తాడు. అతడు తన పార్టీ ప్రణాళికను ఎన్నడూ ప్రత్యక్షంగా విమ ర్శించాడు. కాని తాను ముఖ్యంగా నొక్కిచెప్ప నిష్టంలేనివిషయాలనువదలి వేసి, తాను ముఖ్యమని ఎంచే విషయాలపై తనయిష్టానుసారం ప్రకటనలు చేసి, ఆ ప్రణాళికకు వ్యాఖ్యానం చేస్తాడు. ఎన్నికలైన తర్వాత అధ్యక్షుని ఉపన్యాసాలు పార్టీచేసిన వాగ్దానాలుగా గ్రహించి, ఆ వాగ్దానాలు సఫలం అయ్యేటట్లు చేయడానికి కాంగ్రెసు నయాన్నో భయాన్నో ఒప్పించడం అధ్యక్షుని విధి అని ప్రజలు భావిస్తారు.

అందుచేత శాసననిర్మాణంలో అధ్యక్షుని స్వీయ కార్యక్రమానికే ప్రథమ గణ్యత. పార్టీ ప్రణాళికను రూపొందించే జాతీయ సమావేశం శాసన నిర్మా ణాధికారంలో ద్వితీయ స్థానాన్ని మాత్రమే వహిస్తుంది. దాని ప్రధానబాధ్య తలు రెండే రెండు. అధ్యక్ష స్థానానికి అభ్యర్థిని నిశ్చయించడం: జాతీయ ఉత్సవాలద్వారా పార్టీని ఏకోన్ముఖం చేయడం.

నియమం ప్రకారం ఉపాధ్యక్ష స్థానానికి అభ్యర్థిని అధ్యక్షస్థాన పుటభ్యర్థి ఎంచుకుంటాడు. అప్పటికే అలసిపోయి ఉన్న ప్రతి నిధులు పెద్ద వివాదమేమీ లేకుండా ఆఎన్నికను అంగీకరిస్తారు. సమావే శంలో ఓడిపోయిన వర్గంవారిని అనునయించే ఉద్దేశ్యంతో ఉపాధ్యక్ష స్థానపు టభ్యర్థిని ఆ వర్గంనుంచి ఎన్నుకుంటారు. దీని ఫలితంగానే పార్టీలో

విజేతవర్గం, అధ్యక్షుని మరణంతో తల్లక్రిందులయ్యే ప్రమాదం ఏర్పడుతున్నది. ఒకవేళ అతడే అధ్యక్షస్థానానికి నియమింపబడినా స్వశక్తివల్ల గెలుచుకోగల వాడినే ఈ ఉపాధ్యక్షస్థానానికి నియమించే పద్ధతి నొకదానిని అచరించాలని - ప్రస్తుత విధానాన్ని విమర్శించే వారంటారు.

కాని పార్టీని ఏకముఖం చెయ్యడంకోసం ఉపాధ్యక్ష పదవిని వినియోగించవలసిన అవశ్యకత మాత్రం ఉపాధ్యక్షుని ఎన్నికస్వేచ్ఛగాజరడానికిపెద్ద ప్రతిబంధకం అవుతున్నది.

'సమావేశాలు' నాలుగేళ్ళ కొకసారి మాత్రమే జరుగు తాయి కాబట్టి యీ మధ్యకాలంలో పని చేస్తూండేందుకు "జాతీయ సంఘం" ఒకటి ఉంటుంది. కాని ఈ సంఘం చేసేపనులలో చాలాభాగం, అధ్యక్షునిఎన్నిక జరిగే సంవత్సరంలోనే అవసర మవుతాయి. ఈ సంఘం జాతీయసమావేశానికి స్థలం, కాలం ఏర్పాటు చేస్తుంది. ఈ సంఘపు సిబ్బంది ఎన్నికలకు ప్రచార సాహిత్యం తయారుచేసి, వక్తలకు పంపుతుంది. అధ్యక్షుని ఎన్నికలకూ కాంగ్రెసు సభ ఎన్నికలకూ కావలసిన ధనంలో కొంతభాగం ఈ సంఘం ప్రోగుచేస్తుంది.

ప్రతి రాష్ట్రంనుండి ఒక స్త్రీ, ఒక పురుషుడూ ఆ రాష్ట్ర ప్రతినిధివర్గం, లేక ప్రైమరీ చేత ఎన్నుకోబడిన-అట్టివారు సభ్యులుగా ఈ సంఘం నిర్మిత మవుతుంది. ఈ సంఘ సభ్యులపని చాలావరకు వారి స్వరాష్ట్రాలలోనే ! అక్కడ వారు తమ రాష్ట్ర సంఘాలతో సహకరించి పని చేస్తారు. అధ్యక్ష స్థానపు టభ్యర్థి జాతీయసంఘ సభాపతిని తన ప్రచారోద్యమ నిర్వహకునిగా ఎంచుకుంటాడు.

ప్రచారోద్యమ మహావ్యూహ రచనలో అధ్యక్షస్థానపు టభ్యర్థితో కలసి పని చేసే సభాపతీ, అతనికి తోడుగా కేంద్ర కార్యాలయంతో ఉత్తర ప్రత్యుత్తరాల నన్నింటినీ జరిపే కార్యదర్శీ, వలసిన ధనంలో చాలభాగం జతపరచే కోశాధ్యక్షుడూ ఈ సంఘంలో ముఖ్యులుగా ఉంటారు.

అభ్యర్థికి, ఇతర వక్తలకు అవసరమైన సమాచారం యీవత్తూ — అన్ని మండలాల ఆర్థిక, జాతీయ, మతసంబంధ రాజకీయ లక్షణాలూ, కాంగ్రెసు అభ్యర్థులు గడచిన ఎన్నికలలో తెచ్చుకొన్న వోట్ల వివరాలూ, ఎవరికీ కష్టం కలిగించకుండా వోట్లు సంపాదించుకోడానికి తోడ్పడే ఇతర వివరాలూ-ఒక పరిశోధక వర్గంవారు తయారు చేస్తారు. ప్రచారోద్యమానికి గాని, కాంగ్రెసు

లోని వాగ్వివాదాలలో తమ పార్టీని సమర్థించడానికి గానీ, కావలసిన ఉప న్యాసాలను తీరికలేని కాంగ్రెసు సభ్యులకు, సెనేటు సభ్యులకు వ్రాసి యివ్వడానికై సమర్థులైన రచయితలు కూడా యీ సంఘపు సిబ్బందిలో ఉంటారు.

కాంగ్రెస్ సభలోని ప్రతిపార్టీ కాంగ్రెస్‌కి తన పార్టీ సభ్యులు ఎన్నిక కావ డంలో సహాయం చేయడానికి ఒక ప్రత్యేక సంఘాన్ని, సెనేటు సభ్యుల ఎన్నికలో సహాయం చేయడానికి మరొక ప్రత్యేక సంఘాన్ని నిర్వహిస్తూ ఉంటుంది. ఈ సంఘాలు ఎన్నిక సందేహాస్పదమైన నియోజక వర్గాలకు వక్తలనూ, ధనాన్ని పంపి సహాయపడుతూ ఉంటాయి. ప్రతి పార్టీకి ప్రతి రాష్ట్రంలో ఒక రాష్ట్ర సంఘం ఉంటుంది. ఈ రాష్ట్ర సంఘాలు బలమైన పోటీ ఉన్న చోట్ల చాలచురుకుగా పనిచేస్తాయి. ఈవిధమైన సంఘాలు వివిధ ప్రాంతాలకు, నగరాలకు, చివరకు ప్రతి వోటింగ్ కేంద్రానికి కూడా ఏర్పడి ఉంటాయి.

స్థానికస్థాయిలోని సంఘాలు చేసేపనినే 'ఎక్కేగుమ్మం-దిగేగుమ్మంపని' అని అంటారు. ప్రజలు వోటర్లుగా. సకాలంలో తమ పేర్లు నమోదు చేయించుకొ నేటట్లు పార్టీ కార్యకర్తలు శ్రద్ధ వహిస్తారు. అభ్యర్థులు వారి ఊరు వచ్చి నపుడు ఏర్పాటుచేసే సభలకు హాజరు కావలసిందిగా ప్రజలను అర్థిస్తారు. చివరకు ఎన్నికలరోజున వారిచేత వెంట ఉండి ఓటువేయిస్తారు. ఈ స్థానిక స్థాయికి పైనగల పార్టీ నిర్మాణం అంతా వక్తలకు ధనం, సమాచారం సమ కూర్చి, రేడియోద్వారా టెలివిజన్‌ప్రచారంచేసి, యీ స్థానికకార్యకర్తలపనికి తోడ్పడడానికే కృషి చేస్తోంది.

జాతి వ్యాప్తమైన ఎన్నికలు జరిపేందుకు అయ్యే ఖర్చు దేశపు వైశా ల్యాన్ని, ప్రజానీకపు సంఖ్యనూ బట్టి చూస్తే చాల తక్కువ లెక్కలు కట్టి చూడగా, వోటువేసే అర్హతగల వ్యక్తి ఒకడికి 25 సెంట్లు చొప్పున లేక దేశం మొత్తంమీద 2, 3 కోట్ల డాలర్ల మధ్య — ఆ ఖర్చు ఉంటుందని తేలింది. ఉదాహరణకు 1944లో డెమోక్రట్లు 75,00,000 డాలర్లు, రిప బ్లికనులు 1,30,00,000 డాలర్లు ఖర్చుచేసినట్లు వారి కార్యాలయపు లెక్కలవల్ల తెలుస్తోంది.

జాతీయ సంఘాలు ఒక్కొక్కటి ఒక ఎన్నికల్లో 30 లక్షల డాలర్లకంటే ఎక్కువ ఖర్చుపెట్ట కూడదు. కాని రాష్ట్ర, స్థానికసంఘాలు వాటి నిధులను

అవే పోగుచేసుకుంటాయి. ఇవికాక వేరువేరుసంఘాలు, కొందరు వ్యక్తులు తమకు నచ్చిన అభ్యర్థికోసం వారి ధనాన్ని, కాలాన్ని ప్రతిఫలాపేక్షా రహితంగా చాలా వ్యయం చేస్తారు. రాజకీయ ప్రచారోద్యమంలో ఫెడరల్ ప్రభుత్వ ఉద్యోగులెవ్వరూ పాల్గొనరాదని 'హచ్' శాసనం నిషేధిస్తోంది.కాని అట్టి ఉద్యమంలో పాల్గొనే ప్రతి పౌరుని తను వ్యయంచేసే కాలానికిగాని, ధనానికిగాని, లెక్కచెప్పమని శాసించే ఉపాయం ఇంతవరకు లభ్యం కాలేదు.

ఎదుటి పక్షం విపరీత వ్యయం చేస్తోందనే ఫిర్యాదులూ, ధనం తక్కువగా ఉన్న పక్షం ఖర్చుపెట్ట గలిగిన మేరకు మాత్రమే ప్రచారోద్యమపు ఖర్చును పరిమితం చేస్తూ శాసించాలనే కోరికలూ ఎప్పుడూ ఉంటాయి. కాని, ఆచరణలో వోట్లు డబ్బిచ్చి కొనెయ్యడం గతంలో ఉన్నంత సర్వ సామాన్యంగా ఇప్పుడున్నట్లు లేదు; పైగా ఎక్కువ డబ్బు వ్యయం చేసిన పక్షం గెలుస్తుందనే అభిప్రాయం తప్పు అని చాలాసార్లు ఎన్నికల ఫలితాలు రుజువు చేసినాయి.

ప్రభుత్వమే పార్టీల ఎన్నికల ప్రచార వ్యయానికి ధనం ఇచ్చే పద్ధతికి పెద్ద ఆటంకం – ప్రభుత్వాలు రాజకీయాల్లో పాల్గొనడం మంచి లక్షణం అని ప్రజలు ధైర్యంగా అంగీకరించలేక పోవడమే ననిపిస్తున్నది.

కాంగ్రెసు సభ కోటి, రెండు కోట్ల డాలర్లు ఒక్కొక్క ప్రధాన పక్షానికి ఇవ్వవలెనంటే – జార్జి వాషింగ్టన్ కాలంనుంచీ అనాదిగా వస్తున్నపార్టీలు మంచివి కావనే భావాన్ని అది పారద్రోలవలసిఉంది. కమిటీల నిర్మాణాన్ని నిర్వాహకోద్యోగుల నియామకాన్ని, కాంగ్రెసు సభ పార్టీ ప్రాతిపదిక మీదనే చేస్తుంది కాని, శాసనాల విషయంలో మాత్రం ఎందుకో పార్టీలపేర్లు ఎత్తడానికి చికాకు పడుతుంది. రాజకీయ వ్యవస్థలో న్యాయమైన భాగస్వాములుగా పార్టీలను గుర్తించడానికి మరొక ప్రతిబంధకం: చాలామంది పెద్దపెద్ద విరాళాలిచ్చే దాతల దృష్టిలో పార్టీల ప్రస్తుతస్థితే ఉత్తమ మైనదిగా కనబడడం. పార్టీలు తమ పోషకత్వం నుండి తొలగి పోవడంకంటే - వాటి కొఱకు తమ ధనం వ్యయం కావడమే వారికి ఇష్టం.

తమ అభ్యర్థికి వోటువేసే 3 కోట్ల ఉత్సాహవంతులైన అభిమానులలో సగం మంది నుండి అయినా తలకొక డాలరు చొప్పున వసూలు చేయవలెననుకొంటే – అనుభవంలో అలా చేయడానికి తలకుమించిన వ్యయం

అవుతుందని తేలింది. టెలివిజన్ అభివృద్ధితో జాతివ్యాప్తమైన ప్రచారోద్యమాల వ్యయం పెద్ద సమస్య అయింది. జాతీయ సమావేశాన్ని, ప్రచారోద్యమ సమయంలో ముఖ్య అభ్యర్థులనూ, టెలివిజన్ తెరమీద చూడాలని ప్రజల కాంక్ష.

ఈ విధంగా, అభ్యర్థులను టెలివిజన్‌లో చూడాలనే ప్రజలకాంక్ష పెరుగుతున్నకొద్దీ అభ్యర్థికి ఆయే ఉద్యమవ్యయం-ఒక్కొక్క పౌరునికి 40, 50 సెంట్ల దాకా పెరిగినా గూడా అది దుర్వ్యయం అనిపించుకోదు.

అమెరికాలో రెండేళ్ళ కొకసారి కాంగ్రెసుకు ఎన్నికలు వస్తాయి. మిగతా సంవత్సరాలలో రాష్ట్రపు టెన్నికలు, ప్రైమరీల ఎన్నికలూ జరుగుతాయి. అందుచేత ఇంచుమించు నిత్యమూ ఉండే ఈ ఎన్నికల పనులను నిర్వహించడానికి రాజకీయ 'యంత్రాంగం' బాగా అభివృద్ధిచేయబడింది. కాగా 4 ఏళ్ళకొకసారి వచ్చే బ్రహ్మాండమైన జాతీయ సమావేశం మాత్రం, మధ్య కాలంలో నమసిపోతుంది. అధ్యక్షుని ఎన్నికల మధ్యకాలంలో జాతీయ సంఘాలు ప్రశాంతంగా పనిచేస్తూంటాయి. కాని రాష్ట్ర, ప్రాంతీయ యంత్రాంగాలు మాత్రం నిత్యమూ నిర్విరామ కార్యభారంతో సతమత మవుతూనే ఉంటాయి.

రాజకీయాలు వృత్తిగా జీవించే రాజకీయ ప్రచారకులే ఈ 'యంత్రాంగం'లో ఎక్కువగా ఉంటారు. అందుచేత వృత్తిగాకాక, విరామకాలంలో ప్రచారోద్యమాలు సాగిస్తూ ఈబలవద్యంత్రాంగాన్ని కూలద్రోయాలని కలలుగనే అనుభవ రహితులైన సంస్కార ప్రియుల్ని ఇది తేలికగా ఓడిస్తుంది, సంఘాన్ని సుశిక్షితం చేయడం, శత్రువుల ఎత్తుగడల నుండి తప్పుకొనే ఉపాయాలు ఆలోచిస్తూ ఉండడం, న్యాయశాసనం నిష్కర్షగా అమలు పరచడంవల్ల నష్టపడే వారితో సమాలోచనలు జరుపుతూండడం, వ్యక్తులను గూర్చి విషయాలను గూర్చి శాసన సభ్యులకు బోధిస్తూండడం – ఇలాటి కష్టమైనపని అంతా యీ రాజకీయజ్ఞులు నిర్వహిస్తూంటారు. ఈకార్యకర్తలు బహుముఖాలుగా ప్రతిఫలం పొందుతూ ఉంటారు ; ప్రభుత్వంలో రాజకీయంగా ప్రధానమైన స్థానంలో కొందరికి ఉద్యోగా లుంటాయి. లైసెన్సులు, కంట్రాక్టులూ కావలసిగాని, లేక కావలం పోలీసుల బాధ విరగడ చేసుకోడానికిగాని, వర్తక సంస్థలు ఇచ్చే విరాళాలలో కొందరు భాగం పుచ్చుకుంటూ ఉంటారు.

చాలా బాగా నిర్వహించబడే "యంత్రాంగాల"కు ఒక 'అధిపతి' ఉంటాడు. ఈ అధిపతి తరుచు ఏ ఉద్యోగమూ చేస్తూ ఉండడు. ఉద్యోగాలలో ఉన్న వాళ్ళని నియమనం చేసే పగ్గాలు చేతబట్టుకొని ఎప్పుడూ తీరని పనిలో మునిగి ఉండే ఈయనకు 'ఉద్యోగం' పుచ్చుకొని ఆ ఊడిగం చేసే తీరు బడి ఉండదు. ఈఅధిపతి తన సిబ్బందిని తీవ్రక్రమశిక్షణలో ఉంచుతాడు. వారి అందరి పనిని ఏకోన్ముఖంచేసి, తన పార్టీ గెలుస్తుందనే ధైర్యం కలి గేటట్టు చేస్తాడు.

ఏ ప్రత్యేక వర్గానికైనా రాజకీయంగా ఉపకారం చేయవలసిన అవసరం ఉందేమో 'ఆలోచించ' వలసినవాడు ఈ అధిపతే. ఈయన ప్రజల కంద రకూ మిత్రుడు. ముఖ్యంగా పేదవాళ్ళకీ విదేశీయులకీ అతడు ప్రాణ మిత్రుడు. ఒక్కొక్కప్పుడు ఈయన స్వయంగానే విదేశంలో పుట్టిన ఒక తండ్రికి కొడుకై, చిన్న గుడిసెల్లో బ్రతికి, తన స్వశక్తివల్ల పైకివచ్చి; పేద వాళ్ళనుగురించి తెలిసినవా డవడంవల్ల, రాజకీయయంత్రాంగానికి అధిపతి కావడంకూడా కద్దు.

ప్రఖ్యాత రాజకీయ నిపుణుడు జార్జి ప్లంకిట్ ఇలా అన్నాడట : "నా జిల్లాలో పేదతనంతో బాధపడే కుటుంబం ఏదైనా ఉంటే — దాని సంగతి దాతృత్వ సంస్థలకంటే ముందే నాకు తెలుస్తుంది. నేనూ నా మనుష్యులూ వెంటనే దానికి సహాయం చెయ్యడానికి వెళతాం. అలాటి కుటుంబాల విష యంలో శ్రద్ధవహించటానికి నాకు ప్రత్యేక దళం ఉన్నది. దీని ఫలితం ఏమంటే — జార్జి ప్లంకిట్‌ని పేదవాళ్ళంతా కన్నతండ్రిలా చూసుకుంటారు. ఎన్నికల రోజున అతన్ని మరచిపోరు. అందుచేత రాజకీయ'అధిపతి'ప్రధాన కర్తవ్యం — బాధితులకు ఓదార్చడం — వాళ్ళు ఉన్నవాళ్ళైనా సరే, లేని వాళ్ళైనా సరే. ఒక వైపున — అతడు కష్టాలలో ఉన్న కొడుకును విడిచి విదేశాన్నుంచి వలస వచ్చిన ఒకతల్లి భయాల్ని పోగొడతాడు; దాతృత్వసంస్థ లన్నీ 'నీచులని' చిన్నచూపు చూసిన వృద్ధదంపతులకు ఆహారంపంపిస్తాడు; లేదా పార్టీ కార్యకర్త కొడుక్కి పోలీసుదళంలో ఉద్యోగం సంపాదించిపెడ తాడు; ఇలాటి ఉదారమైన పనులవల్ల అతని దగ్గరకు వచ్చేవాళ్ళందరి ఆదరాన్ని, దానితోపాటు వాళ్ళకు, వాళ్ళ చుట్టాలకు ఉన్న వోట్లనూ తన అభ్యర్థికి సంపాదించుకుంటాడు.

ఇంకొక వైపున – ధనవంతులవీ, వాళ్ళ మిత్రులవీ కష్టాలు తీరుస్తాడు. కంట్రాక్టర్లవీ, భాగస్వాములవీ, చివరకు న్యాయశాసనం మరీ నిష్కర్షగా అమలు జరుపకపోతేనే సుఖంగా బ్రతుకగల గౌరవహీనులైన పౌరులవీ – అందరి కష్టాలూ తీరుస్తాడు. తనస్నేహితుల, అనుయాయుల వోట్లవల్లగెలిచి సెనేట్‌లోనో లేక రాష్ట్ర శాసన సభలోనో ఉన్న తన పార్టీవారికి ఇతడు శిఫార్సులు చేస్తాడు. ధనవంతులైన వారు కృతజ్ఞతాపూర్వకంగా ఇచ్చిన డబ్బు తీసుకొని దాన్ని పేదవాళ్ళకూ తన క్రింద పనిచేసే సేవకులకూ పంచి పెట్టేస్తాడు.

కాని ఈ పాతకాలపు రాజకీయ యంత్రాంగం–దేశంలో సాంఘిక భద్రత అభివృద్ధి అవడంవల్లను, వలస నిషేధ శాసనాల ఫలితంగాను, ఉద్యోగాలలో "అర్హతా ప్రధాన్యత విధానం" అమలులోనికి రావడంవల్లను,పూర్తి గా మూల పడిపోయింది. ఈ పరాయి దేశంలో మీకు ఏకైకసుహృద్వర్గం మేమే సంటూ పార్టీ కార్యకర్తలు సహాయ పడడానికి – నగరాల్లో ఇపుడు విదేశం నుండి వలస వచ్చినవాళ్ళు చాలాకొద్దిమంది ఉన్నారు. పార్టీ కార్యకర్తలకు బహుమానాలుగా ఇచ్చే 'ఈనాం' ఉద్యోగాలు వెనకటికన్నా తగ్గిపోయాయి. కాని, ఇప్పటికీ పోలీసు విధానం మాత్రం చాలా అవినీతికరంగానే సాగుతున్నది. వాళ్ళు ఈ 'యంత్రాంగా' లను ఇంకా నిలబెడుతున్నారు. కాని, దేశం మొత్తంమీద చూస్తే - ఆర్థిక మాంద్యం రోజుల్లో పెద్ద నగరాల్లో యీ ప్రజాస్వామ్య యంత్రాలు విశేషంగా బలపడినా, ఇప్పుడు వాటి బలం తగ్గిపోయిందని 1952 ఎన్నికలు నిరూపించినాయి.

రెండు ప్రధానపక్షాలూ కూడా జీవనోపాధిగా కాక సరదాకై ఉత్సాహంతో పనిచేసేవారితో తమ యంత్రాంగాన్ని ఏర్పరచాలని ప్రబల ప్రయత్నాలు చేశాయి. సరదాకోసమూ, సభలకీ, సమావేశాలకీ వెళ్ళే అవకాశం కోసమూ, ఏనాటికైనా ఏదో ఒక అభ్యర్థిత్వానికి ప్రతిపాదన సంపాదించలేకపోతామా అనే ఆశతోటీ, పనిచేసే ఉత్సాహ వంతులైన అభిమానులను ఎక్కువగా ఆకర్షించడమే ఇప్పుడు ఈ పార్టీల ఆశయం. 1952లో ఐజన్ హోవర్, స్టీవెన్సన్ కూడా చాలా ఉత్సాహవంతులనూ, యువకులనూ ఆకర్షించారు. భవిష్యత్తులో వోట్లు సంపాదించే పనిలో ఇలాంటి యువకులే పెద్ద పాత్రను వహించబోతారని చెప్పవచ్చును. ఇలా జరిగితే ఇది రాజకీయ అధికార వ్యవస్థలో చిత్రమైన పరివర్తనమే కాగలదు. వెనుక పార్టీల బలం అత్యంత నిస్సహాయులైన పేదవాళ్ళ దగ్గరనుండి వచ్చింది.

కార్యదక్షులూ, లంచగొండులూ అయిన యంత్రాంగ రాజకీయవాదులు తమ జాలి అనే పెట్టుబడితో పేదవాళ్ళని కొనేసి వాళ్ళచేత మూక ఉమ్మడిగా వోట్లు వేయించుకొనేవారు. నిస్సహాయులైన పేదవాళ్ళ సంఖ్య తగ్గిపోవడంతో ఈ విధమైన బలం తగ్గిపోసాగింది. 1952లో పార్టీబలానికిమూలం అంతా అధ్యక్ష అభ్యర్థులలోనే కేంద్రీకృత మైనట్లు కనిపించింది. వాళ్ళిద్దరూ కూడా రాజకీయ యంత్రాంగాన్ని సంతోష పెట్టడానికి కాకుండా స్వతంత్రులైన వోటర్లను మధ్యతరగతివారిని, క్రొత్తపార్టీ కార్యకర్తలని, ఆకర్షించగలరనే తమ తమ పార్టీల అభ్యర్థులుగా ఎంచుకోబడ్డారు.

ఈ ఉత్సాహవంతులు కృతజ్ఞతాభావం ఆశించిగాని, ప్రతిఫలాశతోగాని కాక-తమ అభ్యర్థిమీదఉన్న హృదయపూర్వకమైన గౌరవంవల్లనే ఎక్కువగా ఆకృష్టులైనవారు. ఈ మార్పు నిత్యమైతే–రాజకీయాలలో సంప్రదాయసిద్ధంగావస్తున్న ఆచరణ సూత్రాలు చాలా తారుమారు కాగలవు.

ఎన్నిక ... లో వోట్లు వేయించడంలో రాజకీయ పక్షాలు చాలా ప్రధాన పాత్ర వహించవలసి ఉంది. సంయుక్త రాష్ట్రాలలో 1,30,000ల ఎన్నికల మండలాలున్నాయి. ఒక్కొక్క మండలంలో 300 నుండి 1000 వరకూ వోటర్లు వోట్లు వేస్తారు. పోలింగు కేంద్రాలు సామాన్యంగా స్కూళ్ళలోనే కాళీ షాపులలోనో ఉంటాయి. స్త్రీలకు వోటు హక్కు వచ్చినప్పటినుండీ, పోలింగ్ స్టేషన్లు 1920కి పూర్వంకన్నా చాలా నిర్మలంగా శుభ్రంగా ఉంటున్నాయి. రెండు ప్రధాన పక్షాలవారూ ఉద్యోగులను ఎంచుకుంటారు.వారికిదేశ శాసనాన్ననుసరించి ప్రభుత్వ ధనంనుండి ప్రతిఫలం ఇస్తారు. వారు వోటర్ల పేర్లు సరిచూచి, ఒక్కొక్క వోటరుకూ ఒక వోటు కాగితం యిచ్చి, వోట్ల పెట్టెలో మోసం చేయకుండా సరిగా వోటు చేసేటట్లు చూచి, చివరకు చాలా రాత్రిపఱకూ కూర్చొని, ఆవోట్లు లెక్కపెట్టి, ఫలితం తెలియపరుస్తారు. రెండు పార్టీలవారూ కూడా పోలింగ్ కేంద్రంలో ఏమైనా అన్యాయంకాని, మోసం కాని జరుగుతుంటే ఆక్షేపణ తెలియ జెయ్యడానికి పరిశీలకులను నియమిస్తారు. వారి ఖర్చులు పార్టీలే భరిస్తాయి.

అమెరికాలో రహస్యపు వోటింగ్ విధానం దృఢంగా ఏర్పడింది. క్వాచిత్కంగా పార్టీ కార్యకర్తలు వోట్లు ఏపార్టీకి ఎలా పడుతున్నాయో పరిశీలించే ప్రయత్నంచేస్తూ ఉండవచ్చు కాని, అట్టి ప్రయత్నాలను ఎదుటి పక్షపు పరిశీలకులు పసికట్టి నివారిస్తారు.

అమెరికన్ వోటింగ్ విధానంలో ఒక ప్రధానలోపం — సుదీర్ఘమైన వోటు పత్రం ఉండడం. ఒక్కొక్కప్పుడు 50 నుండి 100వరకూ రాష్ట్ర,ప్రాంతీయ నగర స్థానాలకు అభ్యర్థుల పేర్లు ఆ కాగితంమీద ఉండడం; అందులో కొన్ని టిని వోటరు గుర్తించవలసి రావడం కూడా కద్దు.

ఒకసారి 12 అడుగుల పొడవుగల కాగితమూ, దానిమీద 500 పేర్లూ ఉండడంకూడా జరిగిందట! ఒక అరడజను ప్రభుత్వోద్యోగులనూ, ఇంకా అనేక ఉద్యోగులనూ ప్రజలు ఎన్నుకోవలసి ఉంటుంది. అతేకాక వాళ్ళు ఒక మేయరునూ, ఎల్డర్‌మన్‌నూ, పాలకసంఘ సభ్యులనూ, నగర న్యాయమూర్తులనూ, ఎసెసర్లనూ, పన్నుల వసూలుదార్లనూ, అసంఖ్యాకులైన ఇతరులను కూడా ఎన్నుకోవలసి ఉంటుంది.

ఈ ఉద్యోగాల కన్నింటికి ఉన్న అభ్యర్థుల నందరినీ ఎవరో ప్రముఖ రాజకీయవేత్తలు తప్ప ఇతరులు ఎరిగి ఉండడం సాధ్యం కాదు. ఆ రాజకీయ వేత్తలకైనా ఆ అభ్యర్థులకు అభ్యర్థిత్వాన్ని ఇవ్వడంలో కొంత పాత్ర ఉంటుంది కాబట్టి వాళ్లపేర్లు కొన్ని అయినా జ్ఞాపకం ఉంటాయి. వోటర్లు, గవర్నరుకీ, మేయరుకీ మరికొందఱు యితరులకీ, వోట్లు గుర్తించి మిగిలిన వన్నీవదలిపెట్టెయ్యడమో, లేకపోతే గుడ్డిగా గుర్తులుపెట్టడమో చేస్తారు. ప్రజలకు తాముబాధ్యత వహించనక్కరలేకుండా తప్పించుకునే వీలున్నది కాబట్టి ఈ 'పొడుగు వోటు కాగితపు పద్ధతి'నే పాతకాలపు రాజకీయ వేత్తలు కావాలని సమర్థిస్తారు. ప్రజలుజ్ఞాపకం పెట్టుకోనట్టి, వారికిఅర్థంకానట్టి,చిన్న పదవులకు ఈరాజకీయనాయకులు తమ విశ్వసనీయ అనుయాయుల్నినిలబెడతారు.ప్రజలు వీరినిగుడ్డిగా ఎన్నుకుంటారు. ప్రజలచేతఎన్నుకొనబడినవార మనేధీమాతో ఈరాజకీయ నాయకులమిత్రులు ప్రజలుమనసారా ఎన్నుకొన్న గవర్నరు, మేయరుల ఆజ్ఞలకు అతీతులుగా ప్రవర్తిస్తారు !

ఈ విధానంవల్ల రాష్ట్రీయ, స్థానిక సంస్థల ఎన్నికలలో ఫెడరల్ ఎన్నికలలో కంటే తక్కువ ప్రజాస్వామిక ధర్మం వ్యక్తమవుతున్నది. జాతివ్యాప్తంగా జరిగే ఎన్నికలలో ప్రజలు అధ్యక్షుడినీ, (ఉపాధ్యక్షుని కూడా) కాంగ్రెసు సభ్యులనూ, మూడింట రెండు ఎన్నికలలో సెనేటు సభ్యులనూ మాత్రమే ఎన్నుకోవలసి ఉంది. ఈ అభ్యర్థులందరూ ప్రజలకు జ్ఞాపకం ఉండేటంత ముఖ్యులు. అందుచేత ప్రజలు వీరిని తమ చర్యలకు బాధ్యులుగా పరిగణించడానికి వీలున్నది.

20వ శతాబ్దారంభంలో ఈ పొడుగాటి వోటుకాగితాల పద్ధతిలోని లోట్లను సవరించడానికి 'పొట్టి వోటు కాగితాల ఉద్యమం' ప్రారంభమయింది. పొట్టి వోటుకాగితపు సంఘానికి వుడ్రోవిల్సన్ మొదటి అధ్యక్షుడు. ఎన్నిక కావలసిన చాలా పదవులను నియామక పదవులుగా మార్చివేయాలని ఈ ఉద్యమ ఆశయం. అపుడు గవర్నరు కాని, మేయరు కాని అధ్యక్షునివలె చిన్న ఉద్యోగాలకు వ్యక్తులను నియమించి పరిపాలన కంతటికీ తాను బాధ్యుడైన అధిపతిగా ఉంటాడు. కాని రాజకీయ వేత్తలకు ఈ పొడుగాటి కాగితం అంటేనే ఎక్కువ ఇష్టం. ప్రజలకు రాజకీయాలలో శ్రద్ధ, ఆసక్తి తక్కువగా ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలలో ఈ విషయమై పెద్ద అభివృద్ధి ఏమీ జరుగలేదు. కాని, నగరాలలోమాత్రం మంచి అభివృద్ధి కనిపించింది. 1910లో కంటే ఎక్కువ ఉద్యోగాలు ఇప్పుడు మేయరు చేతిలో ఉన్నాయి. చాలా నగరాలలో "కమిషన్, లేక సిటీ–మేనేజర్" పద్ధతి పరిపాలన ఏర్పాటు కావడంతో వోటర్లకు పొట్టివోటుకాగితం వలని సౌకర్యం అనుభవంలోకి వచ్చింది.

పొడుగాటి వోటు కాగితం వోటు చేసేవారి సంఖ్యను – ముఖ్యంగా 'స్వతంత్రులైన' వారి సంఖ్యను – తగ్గించడం సంభవమే ననిపిస్తుంది. ఉన్న అభ్యర్థులలో మంచివారిని ఎంచుకోవాలనుకునే వారికి చాలామంది అపరిచితులైనవారి పేర్లతో పొడుగ్గా ఉన్న వోటు కాగితం చికాకును కలిగించడంవల్ల వారు వోటు చేయడమే మానివేస్తారు. కాని తను వేయదల్చుకున్నది ఏ పార్టీకో నిశ్చయంగా తెలిసిన వోటరుకు ఎంత పొడుగైన కాగితమైనా ఏమంత చికాకు కలిగించదు.

మొత్తం వోటర్లలో మూడొంతులమంది వంశ పారంపర్యంగా ఏదో ఒకపార్టీ సభ్యులు. వీరికి మరొక పక్షానికి వోటువేసి తమ చేతిని కలుషితం చేసుకోవడం అంటే భయం. అందుచేత ఎన్నికల్లో జయాపజయాలు ద్విపక్ష రాష్ట్రాలలో మిగిలిన పాతికవంతు స్వతంత్రులూ నిశ్చయిస్తారు. ఏకపక్ష రాష్ట్రాలలో ఆ పక్షంలో అభ్యర్థిత్వాల విషయమై తమ పార్టీ హద్దుదాటకుండా లోపలే వివాదాలు పడగల వర్గాలవారు తేలుస్తారు.

ప్రజాస్వామ్య వ్యవస్థకు ముఖ్యమైన అనిశ్చిత పరిస్థితిని ఎన్నికలకు సమకూర్చగల యీ స్వతంత్రవర్గంవారు దేశంలో నానాటికీ ప్రవర్ధమాన మవుతున్నట్లు కన్పడుతుంది.

విపత్కర సమయాల్లో రాజకీయ పక్షాలు తమ శక్తియుక్తు లన్నిటినీ తమ నాయకునిలో -- అనగా అధ్యక్షునిలోనో లేక అధ్యక్ష స్థానాభ్యర్థిలోనో -- మూర్తీభవింప చేస్తారు. ఎన్నికలరోజున వంశ పారంపర్యంగా పార్టీ సభ్యు త్రనవారిని తమపడకకుర్చీలలోనుంచి లేవగొట్టివోటుచేసేటట్టు చేయవలసిన వ్యక్తి ఆయనే! ఎదుటిపక్షపు నాయకుడైన తన ప్రతిస్పర్థికి పోటీగా స్వతం త్రుల వోట్లను గెలుచుకోవలసిన వాడూ ఆయనే!

ఎన్నికలు అయిన తర్వాత గెలిచిన అధ్యక్షుడు తనకువలసిన శాసనాల నిర్మాణాన్ని జరిగించేందుకు కాంగ్రెసుసభలో తన పార్టీకి నాయకత్వం వహించి నడిపించవలసి ఉంటుంది. విపత్సమయంలో అధ్యక్షుడు చారిత్ర కంగా అతిప్రముఖపాత్ర వహించవలసి ఉంటుంది. అటు-ఎన్నికల్లో వివేక హీనంగా చేసిన వాగ్దానాలూ. ఇటు-ముమ్ముందు తనను చరిత్ర ప్రసిద్ధుని చేయగల పనులూ - ఈ రెండింటిలోను అధ్యక్షుడు తరుచు పాత వాగ్దానా లకు బదులు భవిష్యత్తులో తనకు పేరు తీసుకురాగల విధానాలనే ఎంచు కుంటాడు. ఈ ప్రయత్నంలో అతడు కాంగ్రెసు సభ్యులతోను, తరచు తన యెడ అసూయతో ఉండే తన పార్టీ నాయకులతోను, పరాజిత అభ్యర్థి నాయకత్వాన నడుస్తున్న ప్రతిపక్ష నాయకులతోను, జాగ్రత్తగా వ్యవహ రించవలసి ఉంటుంది.

విపత్సమయాల్లో రాజకీయ పక్షాలలో నాయకత్వపుస్థానం ఇది. యువకు లైన అమెరికన్‌లకు మాత్రం విపత్కరమైన రోజులే సజీవమైన కాలంగా కనుపిస్తుంది.

కాని తల నెరిసిన రాజనీతిజ్ఞులు మాత్రం దీనికి భిన్నంగా ప్రశాంత సమయాన్నే అభిలషిస్తారు. ఉదాహరణకు 1920లో ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ప్రజలు అలిసిపోయి ఏమార్గంలోను నడిపింపబడె కోరిక లేని స్థితిలో ఉన్నరోజులు వారికి యోగకాలం.

కాని ఒక విషయం మాత్రం ముఖ్యంగా గమనించాలి. అమెరికన్ ప్రజలు ఏ ప్రమాదావస్థలోనూ లేనప్పుడు — ఇంచుమించు ఏ విశిష్ట నాయ కత్వ లక్షణాలూ లేని పట్టి నామమాత్రులను రాజకీయ పక్షాలు అధ్యక్ష స్థానంలో కూర్చోబెడతాయి. కాని క్లిష్ట సమయం వచ్చేసరికి ఏదో దురూహ్య మైన పద్ధతివల్ల : లింకన్, విల్సన్‌ల వంటి మహాపురుషుల్ని నాయకు లనుగా సమకూరుస్తాయి.

అయితే—ఈ విధానం పైకి కన్పడేటంత దురూహ్యమైనది కాదని చాలా మంది పరిశీలకులు భావిస్తున్నారు. అమెరికా కేంద్ర కార్యాలయమైన వైట్ హౌసే ప్రపంచ పరివ్యాప్త సమాచారాని కంతటికీ కేంద్రం. అక్కడ జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను గురించిన వివరాలు – రహస్యమైనవీ, బహిరంగమైనవీ కూడా – కోరిన రీతిలో సంకలనం చేయబడి, అధ్యక్షుడికి లభిస్తాయి. అనేకులు అధ్యక్షులు, ప్రథమంలో సామాన్య వ్యక్తులలాగనే కనబడి, ఇంచుమించు హఠాత్తుగా ఈ ప్రపంచ విజ్ఞాన ప్రవాహం వారివైపు సారింపబడగానే రాజనీతి కోవిదులైపోయినారు. ప్రశాంత పరిస్థితులలో అధ్యక్షుడు హాయిగా నిద్రపోతూ తనలోని గొప్పతనపు లక్షణాలేవీ పైకి కన్పడనీయక పోవచ్చును. కాని క్లిష్ట పరిస్థితుల్లో మాత్రం ఆవ్యక్తే మేలుకొని, తనకు అందుబాటులో ఉన్న సదుపాయాలు వినియోగించుకొని తనలో ఉన్నాయని తన అంతరంగిక స్నేహితులు కూడా అనుకోని అపూర్వ శక్తులను ప్రదర్శించి గొప్ప పనులు సాధించవచ్చును.

ప్రస్తుత సంపుటనల ప్రోత్సాహ ప్రాబల్యం వల్ల ప్రధానరాజకీయ పక్షాల నిర్మాణ నిర్వహణ విధానాలలో మార్పు రాగలదని ఆశించవచ్చును. 1930 నుండిఇప్పటివరకూ ఉంటూ, యింకా కొంతకాలంపాటుకూడా కొనసాగేటట్లు కన్పిస్తున్న రాజకీయక్లిష్టస్థితి వైట్‌హౌస్‌లోను కాంగ్రెసులోను కూడా రాజకీయజ్ఞులమీదా, ప్రజానాయకులమీదా చాలా బాధ్యతాభారం మోపింది. "చీకటి గదుల్లో"గూడుపుఠాణీలవల్ల,రహస్య సమాలోచనలవల్ల-ప్రయోజనాలను పొందేఅవకాశాలనురేడియో టెలివిజన్‌లువచ్చి తగ్గించే శాయి.ఒకప్పుడు రాజకీయ అధిపతులకు కృతజ్ఞులుగాను,తరువాతిసమయంలో తమనుఆదుకొన్న హూజ్ వెస్ట్‌కు స్నేహితులుగాను ఉన్న'సామాన్యజనం', దేశంలోజీవనస్థాయి పెరగడంతో బాగా తగ్గిపోయారు. పైగా ఈజనమే ఇప్పుడుహాయిగా జీవిస్తూ ఉండడంవల్ల వారి వోట్లను ఆకర్షించడానికి క్రొత్త విధమైన రాజకీయపు ఎరలు అవసరం అవుతున్నవి. ఎన్నికల్లో డబ్బు ప్రభావంమాత్రం యింకా అధికంగానే ఉంది. ఇరుపక్షాలమీదా ధనవంతులైన పోషకుల పలుకుబడి ప్రబలంగానే ఉంది. కాని వోటర్లు లంచగొండితనం యెడల గతంలోకన్నా యెక్కువగా వైముఖ్యం ప్రకటిస్తున్నారనడానికి స్పష్టమైన నిదర్శనాలు ఉన్నాయి.

తమ అనుయాయుల్ని ప్రాథమిక దశలోనే సుసంఘటితం చేయడానికి క్రొత్తపద్ధతులను పార్టీలు ఆలోచిస్తున్నాయి. ప్రజాస్వామిక వాదోప వాదాల ద్వారా తమ ప్రణాళికను ఏర్పాటు చేసుకోడానికి అనువుగా పార్టీ నిర్మాణంలో క్రొత్తపద్ధతులను కనుగొన వలసిందిగా రాజనీతి శాస్త్రజ్ఞులు పార్టీనాయకులను హెచ్చరిస్తున్నారు. ప్రజాస్వామిక విధానంలో అలా ఏర్పాటుచేసిన సమావేశాలు పార్టీ సభ్యులను ఒకచోటికి చేదుస్తాయనీ, కాంగ్రెసుకు, రాష్ట్ర శాసన సభలకు తమ పార్టీకి వోట్లు వేయడానికి ఎక్కువమందిని సమకూరుస్తాయని వారి అభిప్రాయం. అప్పుడే కొంచెము పార్టీనాయకులు నూతన మార్గ విచారణ ప్రారంభించారనడానికి సూచనలు కనిపిస్తున్నాయి. ఇందువల్ల చాలా ముఖ్యవిషయాల్లో అనూచానంగా వస్తున్న ఆచారాలలో తీవ్రమైన మార్పులు రావచ్చును.



# పరిపాలన

"అమెరికా సంయుక్త రాష్ట్రముల అధ్యక్షునికి శాసనాచరణాధికారములు ఉండును". అని రాజ్యాంగం విధిస్తోంది. ఈ 'శాసనాచరణాధికారం'ఏది అనే విషయమై ఇంచుమించు నిత్యమూ కాంగ్రెసుకూ అధ్యక్షునికీ మధ్య ఏదో విధమైన వివాదం వస్తూనేఉంది.

అధ్యక్షాధికారానికి స్థిరమైన పరిమితులు ఏవీ లేవుకాబట్టి, అవి ఏకవ్యక్తి స్థితం కాబట్టి, క్రమమైన న్యాయసూత్రాలు వర్తించని ఏ అసాధారణ పరిస్థితులలో నయినా అధ్యక్షుడు తేలికగా సర్వాధికారాలు వహించగలడు.

రాజ్యాంగం ఖచ్చితంగా అధ్యక్షునికి కొన్ని అధికారాలు ప్రసాదించింది. అతడు 'సరి' అంటే ఒక్కవోటు ఆధిక్యంతో గెలిచే బిల్లు 'కాదు' అనేసరికి మూడింట రెండువంతుల ఆధిక్యంతో గెలవ వలసి వస్తుంది. అంటే అతని 'వీటో' అధికారానికి కాంగ్రెసు సభ్యులలో ఆరవవంతు సభ్యుల బలం ఉన్నదన్నమాట.

విదేశాంగ వ్యవహారాలలో చొరవ తీసుకొన వలసినవాడు అధ్యక్షుడే. అధ్యక్షుడు వ్యవహరించిన ఒడంబడికను సెనేట్ నిరాకరించగలదు. కాని, వేరొక ఒడంబడికను తానైచేయడంకాని,అధ్యక్షుని చేయమని ఒత్తిడి చేయడంకాని, అది చేయలేదు.

కార్యనిర్వాహక శాఖకు ఉన్నతోద్యోగులను సెనేట్అంగీకారానికి లోబడి, అధ్యక్షుడునియమిస్తాడని భావించబడుతుంది.కాని తరుచు ఎవరోఒకసెనేటు సభ్యుడు ఒకవ్యక్తి విషయం అధ్యక్షునిదృష్టికి తెస్తాడు ఆ సెనేటుసభ్యుడితో తనకుఏమాత్రంఅవసరంఉన్నదేజాగ్రత్తగాఆలోచించకుండాఅధ్యక్షుడుఅతని మాటలు కాదనలేడు. పైగా 'సభ్యమర్యాద'(Senatorial Courtesy) అని – ఒక ఆచారం ఉంది. ఈ ఆచారం ప్రకారం అధిక సంఖ్యాక పక్షానికి చెందిన ఏ సభ్యుడైనా, తన రాష్ట్రంలో ఫెడరల్ ఉద్యోగానికి ఎవరు నియమించబడినా–ఆవ్యక్తి తనకు వ్యక్తిగతంగా యిష్టుడుకాడని ప్రకటన చేసి – ఆపుచేయగలడు. అప్పుడు అతని తోటిసభ్యులు ఆ నియామకాన్ని నిరాకరించడంద్వారా అతని యెడల తమకుగల మర్యాదను చూపిస్తారు. కాని ఈ ఆచారంవల్ల–రిపబ్లికనులు అధికారంలో ఉన్నప్పుడు దక్షిణాదిని వారిఇష్టంవచ్చిన నియామకాలు చేయడానికి గాని, డెమోక్రట్లు అధికారంలో

ఉన్నప్పుడు దివ్యకటుల ప్రాంతమైన ఉత్తర రాష్ట్రంలో వారి యిష్టంవచ్చిన వారిని నియమించడానికిగాని — ప్రతిబంధకం ఉండదు.

సంయుక్తరాష్ట్ర నిర్మాతలపై తన భావాల ప్రభావం ప్రబలంగా ప్రసరింప చేసిన ఆంగ్ల తత్త్వవేత్త జాన్‌లాక్ తానువ్రాసిన "ప్రభుత్వంపై వ్యాసాల"లో ఇంగ్లండులోని కార్యనిర్వాహణాధికారం — లేక — రాజ ప్రత్యేకాధికారం (Prerogative) యొక్క విచిత్రమైన లక్షణాన్ని వివరించాడు.

ఈరాజ ప్రత్యేకాధికారం మనదేశంలోని వివేకవంతులైన రాజులచేతిలోనే ఎక్కువగా ఉండడానికి కారణం వారు ప్రజా శ్రేయోభిలాషులు కావడం. అందుచేత ఈ రాజులు శాసనాతీతంగానో, శాసన విరుద్ధంగానో వ్యవహరించినప్పుడల్లా, సర్వ శాసనాలకూ మూలప్రాణమైన, పరమలక్ష్యమైన అనుగుణంగానే వారు వ్యవహరించారు కాబట్టి — వారు చేసినదల్లా బాగుందని ప్రజలు సంతృప్తిపడి, ఆమోదించేవారు" అని లాక్ వ్రాశాడు.

శాసన నిర్మాణాధికారం సమాజం ఒకసారి అప్పజెప్పిన వ్యక్తిచేతిలో — అత్యున్నతమైనదనీ, అతి పవిత్రమైనదనీ, మార్చ సాధ్యం కానిదని కూడా వ్రాశాడు.

సంయుక్తరాష్ట్రాల రాజకీయ చరిత్ర చాలవరకు ఇంగ్లండు వలెనే ఈ శాసననిర్మాణ, కార్యనిర్వాహక అధికారాల మధ్యనున్న విరుద్ధబాంధవ్యం పనిచేసినరీతిని బట్టి రూపొందింది. అమెరికాలో ముఖ్యంగా రేడియో, టెలివిజన్లు వచ్చి ప్రజలకు అధ్యక్షునితో సాన్నిహిత్యం పెంపొందించిన నాటి నుండీ, కార్య నిర్వాహణాధికారపు పరిమితులు ఎక్కువగా అధ్యక్షునియెడ ప్రజల అభిప్రాయానుసారం నిశ్చయించబడుతున్నాయి. కాని గత చరిత్రలోకూడా చాలాసార్లు అధ్యక్షుడు "న్యాయశాసనాతీతంగానో, న్యాయశాసన విరుద్ధంగానో ప్రవర్తించిన" సంఘటనలు ఉన్నాయి.

ఉదాహరణకు 1793లో బ్రిటనుపై ఫ్రాన్సు యుద్ధాన్ని ప్రకటించినపుడు అధ్యక్షుడు వాషింగ్టన్ అమెరికా తాటస్థ్యం వహిస్తుందని ప్రకటించాడు. అప్పటికే ఫ్రాన్సుతో అమెరికా చేసికొన్న మిత్రత్వసంధి — ఫ్రాన్సు తాపై యుద్ధాన్ని ప్రారంభించినపుడు వర్తించదని అతడు విశ్వసించి యీ పని చేశాడు. కాని మాడిసన్ మాత్రం వాషింగ్టన్ రాజ్యాంగాధికార రహితంగా వ్యవహరించాడనీ, ఇంగ్లండు రాజుకున్న రాజప్రత్యేకాధికారాలను అనుకరించాడనీ నిందించాడు.

1803లో అధ్యక్షుడు జెఫర్సన్‌కు–నెపోలియన్‌నుండి లూయీజియానా ప్రాంతాన్ని కొనే అవకాశం దొరికింది. ఆ అవకాశం తక్షణం చిక్కించుకోక పోతే–నెపోలియన్ మనస్సు మార్చుకొనేట్టున్నాడు. జెఫర్సన్ వెంటనే ఆ ప్రాంతాన్ని కొనేశాడు. ఆ పని రాజ్యాంగాతీత మయినదని తరువాత అతడే అనధికారంగా అంగీకరించాడు. కాని కాంగ్రెస్ అతనికి కావలసిన ధనం తీసుకోనిచ్చి తోడ్పడుతుందని అతడు ఆశించాడు. కాంగ్రెస్ అతనికి తోడ్పడింది. అందువల్లే నేటికి మిసిసిపీ లోయ పశ్చిమ అర్ధభాగం అమెరికా అధీనంలో ఉన్నది.

బహుశా అబ్రహామ్ లింకన్ రాజ్యాంగాన్ని ఇతర అధ్యక్షులకంటె భిన్నమైన పద్ధతులలో అతిక్రమించాడు. కాని అందుకు అమెరికన్ ప్రజలు అతని కీర్తికి కళంకం ఆపాదించలేదు.

ఉదాహరణకు హెబియస్‌కార్పస్ హక్కును రాజ్యాంగ విరుద్ధంగా లింకన్ నిరాకరించాడు. పైగా మొత్తం రాజ్యాంగం నాశనం కాకుండా రక్షించడానికి ఆ చర్య అవసరమనే కారణంతో ఆ పని చేశానన్నాడు. ఒక్క సూత్రానికి భంగం కలుగుతుంది కాబట్టి – దాన్ని ఆచరించి, ఆ ఒక్కటీ తప్ప మిగిలిన రాజ్యాంగమంతా నాశనమైపోయి, ప్రభుత్వమే శకలవికలమై పోయేట్టు చేయడమేనా? అని అతడు ప్రశ్నించాడు. ఆ ఒక్క సూత్రాన్ని నిర్లక్ష్యం చేయడంద్వారా ప్రభుత్వం నిలబడుతుందని విశ్వసించబడే సమయంలో–ఆ సూత్ర ప్రకారం ప్రవర్తించడంవల్ల ప్రభుత్వం పడిపోతే,అప్పుడు మాత్రం తాను తీసుకున్న అధికార ప్రమాణం భంగమై పోయినట్లు కదా ? అని అతని వాదన.

1917లో అమెరికాలో మొదటి ప్రపంచ యుద్ధంలో దిగక ముందు వుడ్రోవిల్సన్ అమెరికావర్తకనౌకలను ఆయుధయుతం చేసేందుకు కాంగ్రెస్ నుండి అధికారం పొంద ప్రయత్నించాడు. కాని కాంగ్రెసు అందుకు నిరాకరించడంతో విల్సన్ – సర్వసైన్యాధ్యక్షుడుగా తనకున్న అధికారాలను వినియోగించుకొని, సాయుధబలాలలో కొన్నిటిని వర్తకనౌకలపైకితరలించాడు.

రాజ్యాంగం ప్రకారం కాంగ్రెసుకు యుద్ధాన్ని 'ప్రకటించే' అధికారం ఉంది. యుద్ధానికి దిగాలా అక్కరలేదా అన్నవిషయాన్ని కాంగ్రెసు సభచేత నిర్ణయింప చేయుటమే రాజ్యాంగపద్ధతిలోని ఉద్దేశ్యంగా ఊహించవచ్చు. కాని నిజానికి, శక్తివంతమయినది ఏ పద్ధతైనా అమెరికాను యుద్ధంలోకి దింప

గలగవచ్చు. **1906**లో శాన్ ఫ్రాన్సిస్కో విద్యాసంఘం కాలిఫోర్నియా రాష్ట్రంలో ఉన్న ప్రజలభావాన్ని గమనించి పాఠశాలల్లో శ్వేతజాతుల పిల్లల నుండి జపానుజాతి పిల్లలను వేరుచేయాలని ఆజ్ఞాపించింది. ఈ చర్య జపానులో పెద్ద అలజడికి కారణభూత మయింది. అప్పుడు థియోడోర్ రూజ్‌వెల్ట్ శాన్‌ఫ్రాన్సిస్కో తన మంత్రివర్గ సభ్యులలో ఒకరిని పంపించాడు. కాని, శాన్‌ఫ్రాన్సిస్కో విద్యాసంఘాన్ని ఆ ఆజ్ఞను ఉపసంహరించుకో వలసిందిగా నిర్బంధించే అధికారం తనకు ఉందనే భావంతో అతడీపని చేయలేదు. తాను యీ నష్టాన్ని తొలగించడానికి శాయశక్తులా ప్రయత్నించినాడని జపానువారికి తృప్తి కలగచేయడం కోసమే యీపనిచేశాడు. ఒకొక్కప్పుడు అధ్యక్షుడు తన అధికార పరిమితిలో ఉన్న చర్యలనే తీసుకుంటూ, చివరకు యుద్ధాన్ని తెచ్చిపెట్టగలడు. ఉదాహరణకు తటస్థంగా ఉండే హక్కును ధిక్కరించినందుకు బ్రిటిషువారిని, జర్మనువారిని ప్రెసిడెంటు విల్సన్ ఎదిరించిన పద్ధతి – అమెరికను ప్రజాభిప్రాయం తాటస్థ్యంనుంచి క్రమంగా జర్మను వ్యతిరేక స్థితికి మారేటట్లు చేసింది. చివరకు యుద్ధప్రకటన కోసం అతడు కాంగ్రెసును అర్థించేటప్పటికి–తిరస్కరించే సమయం మించిపోయి, ఒప్పుకోక తప్పని స్థితి ఏర్పడింది. **1812**లోమాత్రం కాంగ్రెసులో అధిక సంఖ్యాకులు ఇంగ్లండుతో యుద్ధాన్ని తీవ్రంగా వాంఛించారు. కాని **1812**లో మాడిసన్ తన యిష్టానికి వ్యతిరేకంగా యుద్ధంలోకి దింపబడ్డాడని కొందరు చరిత్రకారులు భావించారు.

నిజానికి తరుచు కాంగ్రెసూ, అమెరికన్ ప్రజలూ, చర్చించక ముందే అధ్యక్షుడు యుద్ధానికి శాంతికి సంబంధించిన సమస్యలను నిశ్చయించవలసి ఉంటుంది. పెరల్ హార్బరు ముట్టడికి ముందు అనేక సందర్భాల్లో అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్టు హిట్లరుపై శీఘ్రచర్యలు తీసుకొన్నాడు. ఆలస్యం అయితే ఆచర్యలు నిష్ఫలమైపోయేవి. గ్రీన్‌లాండ్ తీరంపై గల జర్మను సైనిక శిబిరాలను పట్టుకొనడం, ఐస్‌లాండ్‌ను రక్షించడానికి సైన్యాలు పంపడం మొదలైనవి ఈ చర్యలలో కొన్ని. అధ్యక్షుడు ట్రూమన్‌కుకూడా బెర్లిన్ దిగ్బంధనం ప్రారంభంలోను, దక్షిణకొరియాను కమ్యూనిస్టులు ముట్టడించినప్పుడూ ఇలాటి అత్యవసర పరిస్థితే కలిగింది. స్వేచ్ఛాయుత ప్రపంచం మీద జరిగిన ఈ రెండు దండయాత్రలూ రెండవ ప్రపంచయుద్ధానికి దారి తీసిన జపాన్, ఇటలీ, జర్మనీల దురాక్రమణల వంటివే. అప్పుడు బెర్లిన్

లోను, కొరియాలోను సోవియట్లకు తక్షణ ప్రత్యుత్తరంచెప్పి ఉండకపోతే, ప్రపంచం మూడవ యుద్ధానికి దారితీసే స్థితిలో ఉండేది. ఈ తక్షణావశ్యకతలను నెరవేర్చడానికి ప్రత్యేకాధికారాలతో వ్యవహరిస్తున్న అధ్యక్షునికి తప్ప దేశంలో ఇతరులెవ్వరికీ అవకాశం లేదు.

అధ్యక్షునికి రాజ్యాంగం ద్వారా లభించిన అధికారం ఉన్నా, కాంగ్రెసు సభకు యిష్టం లేకపోతే అతనికి అవసరమైన ధనాన్ని మంజూరు చేయ నిరాకరించడం ద్వారా అతని వ్యవహారాలను అడ్డుకోవచ్చు. బలహీనంగా ఉన్న 'నాటో' (**NATO**) రక్షణ సైన్యాలను బలీయం చేయడానికి అధ్యక్షుడు ట్రూమన్ అమెరికన్ సైన్యాలను పంపినపుడు – గతంలో చాలా మంది అధ్యక్షులు విదేశ భూ భాగంపై సైన్యాలు దింపడం మంచిదని భావించినప్పుడు చేసినట్లుగానే – సర్వసైన్యాధ్యక్షుడుగా వ్యవహరించాడు. అపుడు కాంగ్రెసులో–ఆ పని చేయడానికి అధ్యక్షునికి అధికారం ఉన్నదా లేదా అని–పెద్ద వివాదం చెలరేగింది. అతని ప్రతికక్షులు కొందరు డబ్బు ఇవ్వడం మానివేయడం ద్వారా అతని చర్యలను ఆటంక పరుద్దామని ప్రయత్నం కూడా చేశారు.

కార్య నిర్వాహక, శాసన నిర్మాణ శాఖలకు మధ్య అధికారం కోసం పెనుగులాటలూ, రాజకీయ ప్రాబల్యంకోసం జరిగే క్లిష్టమైన పెనుగులాటలూ–వీటి సమ్మేళనమే కాంగ్రెసుతో అధ్యక్షుని కున్న బాంధవ్యాల స్వరూపం. పార్లమెంటులో అయితే, ప్రధాని పక్ష అనుయాయులలో అధికులు ప్రధానికి అండగా నిలుస్తారు. ప్రధాని ముఖ్యమైన సమస్యపై పరాజయం పొందితే అతనితోపాటు అతని పార్టీకూడా అధికార భ్రమవుతుంది. కాబట్టి వారు అతనిని బలపరచక తప్పదు. కాని, కాంగ్రెసులో మాత్రం ఎప్పుడూ అధ్యక్షుడు చేసిన ప్రతిపాదన రెండు పక్షాలలోనూ చీలికలు కలిగిస్తుంది. కొందరు ఆ ప్రతిపాదనకు వ్యక్తిగతమయినకారణాలు ఆధారంగా అంగీకారమో అనంగీకారమో తెలియజేస్తారు. మరికొందరు దానిని పార్టీ కారణాలు ఆధారంగా బలపరచడమో, నిరాకరించడమో చేస్తారు. దీనికి నిజంగా కారకమైన శక్తులేవో రాజ్యాంగాన్ని చదివితే తెలియదు. అధ్యక్షుడు ప్రతి పక్షంలో నుంచి కూడా స్నేహితులను సంపాదించు కొనగల చాకచక్యం గలవాడైతే, కేవలం స్నేహంవల్లనే అతడు చాలా వోట్లను సంపాదించు కుంటాడు. అధ్యక్షుని చేతిలో చాలా ఫెడరల్ ఉద్యోగాలుండి,

వాటి నియామకాలు ప్రకటితం కాకుండా ఉంటే, ప్రతిపక్షం వారికి ప్రభుత్వోద్యోగి పక్షంలో వారి ప్రతినిధులను నిలిపే అవకాశం చూపి కొన్నివోట్లు కొనుక్కోగలడు. అధ్యక్షుని పక్షంలోనే తప్పక ఉండి, అతని మార్గాన్నే బలపరచ వలసి వచ్చే భావాలుగల కాంగ్రెసు సభ్యుడికి—అధ్యక్షుడి పక్షంలోని వ్యతిరేక సభ్యుడికి వచ్చే టన్ని ఉద్యోగాలు రాకపోవడం గమనించ దగ్గవిషయం.

వైట్‌హౌసుకి వచ్చిన క్రొత్త రోజుల్లో ప్రతి అధ్యక్షుడికి – కొన్నాళ్లపాటు 'క్రొత్త కాపురం'లా ఉంటుందని చెప్తారు. ఎదుటి వర్గం వాళ్ళని ఊరుకో పెట్టేందుకు చేతుల్లో చాలా ఉద్యోగా లున్న కాలం ఇది. ఈ ఉద్యోగాల నిలవ తగ్గిపోగానే కాంగ్రెసుకి వైట్ హౌస్ కి మధ్య అనవాయితీగా వస్తున్న విభేదం తల ఎత్తుతుంది. అప్పటి నుండి అధ్యక్షుడు తనపై ప్రజల కున్న మోజు మీదా, ప్రజల బలం మీదా ఆధారపడి ఉండాలి.

అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్టు, తన ఉపన్యాసాలతో రేడియోను ప్రబలంగా ఉపయోగించుకోవడం ప్రారంభించాడు. ఆగ్రహ భీకరమైన కాంగ్రెసు సభతో చాలాసార్లు జరిగిన తీవ్రమైన సంఘర్షణలలో అధ్యక్షుడు రూజ్‌వెల్టు తన ప్రతిపాదనలు గెలిపించుకోడానికి కారణం – కాంగ్రెసులోని అతని అనుయాయులు దేశంలోని ప్రజలకు భయపడడమే !

కాని అధ్యక్షుడు తన పక్షంలోని కాంగ్రెసు సభ్యుణ్ణికాని, సెనేటు సభ్యుణ్ణికాని. 'బహిష్కరించ' ప్రయత్నిస్తే— ప్రజలు ఆ సభ్యుణ్ణి సమర్థించ డానికి సమాయత్త మౌతారు. 1938లో రూజ్‌వెల్టు తన విధానాలను వ్యతిరేకించిన కొందరు డెమోక్రట్లను వోటర్లు ఓడించేట్లు చేయ ప్రయత్నించాడు. కాని వాళ్ళంతా పెద్దపెద్ద అధిక్యతలతోగెలుపొందారు. అధ్యక్షుడు పార్టీ లోపల తన శత్రువుపై, చాలా రహస్యంగా తన ప్రాబల్యాన్ని ఉపయోగించ వీలున్నప్పటికీ, పార్టీ ఎన్నికల్లో ఉన్నప్పుడు మాత్రం దానిలో ఐక్య సంఘటనకు అతడు ఎన్నడూ విచ్ఛిన్నం చేయ కూడదు. అయితే అధ్యక్షుడు 'బహిష్కరణ విధానం' అనుసరిస్తే దేశవ్యాప్త ప్రతిఘటన రావడానికి అమెరికన్ ద్వి పక్ష విధానంలోని వైచిత్రి యెడల ప్రజలకు గల గాఢ గౌరవమే కారణం. అమెరికాలోని 'మంత్రి మండలి' బ్రిటన్‌లాంటి పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థలోని మంత్రి మండలి లాంటి సంస్థ కాదు. ముఖ్యంగా అందులోని వివిధ శాఖల అధిపతులు కాంగ్రెసులో సభ్యులుగా ఉండరు. వారు సభ్య

లకు బాధ్యులుగా ఉండడానికి కాంగ్రెసుసభా రంగంలో కనపడరు. అధ్యక్షుడు చాలా క్లిష్టమైన విషయా లన్నీ ఆలోచించి, ఆ స్థానానికి తగిన అర్హతమాత్రమే ముఖ్యమైన అర్హతగా చూచుకొని, తన మంత్రి మండలిని ఏర్పాటుచేస్తాడు. వోట్లు వేటాడడం అవసర మయిన రాష్ట్రాలకు, ప్రాంతాలకు, వివిధ ముఖ్య మత, ఆర్థిక కూటములకు, ఈ మంత్రి వర్గ స్థానాలు జాగ్రతగా పంచిపెట్టాల్సి ఉంది. పూర్తిగా డెమోక్రటిక్‌పార్టీ ప్రాంత మయిన దక్షిణాదినుంచి కాని, కేవలం రిపబ్లికన్ ప్రాంతంనుంచి కాని మంత్రివర్గ సభ్యులు తరుచు రారు. ఎందుకంటే, ఎప్పుడూ ఒకే విధంగా తప్పక వోటు చేసే రాష్ట్రాలవారి భక్తి విశ్వాసాలకోసం కొన్ని పదవులు కేటాయించడం రాజకీయ సంపదను వృథా చేయడ మవుతుంది!

మంత్రివర్గ సభ్యుల ఆధిపత్యం క్రింద ఉండే ప్రభుత్వ శాఖలు ఇంచుమించు పూర్తిగా అధ్యక్షుని పర్యవేక్షణం క్రింద ఉంటాయి. అధ్యక్షునకు రాజ్యాంగం యిచ్చిన అధికారాల ప్రకారం నిర్వహించవలసిన ఏ విధి నిర్వహణను తిరస్కరించినా-- ఆ మంత్రి వర్గసభ్యులను అధ్యక్షుడు తొలగించవచ్చు. మొదట ఆంతరంగికవ్యవహార శాఖలు మాత్రం అధ్యక్షునికి నిశ్చితంగా లోబడి ఉండాలనే ఉద్దేశించ బడ్డాయి. కోశాంగ కార్యదర్శి విధులు సభాధికారులకు సంబంధితమైనవి కాబట్టి అతడు నేరుగా కాంగ్రెసుకు నివేదికలు ఇవ్వాలని నిర్దేశించ బడింది. కాని అధ్యక్షుడు వాషింగ్‌టన్ మంత్రిమండలి సంతటినీ అధ్యక్షాధికారం క్రిందికి తీసుకొనడం ప్రారంభించాడు. ఇప్పుడు అధ్యక్షుడు అన్నిశాఖలపై ఆధిపత్యం వహించడాన్ని వదలుకొనడు. ఇదికాక కాంగ్రెసు తన అధికారాలకు సంబంధించిన క్రొత్త విధులను సృష్టించి వాటిని నిర్వర్తించే పని ఒక మంత్రివర్గ సభ్యునికో లేక ఒక శాఖాధిపతికో అప్పగించ వచ్చు. కాగా -- అట్టి విధులను నిర్వహిస్తున్న ఉద్యోగులను ఆదేశించడానికి గాని, శిక్షించడానికి గాని, అధ్యక్షుని కున్న అధికారాల పరిమితి ఎంత వరకు అన్న విషయం మాత్రం పూర్తిగా తేల లేదు.

నిరుద్యోగులకు ఉద్యోగాలను ఇవ్వడానికి '**1935** సంవత్సరపు కార్యాభివృద్ధి పరిపాలకసంస్థ', ప్రైవేటు వ్యాపారంలో కొన్నిపద్ధతులను సక్రమపరచడానికి 'ఫెడరల్ వర్తక సంఘం' ఇలాటి ఎన్నో అత్యవసర, స్వతంత్ర సంస్థలను కాంగ్రెస్ సృష్టించింది. ఇలాటి సంస్థలకు-అధ్యక్షునితోగల బాంధ

వ్యాల విషయంలో న్యాయస్థానాలు ఎన్నడూ నిర్దిష్టంగా తీర్చలేని ఎన్నో సమస్యలు ఉద్భవించాయి. 'గ్రామీణ విద్యుచ్ఛక్తి పాలక సంస్థ' వంటి సంస్థలు సామాన్య పరిపాలక శాఖ క్రింద ఉంది, మొత్తం జాతీయ పరిపాలన కంతటికీ అధిపతియైన అధ్యక్షునిచేత పాలించ బడడానికి అనువైనవే. కాని కొన్ని ఆ విధంగా ప్రత్యక్ష అధ్యక్షపాలనకు అంత తేలికగా అనువయ్యేవి కావు. పౌర విమాన యాన సంఘం, ఫెడరల్ కమ్యూని కేషన్సు సంఘం—విమానాల, రేడియో స్టేషనుల, నిర్వహణానికి అవసరమయిన నియమాలు తయారుచేసే అధికారాలతో ఏర్పాటు చేయబడ్డాయి. ఆ నియమాలకు న్యాయ శాసనాన్ని కున్నంతబలం ఉంటుంది. ఈ సంస్థలు అందరు చెప్పే మాటలూ విని, నిజమైన విషయాలు తెలిసికొని, కాంగ్రెసు సభ సూచించిన ప్రాథమిక సూత్రాల కనుగుణంగా, కొన్ని నిశ్చయాలు చేయ వలసి ఉంది. సహజంగా, అటువంటి సంస్థలపై అధికారం చలాయించడానికి అధ్యక్షునికి తక్కువ అవకాశం ఉంటుంది.

ఇక, న్యాయ పాలక లక్షణాలు కొన్ని మాత్రమే గలశాఖలు [half-Judicial] ఉన్నాయి. ఇవి ఫెడరల్ ట్రేడ్ కమిషన్ వంటివి. ఇవి విచారణలు జరిపి, ఒక ప్రైవేటు సంస్థ న్యాయ శాసనాన్ని ధిక్కరిస్తున్న దనీ, అది దాని మార్గం మార్చుకోవా లనీ నిశ్చయిస్తాయి. తనకు ఇష్టంలేని నిష్ణయాలు చేసినందుకు ఫెడరల్ ట్రేడ్ కమిషన్ అధిపతిని బర్తరఫ్ చేసే అధికారం అధ్యక్షునికి లేదని సుప్రీం కోర్టు నిశ్చయించింది.

ఈ శాసననిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయపాలక శాఖల విచిత్ర సమ్మేళన సిద్ధాంతం న్యాయస్థానాలకు చాలా ఆందోళన కలిగించింది. కాని యిందులోని ఆచరణ భాగం అర్థంచేసుకోవడం అంత కష్టంకాదు. ఉద్యోగులందరూ అధ్యక్షుని అధికారాలకు లోబడినవారూ,లోబడనివారూకూడాఅధ్యక్షుని చేతనే నియమించబడి సెనేట్‌చేత ఆమోదించబడతారు.దేశంలో వివిధ రాష్ట్రాలకు గ్యాస్ సరఫరాను నిర్వహించే ఫెడరల్‌పవర్ కమిషన్ వారివాదం పరిశీలిస్తే ఇందులోని రాజకీయ సత్యం బోధపడుతుంది. ఈ కమిషన్ గ్యాస్ కంపెనీలవారు కోరినధరలు నిశ్చయించడానికి అంగీకరించక పోవడంతో—కంపెనీలవారు కాంగ్రెసుకు అపీలుచేసి ఆవిషయాల్లో కమిషన్‌కు అధికారం లేకుండా ఉండేట్లుచట్టం చేయించారు. కాని అధ్యక్షుడుట్రూమన్ ఆచట్టాన్ని 'వీటో' చేశాడు. వీటోను అధిగమించి ఆ చట్టాన్ని కాంగ్రెసుసభ శాసనం

చేయలేకపోయింది. ఆసమయంలో, వెనుక గ్యాస్ కంపెనీలకు ప్రతికూలంగా వోటుచేసిన ఒక కమీషనర్ పదవీకాలం సమాప్తమయి ఆస్థానంలో మరొకరిని నియమించవలసి వచ్చింది. గ్యాస్ కంపెనీలన్ని కలిసి సెనేటు సభ ఆ నియామకాన్ని ఆమోదించకుండా చేశాయి. చివరకు ఆ కంపెనీలకు అనుకూలుడైన మరొక కమీషనర్ నియమించబడి ఆమోదించబడ్డాడు. ఈ నియామకం బలాబలాలను తారుమారు చేసింది. అపుడు మళ్ళావ్యవహారం అంతా సవ్యంగా సాగిపోయింది. ఈ కథలో నీతి ఏమిటంటే–ఏదైనా సంస్థ కాని, చివరకు న్యాయస్థానం కాని, ఎన్నికల ఫలితాల ప్రభావాన్ని వెంటనే కాకపోతే, కనీసం కాలక్రమాన అందులో వ్యక్తుల పునర్నియామకం జరిగేటప్పుడైనా, చవిచూచి తీరుతుంది – అని.

ప్రభుత్వ విధాన నిర్ణేతలకు దిగువనున్న పరిపాలక వర్గంలో రాజకీయాలతో సంబంధం లేని ఉద్యోగులు ఉంటారు. వీరంతా నిత్యకార్యక్రమాన్ని నిర్వహించే ఉద్యోగులు. ఈ సామాన్య ఉద్యోగులకు ఏదైనా రాజకీయమైన యిష్టాయిష్టాలుంటే, వాటి ప్రకారం వారు వారి స్వరాష్ట్రాలలో వోటు చేయడానికి శాసనం అంగీకరిస్తుంది కాని – వారు తీవ్ర రాజకీయాలలో ప్రవేశం కలిగించుకోకూడదు.

రాజకీయాల్లో ప్రవేశం – ఈ ప్రభుత్వోద్యోగుల సేవాపటిమను దుర్బలం చేస్తుంది. కాంగ్రెసుతీసికొనే శ్రద్ధాసక్తులు మినహాయిస్తే ప్రభుత్వోద్యోగుల విషయంలో సేవాపటిమకు ఉద్దీపకంగాను, ప్రతికూలంగాను పనిచేసేశక్తులు రెండున్నాయి. నిపుణులైనపరిశీలకులు, ప్రభుత్వోద్యోగులచేత పనిచేయించడంలోనేర్పరులైన ఆఫీసర్లు, సమర్థులైన మానేజర్లు, ఉద్యోగుల ప్రవర్తనను అర్థంచేసికొని వారికి అండగా ఉండే ఉన్నత నిర్వాహకోద్యోగులు–వీరంతా ఉద్దీపకశక్తులు. సమర్థమయిన నిర్వహణకు 1947లో ఒక విధానం రూపొందిస్తూ ప్రెసిడెంట్ ట్రూమన్ ఒక ఉత్తర్వును ఇచ్చాడు. ఈ ఉత్తర్వువల్లనే ప్రభుత్వ శాఖలకు అధికారాన్ని అప్పగించడానికీ, కార్యాచరణను అభివృద్ధి చేసే విధంగా నిర్వహణ ప్రమాణాలను నిర్దేశించడానికీ, భీమా సంస్థలలోను బ్యాంకులలోను అనుసరించబడే అతి సవ్యపద్ధతిలోవలె నిపుణుల పరిశీలన జరపడానికి అవకాశం కలిగింది. ఫెడరల్ పరిపాలనలో అత్యున్నత సామ

ధ్యం ఉన్న శాఖలు చాలా ఉన్నాయి. వారు అనుసరించే పద్ధతులు ఇతర వ్యాపారసంస్థలు తరుచు అనుకరించడం కూడా కద్దు.

ప్రైవేటు వ్యాపార సంస్థలలోవలెనే ప్రభుత్వంలోకూడా ఉద్యోగుల చేత పని చేయించుకొనడంలో నవీనపద్ధతులు తెలియని మానేజర్లే పటిష్టతకు అడ్డు నిలుస్తారు. రాజకీయ కారణాలవల్లనో, సైనిక విషయాలలోనో, విదేశ వ్యవహారాలలోనో, సామర్థ్యం కలవారవడంచేత నియమించబడిన ఇట్టి ఉద్యోగులు కార్యాలయ నిర్వాహణలో దక్షత లేనివారు కావడం సంభవమే. కేవలం ఒక పెద్ద సంస్థను వీలున్నంత తక్కువ వ్యయంతో నిర్వహించగల సామర్థ్యాన్నిమాత్రమే చూసుకుని అధ్యక్షుడు మంత్రిమండలిని నిర్మించలేడుగదా!

ప్రభుత్వ నిర్వహణకు అవుతున్న వ్యయం విషయంలో కాంగ్రెసు జోక్యం కలుగజేసికొనడంవల్ల తరుచు ప్రభుత్వోద్యోగుల పాటవం తగ్గుతుంది. అత్యంత సమర్థమైన ప్రైవేటు వ్యాపారసంస్థలు అనుభవంలో చూచినట్లుగా – ఉద్యోగులయెడల మర్యాదగా ప్రవర్తించడమే కార్యనిర్వహణలో మంచిపద్ధతి. మధ్యాహ్న సమయంలో 'కాఫీ'కి కొంత విరామాన్ని యివ్వడం ఇలాంటి ఒక మర్యాద. ఇలా మర్యాదగా చూడడం ఫలితంగా నిజానికి తక్కువ వ్యయంలో ఎక్కువ ఉత్పత్తి సాధించ బడుతుంది. కాని ఇలాటి పద్ధతులు తేలికగా రాజకీయ విమర్శలకు గురి అవుతాయి !

ఉద్యోగులను సోమరు లనీ, అవినీతి పరులనీ, తీవ్రంగా విమర్శించడం ద్వారా రాజకీయవేత్తలు వోట్లను తేలికగా సంపాదించుకో గలరు. కాని యిందువల్ల ఉత్పత్తి దెబ్బతింటుంది. ఉత్పత్తికి సంబంధించిన నిర్దుష్టమైన లెక్కలు చూడగా - ఒకశాఖను విమర్శిస్తూ కాంగ్రెసులో చేయబడిన ఒక ఉపన్యాసంవల్ల 100,000 డాలర్ల నష్టం వచ్చిందని తెలుస్తోంది.

కాని ఒక్కొక్కప్పుడు సత్యంగా, సమ్యకంగా కాంగ్రెసుసభ విచారణ జరిపితే – అసమర్థుడైన అధిపతిక్రిందనున్న శాఖలో జరిగే వృథావ్యయం పట్టుబడి, డబ్బు పొదుపు చేయబడుతుంది. రాజకీయ వేత్తల సహాయంతో కార్య నిర్వాహణలో నవీన పద్ధతులు నేర్చుకొన్న వ్యాపారప్రముఖుల సేవాసహాయాలు సంపాదించ గలిగితే–అప్పుడు ప్రభుత్వోద్యోగ వర్గంపై రాజకీయాల ప్రాపకాన్ని ప్రయోజనకరంగా మార్చినట్లవుతుంది.

ఇటువంటి వ్యక్తులు తగినంత మంది ఈ సమస్యపై తమ దృష్టిని ప్రసరింపచేసి కాంగ్రెసులో తమ పలుకుబడి నుపయోగిస్తే రాజకీయ విమర్శలు చాలా తగ్గిపోతాయి. అంతేకాక వారు ప్రభుత్వంలోని సమర్థులైన వారికి పరిపాలనా పరిజ్ఞానం కలిగించి వారికి అత్యావశ్యక మైన సహకారాన్ని కూడా ఇవ్వగలుగుతారు.

ఫెడరల్ ప్రభుత్వ పరిపాలనా పరిమాణం ఎప్పుడూ చాల ఆందోళనను కలిగిస్తూనే ఉంది. దానికి అయే వ్యయమూ, అంతకంటే ఎక్కువగా ఆ ఉద్యోగవర్గ 'బాహుళ్యమూ' ఇందుకు కారణాలు. బ్రహ్మాండమైన ప్రభుత్వ శాఖలు వేలకొద్దీ ఉద్యోగులతో పరిపాలనా వ్యవస్థలోని గందరగోళంలో మునిగిపోయి, చివరకు కాంగ్రెసుకూ అధ్యక్షునికీ కూడా దృష్టిగోచరం కాకుండాపోవచ్చు ననే భయం వ్యక్తం చేయడానికి - అమెరికన్ భాషలో "ఉద్యోగవర్గ బాహుళ్యం" (Bureaucracy) అనే మాట వాడతారు. కొన్ని కొన్నిశాఖలు ఎప్పుడో అత్యవసరమయిన పనికోసం సృష్టించబడి, తరువాత ఎవరూ వాటిని గుర్తించి మూసివేయమని చెప్పలేదు కాబట్టి—ఇంచుమించు స్వతంత్రంగా ఉంటూ ఇప్పటికీ నడుస్తున్నాయని అనుమానంగా కూడా ఉన్నది. ఈ అనుమానం అకారణం అని కొట్టివేయు వీలులేదు.

ఇంతకన్న గట్టిదైన మరియొక నమ్మకం – అప్పుడప్పుడు సృష్టించబడిన వివిధ శాఖలు – వాటి పనులను పెంచివేసుకొనడం, అందువల్ల చివరకు ఒకేపని అనేకశాఖలు చేస్తూండడం జరుగుతున్న దని. ఒకొక్కప్పుడు ప్రస్తుతం ఉన్న ఒకశాఖ – దానికి సంబంధించని శాఖలోఉండి - దానికి సంబంధించిన పనులతో ఏ బాంధవ్యమూ లేకుండా పని చేస్తూంటుంది.

ఈ మధ్య వచ్చిన అధ్యక్షులందరూ -- కార్యనిర్వాహకశాఖను మరింత సవ్యంగా, పటిష్టంగా ఉండేట్టు పునర్వ్యవస్థీకరించా లని ప్రయత్నం చేశారు.

పింఛను పుచ్చుకొన్న ఉద్యోగుల శాఖలన్నీ చెల్లాచెదురుగా ఉండగా వాటి నన్నింటిని అధ్యక్షుడు హూవర్ "మాజీ ఉద్యోగుల పరిపాలనాశాఖ" క్రిందికి తీసికొని వచ్చాడు. వివిధ కార్యాలయాల నన్నిటిని – కాంగ్రెసు సభవారి పరిశీలనకు లోబడి—మార్చడానికి అధ్యక్షునికి అధికారాలిస్తున్న

'పునర్వ్యవస్థీకరణ శాసనం' 1932 లో అతడు చేయించాడు. అట్టి మార్పులన్నీ అతడు కాంగ్రెసుకు నివేదించాలి. 60 రోజుల లోపున నిరాకరించబడకపోతే అవి శాసనాలై పోతాయి.

కాని, ఆ సంవత్సరమే కాంగ్రెసు డెమోక్రట్ల అధీనమైంది. ఈ మార్పులన్నీ క్రొత్త డెమోక్రట్ అధ్యక్షునికి వదలిపెట్టాలనే భావంతో – అధ్యక్షుడు హూవర్ చేసిన ఏర్పాట్లను కాంగ్రెసు నిరాకరించింది.

అధ్యక్షుడు రూజ్‌వెల్టు 1936 లో ఈ పునర్వ్యవస్థీకరణవిషయం పరిశీలించడానికి ఒక సంఘాన్ని నియమించాడు. అది 1937 లో సమర్పించిన నివేదికలోని సుదీర్ఘ ఫలితాలనిచ్చే శిఫారసులు – అధ్యక్షుని ప్రతికూల వర్గాలనుండి తీవ్ర విమర్శలకు, ప్రాతికూల్యానికి గురియైనాయి. చివరకు, 1939 లో చాలా సౌమ్యపరచబడిన చట్టం ఆమోదించ బడింది. దాని మూలాన అధ్యక్షుడు కొన్ని మార్పులు చేయగలిగాడు. ఉదాహరణకు అతడు బడ్జెటును అధ్యక్షుని కార్యనిర్వాహక శాఖాధిపత్యంలోకి మార్చాడు. యుద్ధకాలంలో యుద్ధకాలపు అత్యవసర అధికారాలతో అతడు గృహనిర్మాణ, నౌకా నిర్మాణ శాఖ లన్నింటినీ– జాతీయ గృహనిర్మాణ, యుద్ధ నౌకా నిర్మాణ సంస్థ అనే రెండు సంస్థలలో ఏకంచేయడమే కాక, ఇంకా కొన్ని సంస్కరణలు కూడా చేశాడు.

అధ్యక్షుడు ట్రూమన్ 1947 పునర్వ్యవస్థీకరణ శాసనం చేయించి మాజీ అధ్యక్షుడు హూవర్ అధ్యక్షతను ఒక ద్విపక్ష సంఘం ఏర్పాటు చేశాడు. హూవర్ సంఘం అమూల పరిశీలనచేసి కొన్ని సూచనల నిచ్చింది. హూవర్ సూచనలు అనుసరిస్తే– అతని అంచనాల ప్రకారం ప్రభుత్వానికి 300,00,00,000 డాలర్లు మిగులుతుంది. హూవర్ నివేదికను ప్రజలు ప్రోత్సాహంతో ఆమోదించారు. అధ్యక్షుడు ట్రూమన్ సుమారు 20 ప్రణాళికలు కాంగ్రెసుకు సమర్పించాడు. అందులో మూడువంతులు ఆమోదించ బడ్డాయి. 1953 లో కాంగ్రెసు, పునర్వ్యవస్థీకరణ శాసన కాలపరిమితిని అధ్యక్షుడు ఐసెన్‌హోవరు పదవీకాలంవరకూ పొడిగించింది.

ఈ ప్రభుత్వ శాఖల, కార్యాలయాల పునర్వ్యవస్థీకరణ వలని లాభాలు ప్రజాసామాన్యం నుండి ఉత్సాహవంతమైన సహకారం వచ్చేటంత ఎక్కువగా ఎప్పుడూ లేవు. కాని, ఈ మార్పుల వలన ప్రభుత్వ పాలనలోని కొన్ని ప్రధాన లోపాలు సవరించ బడ్డాయి. ఇంజనీర్ల సంఘం వంటి కొన్ని

సంస్థలు మాత్రం కాంగ్రెసులో విపరీతమైన రాజకీయ ప్రాబల్యం కలిగి ఉండ బట్టి—వాటి యిష్టానికి విరుద్ధంగా ఏ అధ్యక్షుడూ వాటిలో మార్పులు చేయ లేకపోయాడు.

పొదుపు-అంటే ప్రజలకు అక్కరలేనివానిని కొనకపోవడం కాంగ్రెసు చేయవలసిన పని. కాని, ఖర్చులు తగ్గించామనేకీర్తి సంపాదించుకో చూస్తున్న కాంగ్రెసు సభకు 'చాలీ చాలని' బడ్జెట్‌ను సమర్పించడం మూలంగా అధ్యక్షుడు కాంగ్రెసును ఆందోళన పరచవచ్చు. ప్రజలకు అన వసరమైనవి అట్టి బడ్జెట్‌లలో ఇంచుమించు ఏమీ ఉండవు. సేవాపాటవం-అంటే అత్యల్ప వ్యయంతో అత్యధిక ప్రయోజనం పొందడం — అధ్యక్షుని పని. దమ్మిడీ దమ్మిడీ పొదుపు చేయడంవల్లా, వాళ్ళకి యిష్టులైన వారి కొరకు వృథా వ్యయాన్ని చేర్చడం వల్లా, కొంతవరకూ కాంగ్రెసు-అధ్యక్షుణ్ణి ఆందోళన పరచవచ్చు. కాని, మొత్తంమీద అధ్యక్షుడు హూవర్, అతని తరువాతివారు ప్రభుత్వ పాలనలో సమర్థమైన వ్యవస్థీకరణనూ, నవీన పద్ధతిలో నిర్వహణనూ సాధించారని చెప్పవచ్చు.



# కాంగ్రెసు : దాని స్వభావం

అమెరికా సంయుక్తరాష్ట్రాల కాంగ్రెసులో కార్యనిర్వాహకశాఖ ఉండక పోవడమే పార్లమెంటుకూ దానికీ ఉన్న ప్రధానభేదం. ఇంగ్లండులో ప్రధాని' అతని మంత్రివర్గ సభ్యులవలె అమెరికాలో అధ్యక్షుడూ, అతని మంత్రివర్గ సభ్యులూ శాసనసభలో సభ్యులు కారు. ఒక్క అధ్యక్ష దండన (ఇంపీచ్ మెంట్) సమయంలో తప్ప కాంగ్రెసు ప్రత్యక్షంగా అధ్యక్షుని ప్రశ్నలు వేయ లేదు. అది ఏ చట్టాన్నైనా ఆమోదించకపోతే మంత్రి వర్గానికి ఉపద్రవస్థితి రాదు. అలాంటప్పుడు అధ్యక్షుడు రాజీనామా యివ్వడు; కాంగ్రెసును రద్దు చేసి క్రొత్తఎన్నికలు వచ్చేటట్లూ చెయ్యడు.

అమెరికా ప్రభుత్వంలో ప్రజలకు ఒక విధంగా కాంగ్రెసు, మరొక విధంగా అధ్యక్షుడు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఇద్దరికీ -- తమలో రెండవ వారి బారినుండి తమ్ము కాపాడమని ప్రజలను అభ్యర్థించే హక్కూ, అవ కాశమూ ఉన్నాయి; వారు అలా చేయనూ చేస్తారు. దీనివల్ల కార్యనిర్వాహక శాఖకూ, కాంగ్రెసుకూ మధ్య ఉన్న సంఘర్షణ – అధ్యక్షుని పార్టీవారే కాంగ్రెసులో ఆధిపత్యం వహిస్తున్నప్పుడు కూడా – ప్రత్యక్ష వైరంనుండి సాయుధ సంధి పర్యంతం వివిధరూపాలలో ఉంటుంది. ప్రజలు ఒక పార్టీ నుండి అధ్యక్షుణ్ణి, మరొకపార్టీ బలంగా ఉన్న కాంగ్రెసునూ ఎన్నుకుంటే కార్యనిర్వాహక, శాసన నిర్మాణ శాఖలు రెండూ తప్పనిసరిగా పోటీ పడ వలసిన స్థితి వస్తుంది. ఇట్టి స్థితి పార్లమెంటులో అసాధ్యం.

అధ్యక్షుని ప్రతిపాదన వీగిపోయినా అతడు రాజీనామా చేయనక్కర లేదు కాబట్టి – అధ్యక్షుని పార్టీవారే అతని ప్రతిపాదనలకు వ్యతిరేకంగా వోటుచేసినా ఏ ప్రమాదమూ రాదు. అందుకే అమెరికాలో కాంగ్రెసు సభ్యులు ఇతర దేశాలలో పార్లమెంటు సభ్యులకన్నా ఎక్కువ బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తారు. అధికారంలో ఉన్న పార్టీ ఖచ్చితమైన క్రమశిక్ష ణను, జీవన్మరణ విషయంగా భావించి అమలు జరుపదు కాబట్టి, ఇట్టి బాధ్యతా రాహిత్యంవల్ల కాంగ్రెసులోని ఛోటా నాయకులు పత్రికలలో పతాక శీర్షికల కొసం ఉత్సాహంతో ప్రయత్నిస్తారు.

వుడ్రో విల్సన్ కళాశాలలో ఆచార్యుడుగా ఉన్నప్పుడు కాంగ్రెసుకు పార్ల మెంటుకున్న అధికారాలనూ, బాధ్యతలనూ అప్పచెప్పే పద్ధతిలో రాజ్యాం గానికి సవరణలు జరగా లని వాదించేవాడు.

కాంగ్రెసుసభ – అధ్యక్షుడు ప్రతిపాదించిన చట్టాన్ని ఆమోదించడమో, లేక ఉపద్రవపరిస్థితిని ఎదుర్కొనడమో చెయ్యవలసి వస్తే – అపుడు అది తన పని మరింత ఎక్కువ శ్రద్ధతో చేస్తుం దనీ, ప్రజలు దాని కార్యక్రమాలను ఎక్కువ తెలివితేటలతో గమనిస్తా రనీ అతని వాదన. విల్సన్ అధ్యక్షుడయినప్పుడు కాంగెసు తనకు ఎదురు తిరిగిన పక్షంలో ఉపద్రవ స్థితి తెచ్చిపెడదా మని అనుకున్నాడు. అప్పుడు ఉపాధ్యక్షునితో సహా తన మంత్రివర్గ సభ్యు లందరితోటి కలసి అతడు రాజీనామా యిచ్చి ఉండేవాడు. అపుడు అధ్యక్షస్థానవు వారసు లందరూ అప్పటి న్యాయ శాసనం ప్రకారం–పదవులు కోల్పోయే వారు. కాంగ్రెసు మరొక క్రొత్త కార్యనిర్వాహకవర్గాన్ని ఎన్నుకోవలసి వచ్చేది. కాని అప్పటికి అతను ఒక యుద్ధంలో చిక్కుకొని ఉన్నాడు. అందుచేత సుగమంగా నడుస్తూన్న ప్రభుత్వాన్ని తల్లక్రిందులు చేయ సాహసించ లేక పోయాడు. పైగా కాంగ్రెసు సభను పార్లమెంటు పద్ధతిలో మలచవలసిందిగా ప్రజలలో ప్రబలమైన వాంఛకూడా లేదు.

ఈ అధికార విభజన ఫలితంగా దేశంలో ప్రతినిధుల సభకు ఉన్నంత ప్రాముఖ్యం సెనేటుకు కూడా వచ్చింది. ఇతర దేశాలలో దిగువసభ కార్యనిర్వాహక శాఖపై ఆధిపత్యం వహిస్తుంది. కాబట్టి అది ఎగువ సభను కేవలం తల నెరసిన రాజ్య తంత్రజ్ఞుల వాగ్వివాద సభగా చేసివేసి స్వయంగా సర్వాధికారాన్ని వహించే వీలున్నది. ఉదాహరణకు ఇంగ్లండులో ప్రభుసభకు ఉండే 'వీటో' అధికారం తొలగించబడింది. అది ఆమోదించక పోవడం వల్ల ఒక చట్టం ఆలస్యం కావచ్చు నంతే కాని, చివరకు మాట చెల్లుబడిమాత్రం ప్రజాసభదే. కాని అమెరికా సంయుక్తరాష్ట్రాల సెనేటుకు ప్రతినిధుల సభకున్నంత బలమూ ఉన్నది. కొన్నివిషయాలలో అంతకన్న ఎక్కువకూడా ఉన్నది.

రెండు సభలుగల శాసననిర్మాణ శాఖ ఉండడమనే సంప్రదాయం అమెరికన్ రాజకీయ జీవితంలో వేళ్ళు పాతుకుపోయింది.

వలసరాజ్యాల ప్రభుత్వాలకు రెండుసభ లుండేవి. నెబ్రాస్కా తప్ప మిగతా రాష్ట్రాలన్నిటికీ కూడా రెండు సభ లున్నాయి. దేశంలో కాంగ్రెసు ఒక్కటే సభ ఉన్న శాసన సభగా ఉండాలన్న ఉద్యమాన్ని ఆరంభించే ఆలోచన ఎవరికీ తట్టకపోవడానికి ముఖ్యకారణం – ఇప్పటికీ అమెరికా అనేక చిన్న, పెద్ద రాష్ట్రాల సమాఖ్యగా ఉండడమే. చిన్న, పెద్ద రాష్ట్రా

లను ఐక్యపరచే సమస్యకు అమెరికన్ ప్రజలకు నచ్చేటట్లుగా ఇంకొక పరిష్కారమార్గం ఏదీ సూచింపబడలేదు.

అన్ని చట్టాలూ రెండుసభల ఆమోదాన్ని పొందా లన్న నియమం ఉన్నా — అత్యవసర సమయాల్లో ప్రజలు అధ్యక్షుని నాయకత్వాన ఏకం అయినప్పుడు శాసన నిర్మాణం అలస్యం కావడం లేదు. కాని సాధారణ పరిస్థితులలో, సాధారణ సమయాల్లో, శాసన నిర్మాణం చాల నెమ్మదిగా జరుగుతుంది. అన్ని పనులూ చర్విత చర్వణ మవుతుంటాయి. ప్రతిపాదకుల కన్నా ప్రతిపక్షానికి ఎక్కువ బలం ఉంటుంది. అమెరికనులకు అన్నిరకాల ప్రభుత్వాల యెడలనూ అపనమ్మకమే ఉండడం వల్ల, వివాదాస్పద చట్టాలు తేలికగా ఆమోదించబడకపోతే ఎవరూ ఆందోళన పడరు. పైగా ఒకరి ఆలోచన ప్రకారమే పని జరిగేకంటే — ఇద్దరి ఆలోచనలు కలబోస్తే మంచి దంటారు కదా !

సెనేటర్లను రాష్ట్ర శాసన సభలనుండి కాకుండా, సామాన్య ప్రజలనుండి ఎన్నుకోవాలని విధిస్తూ రాజ్యాంగాన్ని సవరించినప్పటికీ — సెనేటుకూ ప్రతినిధుల సభకూ నిర్మాణంలోనూ, ప్రవృత్తిలోనూ చాలా తేడా ఉన్నది.

కాంగ్రెసు సభ్యులు తరుచు సెనేటులోకి వెళ్తుంటారు. కాని, ఎప్పుడూ మాజీ సెనేటర్లు కాంగ్రెసు సభ్యులు కావడం జరగదు. కాని కాంగ్రెసు సభ్యులు 435 మందిలోనూ సెనేటుసభ్యులు 96 గురే కాబట్టి, వాళ్ళ స్థానాలకు ఒక ప్రత్యేకత ఉంది. సెనేటులో సభ్యత్వానికి ఎక్కువ కీర్తి కూడా ఉంది. ఆ పేరును మంచికీ చెడ్డకీ కూడా ఉపయోగించుకోవచ్చు. విదేశాలతో ఒడంబడికలను, అధ్యక్షుడు చేసిన నియామకాలను ఆమోదించవలసిన అధికారం సెనేటుకు ఉండడంవల్ల, చాలామంది సెనేటు సభ్యులకు విదేశ వ్యవహారలను గురించి, పరిపాలనా సౌష్టవాన్ని గురించి ప్రత్యేకాసక్తి కలిగింది. అందులో కొందరు ఈ విషయాలపై మంచి ప్రామాణికులుగా కూడా పేరు పొందారు. సెనేటులోను, ప్రతినిధుల సభలోనూ ఉన్న సభ్యులలో సగంకంటే ఎక్కువమంది న్యాయవాదులు. న్యాయవాదులు కొంతకాలం కాంగ్రెసులో సభ్యులుగా ఉండి, తరువాత ఎన్నికల్లో ఓడిపోతే తిరిగి న్యాయవాదవృత్తిని — తరుచు మరింత ఎక్కువయిన సంపాదనావకాశాలతో — చేపట్టవచ్చు ! పైగా, కాంగ్రెసు సభ్యులు ఏదైనా న్యాయవాదికార్యాలయంలో వాటాపుచ్చుకొని శాసననిర్మాణంలో ఆసక్తులై

ఉన్నవారి పక్షనుండి విరాళాలు – రిటైనర్ ఫీజు రూపంలో పుచ్చుకొనడం శాసన విరుద్ధం కాదు. కాని ఇలాటి పనులే ఉద్యోగివర్గం వారు కాని, కార్య నిర్వాహక శాఖలోని వారు కాని చేస్తే – ప్రభుత్వం మండి పడుతుంది !

ఒకసారి ఒక అమెరికన్ బడిపిల్లాడు “ మాది న్యాయవాదుల ప్రభుత్వం మనుష్యులది కాదు” అని అన్నాడట ! అయితే ఇది కొంచెం, అతిశయోక్తి అనుకోండి. కాని, ఆర్థికవిధానం, అంతర్జాతీయ సహకారం లాటి ముఖ్య సమస్యలపై కాంగ్రెసు ఇచ్చే అభిప్రాయాలు తరుచు న్యాయవాదుల ఆలోచనా పద్ధతిలోనే ఉంటాయి. ఇంజనీర్లు, పుస్తక ప్రముఖులు, పత్రికా రచయితలు మొదలైన వారి మనోభావ లక్షణాలు ఏవీ అందులో ఉండవు.

దేశంలోని రెండు ప్రధాన రాజకీయ పక్షాలూ దేశాన్ని పాలించడానికి, అధికారంకోసం పెనుగులాడడానికి కాంగ్రెసూ, అధ్యక్షుడూ రెండు సాధనాలు. అధ్యక్షుడు ఒక్కడే కాబట్టి, తరుచు నిశ్చితంగా ఉండేది, తన మలి ఎన్నికతోగాని, చరిత్రలో తాను కోరుకొనే స్థానంతోకాని,సంబంధించి ఉండేవీ అయిన తనపార్టీ విధానానికే ప్రాతినిధ్యం వహిస్తాడు. కాని కాంగ్రెసులో ఉన్న అధ్యక్షుని పార్టీలో మాత్రం ఏదోవిధంగా అధ్యక్షుని విధానాలకు ప్రతికూలంగా ఉండేవారు కొందరు ఎప్పుడూ ఉంటారు. తమ పార్టీ అనుసరించే విధానానికి విరుద్ధంగా ఉండడానికి వీలున్న తమ స్థానికప్రయోజనాల మీద తమ మలి ఎన్నిక ఆధారపడి ఉంటుందని విశ్వసించే వ్యక్తులుకూడా చాలామంది పార్టీలో ఉంటారు. అందుచేత అధికారంలో ఉన్న పార్టీ కాంగ్రెసులో ప్రతి విషయంలోనూ చీలిపోతుంది; నిజానికి ప్రతిపక్షం కూడా అంతే !

కాంగ్రెసుకు రెండేళ్ళ కొకసారి మాత్రమే బాధ్యత ఉదయిస్తుంది. అప్పటికైనా ఆ బాధ్యత ఒకవిధంగా అనిశ్చితంగానే ఉంటుంది. కాంగ్రెసులోని వ్యక్తులు వోట్లువేసిన విధం వాళ్ళ స్వంత జిల్లాలలో ఎన్నికల ఫలితాలకు కారణం కావచ్చుగాని, దేశం ముత్తంమీద ఎన్నికల్లో దానికి చెప్పుకో దగ్గ ప్రభావం ఉండదు. ఈ విషయమే పార్టీలో క్రమశిక్షణ లోపించడానికి కారణం అవుతోంది. దీనికితోడు చాలామంది కాంగ్రెసుసభ్యులు వాళ్ళ నియోజక వర్గాల ప్రజల మనసు నొప్పించకుండా ఉంటే మలి ఎన్నికలలో ఉప్పుకుంటా

తామే గెలిచే 'క్షేమకర' మైన జిల్లాలనుండి ఎన్నికైనవారు. అలాటివాళ్ళు ఎన్నడూ తమ జిల్లా ప్రజలకు కష్టం కలిగించే పని ఏదీ చెయ్యడానికి యిష్ట పడరు. తమ పార్టీ ఎన్నికల్లో ఓడిపోతే తమ కమిటీ అధ్యక్ష పదవులు పోతా యనే భయం తప్ప – పార్టీతో వాళ్ళకిక ఏ అవసరమూ లేదు. అందుచేత ఎపుడూ మారని స్థానిక స్థితుల కారణంగానే తమ ప్రతినిధులను ఎన్నుకునే జిల్లాలలోను, రాష్ట్రాలలోను, ప్రజలయెడల కాంగ్రెసుకున్న బాధ్యత నామ మాత్రంగానే ఉంది. బాగా తీవ్రమైన పోటీఉన్నప్పుడు – అప్పుడైనా ఆ అభ్యర్థి చరిత్ర ప్రజల దృష్టిలో ముఖ్యమైన సమస్యలకు సంబంధించిన దైనపుడు – మాత్రమే ప్రజలు తమ నిశ్చయాన్ని ఉత్సాహంతో వ్యక్తం చేస్తారు. ఎన్నికల ఫలితాలు సందిగ్ధంగా ఉండేచోట – ఏ పార్టీతోటీ సంబం ధం లేకుండా స్వేచ్ఛగా వోట్లువేసే స్వతంత్రులైన ప్రజలు ఆ ఫలితాలను నిశ్చయిస్తారు. రాష్ట్రంలో ఒకేపార్టీ చాలా బలమయినదైతే, అపుడు స్వతం త్రులు ఇష్టమయితే ఆ పార్టీలో చేరి ఆ పార్టీ ప్రైమరీ సమావేశంలో ప్రముఖ మైన పాత్ర వహించవచ్చు.

కాని లొవెల్ మిల్లెట్ తన "Hand Book of Politics" అనే గ్రంథంలో చెప్పినట్లుగా తరుచు ఈ స్వతంత్రులు తమ వోట్లను చీల్చుకొని తమశక్తిని కోల్పోతారు. స్వతంత్రులు తరుచు ఔదార్యవాదులై (liberals) ఉంటారు. వీరుప్రైమరీలోని అభ్యర్థులలో అత్యుత్తమ వ్యక్తికి వోటు వేయ డం తమ విధి అని తెలిగ్గా నమ్ముతారు. ఒక్కొక్కప్పుడు ఎన్నికల్లో వీళ్ళు ఏపెద్దపార్టీ అభ్యర్థికిఓట్లువేసినా అతడుగెలిచిఉండేటన్నివోట్లు ఎదో ఒకచిన్న పార్టీయెడల తమ అనిష్టం తెలియపరుస్తూ 'ప్రొటెస్టు' వోట్లుగా వేసేస్తారు.

స్వతంత్రుల కున్న యీ అలవాటును రాజకీయనాయకులు కొందరు తమ ప్రయోజనానికి వినియోగించుకుంటారు. స్వతంత్రుల వోట్లు తమకు రావని భయపడే పార్టీవారు – గెలవనివాడినీ, 'మంచివాడికి' వోటు వేయా లనే మనస్తత్వం కలవారిని ఆకర్షించగలవాడినీ, ఒక స్వతంత్రుడిని చూసి, రహస్యంగా వానినికూడా తమపార్టీ అభ్యర్థికి తోడుగా బలపరుస్తారు. దీనితో స్వతంత్రుల వోట్లన్నీ అతనికి పడి – అవి ఎదుటిపార్టీకి పడే అవకా శం తప్పుతుంది తమ అభ్యర్థి గెలవడానికి అప్పుడు ఎక్కువ వీలు ఉంటుంది.

మిల్లెట్ చెప్పినట్లు – స్వతంత్రులు తమకున్న ప్రాబల్య తౌల్యాన్ని (Balance of Power) బలంగా ఉపయోగించు కొనడానికి ఒకటే పద్ధతి ఉన్నది. ప్రస్తుతం పదవిలో ఉన్న వ్యక్తిని – అతడు తిరిగి ఎన్నికలకు నిలబడుతున్నాడని భావించి – బలపరచాలో లేదో ముందే నిశ్చయించుకోవడం. అప్పుడు. అతన్ని బలపరచదలచుకుంటే అంతాకలసి బలపరచి అతని పదవి నిలబెడతారు. అతని ప్రతిష్ఠా, ప్రాపకమూ – దానితో పెరుగుతాయి.

అతనిని బలపరచ వద్దనుకుంటె – అతనికి పోటీ నిలబడిన వారిలో మంచి చెడ్డలతొ ప్రసక్తి లేకుండా, గెలిచే అవకాశాలు ఎక్కువగా ఉన్న వానిని బలపరచి గెలిపించాలి. అప్పుడు ఆ అభ్యర్థి ఎంత అవాంఛనీయుడైనా, అంతకుముందు పదవిలో ఉన్నవానిని ఓడించి పదవిలోకి వెళ్ళేటప్పుడు కాంగ్రెసులో అతనికి సీనియారిటీ ఉండక కొత్తవాడుగా ఉంటాడు కాబట్టి – అంత ఫరవా లేదు.

సర్వస్వాధికారయుత ప్రజానికానికీ, వారి శాసన నిర్మాణ ప్రతినిధులకూ మధ్య ఉన్న ఈ బాంధవ్యాలు ప్రమాదకరంగా పరిణమించే టంత బలహీనంగా ఉన్నట్టు కన్పిస్తాయి. కాని ప్రభుత్వం తన న్యాయమైన అధికారాలను పాలితుల అంగీకారం వల్లనే గ్రహిస్తుందని స్వాతంత్ర్య ప్రకటన పత్రంలో చెప్పబడిన ప్రాథమిక ప్రజాస్వామ్య సూత్రం ప్రకారమే ఈ పనులన్నీ జరుగుతున్నాయి. ఎప్పుడూ ఒకే పార్టీ గెలిచే రాష్ట్రాలలోనూ, నియోజకవర్గాల లోనూ, పాలితులు ఏ వివాదమూ లేకుండా వారు పార్టీకి పూర్తిగా తమ అంగీకార మిచ్చారు. వారి చిత్తం వచ్చినప్పుడు వారి ఆ నిర్నిబంధ అంగీకారాన్ని ఉపసంహరించుకొ వచ్చు. అంతేకాక, ఎన్నికల్లో వోట్లొసక మానిన వారే కాకుండా, వోట్లొని ఓడిపోయినవాడు కూడా గెలిచిన వారి పాలనకు లోబడడానికి అంగికరించా లనేది ప్రజాస్వామ్య ప్రభుత్వపు ప్రధాన లక్షణం. కాంగ్రెసు ఎన్నికలవిధానంలో ఏ లోపాలున్నా ఈ ఫలితంమాత్రం పూర్తిగా సాధించబడుతోంది. అధ్యక్షుని పదవీ పరిమితి అయిన తరువాత అతడు ప్రజాభిమానాన్ని పొంది మళ్ళా అతని పక్షమే అధ్యక్షస్థానాన్ని గెలుచుకుంటే – అతని విజయం ఆతని పార్టీ కాంగ్రెసు సభ్యులను సహాయకరంగా ఉంటుంది. తీవ్రంగా జరిగే కాంగ్రెస్ ఎన్నికల్లో మొగ్గు తరుచు అధ్యక్షస్థానాన్ని గెలుచుకున్న పార్టీవైపు ఉంటుంది. వన్నే 'అధ్యక్షుని తోకపట్టుకొని

ఒద్దుచేరడం' అంటారు. పార్టీ నాయకుని యెడల కాంగ్రెసు సభ్యులు, సెనేటర్ల భక్తివిశ్వాసాలు కలిగి ఉండేట్టు చేయడంలో ఈ 'తోక పట్టుకొని ఒద్దుచేరే' విధానం కొంత పనిచేస్తుంది. అతన్ని వీరు ఎక్కువగా నొప్పిస్తే—చివరకు తమకు బాధ కలుగవచ్చు. అధ్యక్షస్థానానికి ఎన్నికలులేకుండా ఉన్నప్పుడు జరిగే 'నడికాలపు ఎన్నికల్లో' అధికారంలో ఉన్నపార్టీ ఇంచు మించు ఎప్పుడూ ఓడిపోతూనే ఉండడం గమనార్హమైన విషయం.

కాంగ్రెసులో పార్టీనాయకుడు సామాన్యంగా అధ్యక్షుని బలపరచే వారిలో నుండే ఎంచుకో బడతాడు. కాని, తమ తమ రంగాల్లో విపరీతాధికారాలున్న కమిటీల అధ్యక్షులు మాత్రం ఒక్కొక్కప్పుడు అధ్యక్షునికి తీవ్ర ప్రతిక క్షులుకావచ్చు. ఉదాహరణకు 1953 లో ఐసెన్‌హోవర్ పరిపాలన ప్రారం భంలోనే, పన్నుల కోత జరగకముందు బడ్జెట్‌ను తుల్యం (Balance) చేసే విధానాన్ని ప్రతినిధుల సభలోని ధనం కేటాయించే సంఘపు అధ్య క్షుడు తీవ్రంగా వ్యతిరేకించాడు.

ఇటువంటి క్రమశిక్షణా రాహిత్యం వల్ల ఒక్కొక్కప్పుడు తరువాతి ఎన్ని కల్లో పార్టీలో చీలికలువచ్చే ప్రమాదం ఉన్నదని, పార్టీలో బలవత్తర నిర్మాణం కావాలనీ, ప్రతిపాదనలు చేయబడ్డాయి. రెండు సభలలోనూ జరిగే విధాన నిర్ణాయక సమావేశాలలో (కాకస్ సభలలో) ఆ యా పార్టీలు వారి సభ్యులు పార్టీ నిర్ణయాలకు బద్ధులై ఉండాలని ఆజ్ఞాపించ ప్రయత్నించాయి. కాని; కొన్ని ప్రతిజ్ఞలు చేయబట్టో, లేక ఇతర అడ్డంకుల వలననో, ఆ నియ మానికి కట్టుబడ వీలులేని వారి కోసం ఒక ప్రత్యేక సూత్రం వ్రాయవలసి వచ్చింది! క్రమశిక్షణ గట్టిగా అమలు జరుపడానికి మొదటి చిక్కు, తన్ని ష్టంగా ప్రవర్తించిన వారిమీద చర్య తీసుకొనడానికి పార్టీకి బలం లేక పోవడమే. పార్టీ అగ్రనాయకులు, ఒక సభ్యుని అతని రాష్ట్రంలోని పార్టీ శాఖనుండి తొలగించ లేకపోవడమే ప్రధానమైన అడ్డంకి. ఒకప్రక్క తాను డెమొక్రట్ నని చెప్పుకుంటూ రిపబ్లికనులకు వోటు వేస్తున్నా, అవ్యక్తిని ప్రజలు ఎన్నుకుంటున్నంత కాలమూ అతన్ని దేవుడు కూడా యేమి చేయ లేడు! పార్టీలు చేయగలిగిందల్లా అతనిని కమిటీలలో నుంచి పూర్తిగా తొల గించడమే. 1953 లో సెనేటర్‌మోర్స్ విషయంలో రిపబ్లికనులు ఇంతే చేశారు.

ఇంతనూ, పార్లమెంటుకున్న బాధ్యతలులేని కాంగ్రెసులో పని చేస్తున్న ద్విపక్ష విధానం వలని సహజ ఫలితమే — ఈ క్రమశిక్షణా రాహిత్యం అంతా.

అధ్యక్షుడికి ప్రతికూలంగా ఉన్న పక్షం — ఎల్లప్పుడూ కాకపోయినా తరుచు — కాంగ్రెసు రెండు సభల్లోనూ అల్పసంఖ్యాకంగానే ఉంటుంది- "అల్ప సంఖ్యాక పక్షపు విధి — ప్రతికూలంగా వ్యవహరించడమే" అన్న సూత్రం పాక్షిక సత్యం మాత్రమే. అయితే, అనుమానాస్పదమైన విషయాలు కూలంకషంగా చర్చించబడేట్టు, అనుమానాస్పదమైన పరిపాలనాపద్ధతులు సంపూర్ణంగా విచారించబడేట్లు, చూడడం మాత్రం నిశ్చయంగా ప్రతిపక్షపు బాధ్యత. కాని, అల్పసంఖ్యాకపక్షంలోని చీలికల ఫలితంగానూ, అధ్యక్షునికీ అధిక సంఖ్యాకపక్షానికి మధ్యఉన్న సంఘర్షణ ఫలితంగానూ, ప్రాతికూల్యం రకరకాలు అయింది. చాలా విషయాలపై తమపార్టీకే విరుద్ధంగా వోటువేసే సభ్యులుకొందఱు రెండుపార్టీలలోనూ కన్పిస్తారు. ఇకఅల్పసంఖ్యాకపక్షంలో పరమ భక్తి విశ్వాసాలుగల సభ్యులలో తరుచు "మనం అధ్యక్షుణ్ణి వ్యతిరే కిస్తామా? లేకపోతే అతని పార్టీని వ్యతిరేకిస్తామా?" అనే ఆలోచన వస్తుంది !

1933 నుండి 1952 వరకూ రిపబ్లికనుల సామాన్య విధానం అధ్య క్షుణ్ణి వ్యతిరేకించడం. కాంగ్రెసుతో అధ్యక్షుడికి పడకుండా ఉన్నరోజుల్లో, చాలామంది రిపబ్లికనులు అధ్యక్షుని పార్టీలోనే అతనికి వ్యతిరేకులుగా ఉండే దక్షిణాది డెమోక్రట్లతో సహకరించి పనిచేశారు. కాని ప్రజలకు కాం గ్రెసు లోని డెమోక్రటిక్ పార్టీతో కంటె అధ్యక్షునితోనే ఎక్కువ సాన్నిహిత్యం ఉన్నది. కాబట్టి చాలాకాలంవరకూ ఈ విధానం అనుసరించిన వాళ్ళుఎన్ని కల్లో విజయం లభించలేదు. కాని, పరిపాలనమీది విమర్శ ప్రజలలో వ్యాపిం చేసరికి ఈ విధానం చివరకు జయం పొందింది.

కాంగ్రెసులో ప్రతిపక్షం అధిక సంఖ్యాకంగా ఉంటె, మామూలుగా కాంగ్రెసుకూ, అధ్యక్షుడికీ ఉన్నవైరం విపరీత మవుతుంది. కాని దానికి కొన్ని అవధు లున్నాయి. ఎవరో కొందరు అతి తీవ్రవాదులైన సభ్యులు తప్ప, మిగిలినవారు అధ్యక్షునితో సమరాన్ని జాతిక్షేమానికి నష్టం కలిగించే స్థాయివరకూ సాగించాలని వాంఛించరు. ఇష్టం లేకపోతే, కాంగ్రెసు శాసన రీత్యా అధ్యక్షుడికి డబ్బు మంజూరుచేయ నిరాకరించ వచ్చు. సెనేటు అధ్యక్షుడి నియామకాలను ఆమోదించడం మాన వచ్చు. కాని కాంగ్రెసు

లోని విజ్ఞులైన సభ్యులెవరూ అట్టి తీవ్ర సాధనాలు ఉపయోగించడం రాజ నీతిజ్ఞతకు లక్షణంగా భావించరు. అందువల్ల ఈ సమరం ఉండ వీలయిన దానికంటే తక్కువ స్థాయిలోనే ఉంటుంది.

ఉదాహరణకు 80వ కాంగ్రెసు సమావేశంలో ట్రూమన్ మహాశయుడు-- రిపబ్లికన్ పక్షం తరఫున సెనేటర్ వాండెన్‌బర్గ్ విజ్ఞ నాయకత్వపు ధర్మమా అని – మార్షల్ పథకాన్ని ఆమోదింపచేశాడు. లాభం తక్కువ, నష్టం అపారం అయిన సమస్య విషయంలో పట్టు పట్టవద్దని వాండెన్‌బర్గ్ తన పార్టీ వారిని హెచ్చరించాడు. నిజానికి అప్పుడే ఆ ప్రణాళిక ఓడిపోయి, 1948 ఎన్నికల్లో ఇటలీ కమ్యూనిస్టుల వశం అయి ఉంటే మార్షల్ పథకాన్ని ఓడించడానికి బాధ్యులైన వారందరినీ ఇటలీలో జరిగిన మహోపద్రవానికి బాధ్యులుగా నిందించి ఉండేవారు. కాని, అంతరంగిక విషయాలలో మాత్రం 80–వ కాంగ్రెసు సభలో ప్రాబల్యం వహించిన రిపబ్లికనులూ, డెమొక్రటిక్ పక్షపు అధ్యక్షుడూ తీవ్రమైన ప్రచ్ఛన్న సమరంచేశారు. ఆ సమయంలో, ఏమాత్రం ప్రజాభిమానమున్న విషయాలైనా సరే – చివరకు డెమొక్రట్లే కాంగ్రెస్‌లో అధికులుగా ఉన్నా నెగ్గని వాటితో సహా అన్నిటినీ అధ్యక్షుడు ట్రూమన్ ప్రతిపాదించాడు. రిపబ్లికనులు డెమొక్రట్లనుండి తగినంత సహాయంకూడా పొందుతూ ఒక్కొక్క ప్రతిపాదననే ఓడిస్తూండగా– అధ్యక్షుడు ట్రూమన్ తన ఎన్నికల ప్రచారోద్యమానికి తయారుచేసుకొంటున్న నోటుపుస్తకంలో ఒక్కొక్క విషయమే వ్రాసుకున్నాడు! రిపబ్లికనులు తాత్కాలికంగా ట్రూమన్ విధానాన్ని అపగించుకో గలిగినా – అతని మీద ఏ నిందా మోపలేకపోయారు. ఈ విధంగా ప్రజాభిమానం చూరగొని చివరకు అతడే మళ్ళీ ఎన్నికల్లో గెలిచాడు.

కాని, 1932 లో అధ్యక్షుడు హూవర్ ప్రతిపక్షప్రాబల్యం గల కాంగ్రెసును ఎదుర్కొనవలసి వచ్చినపుడు—అతడు ఆర్థిక మాంద్యాన్ని అదుపులో పెట్టడానికి చేసిన ఆఖరి ప్రయత్నాల నన్నిటినీ వమ్ముచేసి, అతనిని ప్రజలలో నిందకు పాల్పడచేయడం డెమొక్రట్లకు సాధ్యమయింది. ఇలాటి పరిస్థితి చాల సార్లు సంభవించి చివరకు నడికాలపు ఎన్నికల్లో కాంగ్రెసుపై ఆధిపత్యాన్ని పోగొట్టుకున్న అధ్యక్షుని పక్షం తప్పకుండా రెండు సంవత్సరాల అనంతరం ఓటమి పొందుతుం దని నమ్మకం ఏర్పడింది.

రెండు పార్టీలకూ మధ్య నిత్యమూ ఉన్న వైరానికితోడు – అధ్యక్షునికీ, కాంగ్రెసుకూ మధ్య సంఘర్షణ కూడా ఉండడండో, ప్రభుత్వం అసలు ఏమన్నా పని చేయగలదా అని అనిపించవచ్చు. రాజ్యతంత్రంలోని ప్రాముఖ్యాన్ని వివరించడానికి ఈ సంఘర్షణల రూపాలన్నీ చిత్రించబడ్డాయి. కాని, సామరస్యానికీ, అంగీకారానికీ, ఆచరణకూ, అందరినీ ఆయత్తంచేయగల శక్తులు దేశంలో కొరవడలేదు. రెండు పక్షాలలోనూ మితవాదులూ, ఔదార్యవాదులూ చాలా మంది ఉన్నారు. ప్రతిపక్షం నుండి ఇంచుమించు ఎప్పుడూ అధ్యక్షునికి కొంత సహకారం లభిస్తుంది. ఇది అసంబద్ధంగా కనిపించవచ్చు. కాని, ప్రతిస్పర్థులైన వర్గాలమధ్య అటో ఇటో తేలపలసినంత తీవ్రమైనపోటీఉండకుండా ఇదికాపాడుతుంది. అన్నిటికన్నా మిన్నగా కాంగ్రెసు నాయకులైన వారిలో, సామరస్యం సాధించడంలోనినేర్పు వల్ల ప్రముఖులై పదవులు సంపాదించిన కార్యవాదులైన రాజకీయవేత్తలు అధికంగాఉన్నారు.



# కాంగ్రెసు సభ పనిచేసే విధానం

రెండేళ్ళ కొకసారి క్రొత్త కాంగ్రెసు సభకు ఎన్నికలు జరుగుతాయి ఉదాహరణకు 82 వ కాంగ్రెసు సభ 1950లో ఎన్నుకోబడితే, 83 వ. కాంగ్రెసు 1952 లో ఎన్నుకోబడింది. ఆ ఎన్నికలలో ప్రతినిధుల సభకు మొత్తం సభ్యులనూ, సెనేటు సభకు 3– వ వంతు సభ్యులనూ, ఎన్ను కుంటారు. కాంగ్రెసు కనీసం సంవత్సరాని కొకసారి సమావేశం కావాలి. ప్రతి సంవత్సరం జనవరి 3–వ తేదీని అది సమావేశం అవుతూంటుంది. మొదటి సమావేశంలో అధికసంఖ్యాక పక్షంనుంచి సభకు సంబంధించిన ఉద్యోగులను ఎన్నుకొని, కమిటీలకు అధ్యక్షులనూ, సభ్యులనూ ఏరుకొని, కాంగ్రెసు సభ 'ఒక దారిలో' పడుతుంది.

అమెరికా ఉపాధ్యక్షుడు సెనేటుకు అధ్యక్షుడుగా వ్యవహరిస్తాడు. వివా దంతెగని సందర్భంలో, తన యిష్టం వచ్చిన పక్షానికి వోటు వేసే అధికారం అతనికి ఉంటుంది. అతడు చేయవలసిన యితర విధులు నిశ్చితంగా చెప్పబడలేదు. సెనేటర్లతో తన సంబంధాలను సన్నిహిత పరచేందుకు అధ్య క్షుడు అతనిని వినియోగించుకోవచ్చు ; లేదా అతడు మంత్రివర్గ సమావేశా లలో పాల్గొని అధ్యక్షుడికి తరువాతి వాడుగా వ్యవహరించ వచ్చు. ఉపా ధ్యక్షుడు ఒకప్పుడు సెనేటరుగా పనిచేసిన వాడైతే తన పాత సహచరులపై మంచి ప్రాపకాన్ని కలిగి ఉండవచ్చు.

సెనేటు తాత్కాలిక సభాధ్యక్షుణ్ణి ఒకరిని ఎన్నుకుంటుంది. అతడు ఉపాధ్యక్షుడు లేని సమయంలో సభ కార్యాలు నిర్వహిస్తాడు. సెనేటు నిత్యవ్యవహారాలు చూచే కార్యదర్శి, సాయుధ సేనాధిపతి, చాప్లెన్, అధిక అల్ప సంఖ్యాక పక్షాలకు రెంటికీ కార్యదర్శులు -- వీరు కూడా ఎన్నుకొన బడవలసిన ఉద్యోగులే. సెనేటు సభలో చాలా పదవులు, కమిటీ అధ్యక్ష పదవులు సహితంగా, ఒక ఎన్నిక తరువాత మళ్ళా ఎన్నికలపరకూ - మధ్యలో రాజకీయ వైపరీత్యం ఏదైనా జరిగితే తప్ప – నిలచి ఉంటాయి.

అధిక సంఖ్యాకపక్ష సభ్యుల కాకస్ సమావేశంలో ఉద్యోగులనూ, కమిటీ అధ్యక్షులనూ, మెజారిటీ కమిటీ సభ్యులనూ నియమిస్తారు. సెనేటులో జరిగే మొదటి 'వోటింగ్' - ఈ సభ్యుల నందరినీ ఎన్నుకొనడమే. కమి టీలలో అల్పసంఖ్యాక పక్షానికి ప్రాతినిధ్యం వహించవలసిన వారిని ఆపక్షమే ఎంచుకుంటుంది. ఈ నియామకాలలో సెనేటుసభ్యుని అనుభవం

(సీనియారిటీ) ముఖ్యమైన అర్హతగా ఎంచబడుతుంది. ఏ కమిటీకైనా సామాన్యంగా ఆ కమిటీలో అత్యధిక కాలం పనిచేసిన అధిక సంఖ్యాక పక్ష సభ్యుడు అధ్యక్షు డవుతాడు. తనకు కావలసిన కమిటీ ఉద్యోగాన్ని కోరు కొనడానికి సీనియరు సభ్యునికి హక్కు కూడా ఉంది.

ప్రతినిధుల సభలో అధ్యక్షత వహించే వానిని స్పీకరు అంటారు. అతడు సభ్యులందరిచేత ఎన్నుకొనబడతాడు. అతడు ఎప్పుడూ అధిక సంఖ్యాక పక్షంవాడే అయి ఉంటాడు. అధ్యక్షుడూ ఉపాధ్యక్షుడు కూడా మరణిస్తే – అధ్యక్ష స్థానానికి వారసుల వరుసలో మొదటివాడు స్పీకరు. కాంగ్రెసులో ఇతని స్థానం కూడా చాల అధికార యుతమైనదే.

'స్పీకరు' అనే పేరు మాత్రం ఇంగ్లండు నుంచి తెచ్చుకొన్నదే అయినా, ఆ పదవి లక్షణాలు మాత్రం అవికావు. కామన్సు సభలో నిష్పక్షపాతియైన వాడినీ, సభా కార్యనిర్వహణ దక్షుడునీ, స్పీకరుగా ఎన్నుకుంటారు. కాని, అమెరికాలో కాంగ్రెసు స్పీకరు తన పార్టీని అదుపులో పెట్టేవారిలో ముఖ్యుడు. ఉదాహరణకు అతడే సమావేశాల కమిటీలకు (Confe-rence Committees) సభ్యులను నియమిస్తాడు.వీరు తమకుసంబంధించిన సెనేటు సభ్యులను కలుసుకొని – ఒకే విషయంపై తయారయి, ప్రతినిధుల సభలోనూ, సెనేటులోనూ చర్చించబడుతున్న రెండు చట్టాల విషయంలో తేడాలను సమసింప చేసేందుకు ప్రయత్నిస్తారు. వీరిద్దరూ తయారు చెసిన ఉమ్మడి చట్టం–సామాన్యంగా రెండు సభలూ ఆమోదిస్తాయి. అందుచేత కొన్ని అతి ముఖ్యసమస్యలపై నిర్ణయం – స్పీకరు ఆ సమావేశాల కమిటీలలో నియమించిన సభ్యులపై ఆధారపడి ఉంటుంది. సభావేదికనుండి ఎవరు మాట్లాడాలో అక్కడి కక్కడ నిశ్చయించ గల వాడు స్పీకరు. ఏవో రెండు కమిటీలలో ఏ కమిటీ చట్టాన్ని పరిశీలించడం ఉచితం – అని సందేహం వచ్చినపుడు ఆ విషయాన్ని నిశ్చయించవల సినవాడు స్పీకరు. అంటే ఆ కమిటీలలో ఒకటి చట్టానికి అనుకూలంగా ఉన్నదీ, రెండవది దానికి ప్రతికూలంగా ఉన్నదీ అయినప్పుడు ఎవరికి అప్పగించాలి అన్నది స్పీకరు ఇష్టప్రకారం జరుగుతుంది కాబట్టి స్పీకరే ఇంచు మించు ఆ చట్టం భవిష్యత్తును నిశ్చయిస్తా డన్న మాట!

1910 కి ముందు మెయినీకు చెందిన థామస్ బి. రీడ్ హయాంలోనూ, ఇల్లినోయిస్‌కు చెందిన "అంకుల్ జో" కానన్ హయాములోనూ స్పీకరుకు నిరంకుశాధికారాలు వచ్చాయి. అన్ని స్థాయీ సంఘాలకు (Standing Committees) సభ్యులను స్పీకర్ కానన్ తానే నియమించాడు. అతడే రూల్స్ కమిటీకి అధ్యక్షుడుగా పనిచేశాడు. ఏ చట్టంపై చర్చనన్నా ఆపు చేయగల అధికారం ఆ కమిటీకి ఉండేది. 1910 లో డెమోక్రట్లూ, పశ్చిమ ప్రాంతపు రిపబ్లికనులూ ఏకమై అతన్ని ఆ కమిటీ అధ్యక్ష పదవి నుండి తొలగించారు. తరువాత కమిటీలకు సభ్యులను నియమించే అధికారం కూడా లాక్కున్నారు. సెనేటులో వలె ప్రతినిధుల సభలో కూడా ముఖ్య పదవుల నియామకానికీ, అందులోనూ కమిటీ అధ్యక్షస్థానాలకూ, పెద్ద అధికారాలు గల కమిటీల సభ్యత్వానికీ, సీనియారిటీ ప్రధానమైన అర్హత. తత్ఫలితంగా కాంగ్రెసులో చాలా కీలక స్థానాలను సాధారణంగా జీవితకాలమంతా ఒకరినే ఎన్నుకుంటూండే క్షేమకరమైన నియోజకవర్గాల నుండి వచ్చిన వృద్ధ రాజకీయవేత్తలు ఆక్రమిస్తారు.

ఈ ఉద్యోగులకూ, కమిటీలకూ తోడు శాసన నిర్మాణంపై ఆధిపత్యం వహించేందుకు సెనేటులోనూ, ప్రతినిధుల సభలోనూ కూడా పార్టీ కూటమి (Party Organisation) ఉంటుంది.

రెండు సభలలోనూ రెండు పార్టీలకూ ఇటువంటి కూటము లున్నాయి. ఆ కూటమినే రిపబ్లికనులు "మహా సభ" (Conference) అంటారు. డెమోక్రట్లు 'కాకస్' అంటారు. పార్టీ ఉద్యోగస్థానాలకు తగు అభ్యర్థులను నియమించడమే కాకుండా శాసనసభాపక్ష నాయకుణ్ణీ (Floor leader) ఉపనాయకుణ్ణీ (Asst. Floor leader) లేక పార్టీ 'విప్' నీ ఎన్నుకొంటుంది. సభాపక్షనాయకుడు శాసనసభలో పార్టీ అనుసరించ వలసిన విధానాన్ని, ఎవరెవరు ఎప్పుడు మాటాడాలో, నిర్ణయం జరగడాన్ని తొందర పెట్టాలో, ఆలస్యం చెయ్యాలో మొదలైన విషయాలనూ చూచుకుంటాడు. 'విప్' సభ్యుల సందరినీ కనిపెట్టుతూ వోట్లు లెక్కపెట్టే సమయానికి వారి సందరినీ పోగు చేస్తాడు. ప్రతినిధుల సభలో అధిక సంఖ్యాక పక్షం వారికి సభాపక్ష నాయకుని ఆధిపత్యాన సారథ్య సంఘం ఒకటి ఉంటుంది. పార్టీ సమావేశం కాని, 'కాకస్' కాని బలపరచా లని నిశ్చయించిన చట్టాలను ఆమోదింప చేయడానికి ఈ సంఘం రూల్సు కమిటీతో సహకరించి పని

చేస్తూంటుంది. సెనేటులో మాత్రం రెండుపార్టీలకూ, సారథ్య సంఘా లుం టాయి. కాని సెనేటర్లను అదుపులో ఉంచడం తేలిక కాదు కాబట్టి, యీ సంఘాలు అంత శక్తి వంత మైనవిగా ఉండవు.

ఈ సంఘాలకు శాసన నిర్మాణ విషయంలో పలుకుబడి ఎక్కువగానే ఉన్నా, పూర్తిగా శాసన నిర్మాణాన్ని అదుపులో పెట్టుకోగల సామర్థ్యంలేదు. ముఖ్యంగా ఉభయపక్షాలకూ నిశ్చితమైన భిన్నవిధానాలు ఏర్పడ్డప్పుడు వచ్చే ప్రధాన సమస్యల విషయంలో ఈ 'నిగ్రహ సామర్థ్యం' మరీతక్కువ. అటువంటి సందర్భాలలో చర్చను నిర్వహించడం, తమ సభ్యు లందరినీ హాజరు పరచడం వంటి పనులు మాత్రం ఈ పార్టీ సంఘాలుచేస్తాయి. తరుచుగా, చర్చించబడే సమస్య విషయమై ఉభయ పక్షాలలోనూ చీలికలు వస్తాయి. అపుడు బలవంతులైన పెద్ద నాయకుల అభిప్రాయాలు నెగ్గేటట్టు చేయడానికి యీ సంఘాలు ప్రయత్నిస్తాయి. తమపార్టీలలోని యువ సభ్యులకు వ్యతిరేకంగా—రెండుపక్షాలలోని పెద్దలూ చేతులు కలిపి పనిచేయడం కూడా కద్దు. ఈ విధంగా ట్రూమన్ హయాంలో అధ్యక్షునికి వ్యతిరేకంగా రెండు పక్షాలలోని మితవాదులూ సహకరించిన సూచన లున్నాయి.

వాషింగ్టన్ నగరాన్ని సందర్శించడానికి వచ్చిన విదేశ ప్రయాణీకులు — సెనేటును కాని, ప్రతినిధుల సభను కాని ప్రేక్షకస్థానాలలో కూచొని చూస్తే — నిర్విణ్ణు లవుతారు. ఒక సభ్యుడు ఉపన్యాసం ఇస్తూన్నప్పుడు సామాన్యంగా మిగతా స్థానాలన్నీ ఖాళీగా ఉంటాయి. సభలో ఉన్న వాళ్లైనా ఏదో చదువు కుంటూనో కబుర్లు చెప్పుకుంటూతిరుగుతూనో ఉం టారు. కొద్దిమంది మాత్రం స్పీకరుమాటలు శ్రద్ధగా వింటూ — అప్పుడప్పుడు అతని పక్షం వహించడానికీ, తరుచు అతని వాదన ఖండించ డానికి — లేచి అతని మాటలకు అడ్డు తగులుతుంటారు. అలాంటప్పుడు ఆవశ్యక సంఖ్య (కోరం) కోసమో, వోట్ల లెక్కింపు కోసమో హాజరుపట్టి పిలుస్తారు. కాపిటాల్ భవనంలోనూ, కార్యాలయ మంతటనూ గంటలు గణగణ మ్రోగుతాయి. సభ్యులు గబగబ పరుగెత్తుకువస్తారు. మళ్ళా వెంటనే వాళ్ళు బయటికి జారిపోతారు. తిరిగి మామూలు ఔదాసీన్యం ప్రత్యక్ష మవుతుంది.

కాని, చాలామంది కాంగ్రెసుసభ్యులూ, సెనేటర్లూ, మామూలుగా ప్రశాంతంగా బతికే వ్యక్తి ఆరోగ్యం నాశనమై పోయేటంత తొందరలో, తీవ్రతతో,

రోజుకు చాలాగంటలు పనిచేస్తూంటారు. సభారంగం మీది దృశ్యంచూస్తే కాంగ్రెసు పనిచేసే విధంలో సత్యం బోధపడదు. దేశప్రజల నందరినీ ఆక ర్షించే చర్యకాని, చివరకు కొద్దిమంది కాంగ్రెసునభ్యులను ఆసక్తులనుచేసే చర్యకాని ఏదీ లేకుండానే కాంగ్రెసులో చాలాకాలం గడిచిపోతుంది. సభ్యులు హాజరు పలకడానికి వెళ్ళడమో, ప్రభుత్వపు కాగితాలలో ఎక్క డానికి ఉపన్యాసం యివ్వడమో, యింకొక సభ్యుని ఉపన్యాసంలో కల్పిం చుకోవడమో, లేకపోతె రాబోయే చట్టం విషయంలో తమకుఅవసరమయిన సహాయం చేయగల సభ్యునితో కబుర్లు చెప్పడమో చేస్తూ చాలసేపు గడి పేస్తారు. సభా రంగం వట్టి బజారు లాంటిది. కాని ఆ బజారులో అమ్మే సరుకుమాత్రం ఇతర ప్రదేశాల్లో, ముఖ్యంగా లాబీలలోనూ, కమిటీలలోనూ తయారయింది.

శాసన నిర్మాణంలో ముఖ్య విషయా లన్నింటికీ — సెనేట్‌లోనూ, ప్రతి నిధుల సభలోనూ స్థాయీసంఘాలు ఉంటాయి. 1946 లో కాంగ్రెసు పునర్వ్యవస్థీకరించబడ్డప్పుడు — సెనేటులోని స్థాయీసంఘాలను 33నుండి 15కు, ప్రతినిధుల సభలోని స్థాయీసంఘాలను 48 నుండి 19 కి తగ్గిం చారు. పనులు చర్వితచర్వణం కాకుండా చేయడమూ, ప్రతి సభ్యునికి వీలయినన్ని తక్కువ సంఘాలలో సభ్యత్వం యిచ్చి పని ఎక్కువ శ్రద్ధగా చేయడానికి వీలు యివ్వడమూ — ఈ మార్పులలోని ఉద్దేశ్యం. కాని ఈ సంఘాలు తక్షణం ఉపసంఘాలను సృష్టించుకున్నాయి కాబట్టి—ఈ సంస్క రణ పైకి కనబడినంత తీవ్రమయినది కాలేదు.

ఈ సంఘాలు కాక, ఉభయ సభల సభ్యులతోనూ కూడిన సంయుక్త సంఘాలు కూడా అనేకం ఉన్నాయి. ఆశగల రాజకీయవేత్తలకు పన్నులు, సైన్యాలు మొదలైన విషయాలవలె అట్టే ఆసక్తికరంగా ఉండని అచ్చుపనులు, ఆర్థికనివేదిక లాంటి అనుత్సాహకర విషయాలను యీ సంఘాలు చర్చిస్తాయి. సంయుక్త సంఘా లుండడంవల్ల కార్యక్రమ పునరా వృత్తి తప్పుతుంది. కాని, రాజకీయంగా వివాదాస్పదమైన విషయాలను రెండు సభలూ చర్చించవలసిన అవసరాన్ని బలపరుస్తూ చెప్పబడే యుక్తులే ఒకే విషయాన్ని రెండుసార్లు పరిశీలించవలసిన అవసరాన్ని కూడా బలపరు స్తాయి గదా !

1946 లో జరిగిన పునర్వ్యవస్థీకరణలో – "ప్రత్యేకసంఘాలు నిర్మించడంలో ఆసక్తి చూపము" అని కాంగ్రెసు సభవారు వాగ్దానం చేశారు. ఒక విషయాన్ని గురించి విచారణ జరిపించ వలసిందిగా పట్టు బట్టిన సభ్యుడు తరుచు ఇలాటి సంఘాలకు అధ్యక్షుడై, తరువాత అతడు పై పదవులకు అర్హుల జాబితాలో చేర్చబడేందుకు ఈ సంఘాలు గతంలో బాగా ఉపయోగించాయి.

ఉదాహరణకు సెనేటర్ ట్రూమన్ రెండవ ప్రపంచయుద్ధ నిర్వాహణ కార్య విచారణ సంఘాధ్యక్షుడుగా పనిచేసి అసమర్థంగా, అవకతవకగా జరుగుతున్న అనేక పనులను ఆపుచేయ గలిగాడు. ఆ సేవ వలననే అతడు అమెరికా ఉపాధ్యక్ష పదవి పొందగలిగాడు. 1946 నుండి ప్రత్యేకసంఘాల నియామకం లేకపోయినా, యిలాంటి పనులకే అప్పుడప్పుడు ప్రత్యేక ఉప సంఘాలో, లేక శాశ్వతఉపసంఘాలో నియమించ బడుతున్నాయి.

చట్టాలు తయారు చేయుడంలోని పని అంతా వివిధసంఘాలు శ్రమపడి శ్రద్ధతో చేయవలసి ఉంటుంది. చాలా ముఖ్యమయిన చట్టాలను అధ్యక్షుడు సూచిస్తాడు. అపుడు దానికి సంబంధించిన శాఖ చట్టపు ముసాయిదాను తయారుచేసి పంపుతుంది. కాని, ఆ ముసాయిదా శాసన నిర్మాణంలో ఆరంభంమాత్రమే ఈ చట్టాన్ని పరిశీలించే కమిటీ దానిని ఆమూలాగ్రం చూచి, సవరించి, అందులో ప్రతి అక్షరానికీ తాను బాధ్యత వహించగల నని నమ్మకం కలిగిన తరువాతనే ఆ సవరించబడిన ముసాయిదాను కాంగ్రెసుకు సమర్పిస్తుంది.

ఈ కమిటీలు తరుచు ఆయా విషయాలను బట్టి రహస్యంగానో, బహిరంగంగానో, విచారణలు జరుపుతాయి. ఈ విచారణలో కార్యనిర్వాహక శాఖాధిపతులనూ, నిపుణులనూ విచారించి సమాచారం సేకరిస్తాయి. కాంగ్రెసు సభ్యులకు నిపుణుల కున్నంత అనుభవం ఉండదు. కాబట్టి – వారి వద్దనుండి విషయాన్నంతటినీ రాబట్టలేరు. తయారవుతున్న చట్టంలో అనక్తులైనవారి భృత్యులైన న్యాయవాదులగు లాబీవర్గాల వారిని విచారించినప్పుడు కూడా ఇదే ఫలితం వస్తుంది. లాబీవర్గపు వ్యక్తులు చేసే బహిరంగ వ్యవహారంలో చాలభాగం ఈ సంఘాల ఎదుట వాదించడమే. కాని కాంగ్రెసుసభ్యులందరినీ పరిచయం చేసుకొనే అవకాశం ఉన్న సామాజిక కార్యక్రమాల్లో కూడా వారు తరుచు పాల్గొంటూంటారు.

ఈ ఉద్యోగివర్గాలవారిని, లాబీవర్గాలనూ కూడా చాలా అనుమానంతో చూస్తారు కాని – నిజానికి సాక్ష్యాలలో ఎక్కువ భాగం వారు సాక్ష్యం చెప్పే పక్షంవారి లాభంకోసం ఏర్చి కూర్చబడినవైనా, ఉపయోగకరమైనదీ నమ్మకమైనదీ అయిన భోగట్టా అందులో తప్పకుండా దొరుకుతుంది. ఈ కమిటీలు సేకరించే అత్యంత ఉపయోగకరమైన భోగట్టా చాలాభాగం రాజకీయమైనది. చట్టం ఏ వర్గంవారు ఆమోదించ బడాలని కోరుతున్నారు? ఎవరు రాకూడదని కోరుతున్నారు? ఎవరికి అధిక రాజకీయ ప్రాబల్యం ఉంది – ఇలాటి విషయాలు.

ప్రభుత్వపు బాధ్యతలు పెరుగుతూండడంతో, రాజకీయాలలో తప్ప మరే విషయంలోనూ నైపుణ్యం సాధించడానికి తీరికలేని సభ్యులు తమకు నిపుణుల మార్గదర్శకత్వం అవసరమని అంగీకరించారు. ఇప్పుడు చాలా కమిటీలలో ఒకరో, కొందరో నిపుణులు ఉన్నారు. రెండు సభలకూ – శాసన నిర్మాణంలో సలహా యిచ్చే కార్యాలయం ఉన్నది. ఈ కార్యాలయం వారు వివిధ సంఘాలకూ, సభ్యులకూ అప్పటికి ఉన్న శాసన సముదాయానుగుణ్యంగా చట్టాలు తయారుచేసి పెడుతూంటారు. కాంగ్రెసు సభ ఇటీవలి కాలంలో కాంగ్రెసు గ్రంథాలయంలో శాసన నిర్మాణంపై సమాచారాన్నిచ్చే విభాగాన్ని(Legislature Reference Service) బాగా అభివృద్ధి పరచింది. ఈ విభాగంలో ఏ రాజకీయమైమనస్యమూ లేకుండా వివిధ విషయాలకు సంబంధించిన వివరాలను తెలియపరచే నిపుణులు అనేకులున్నారు. కాంగ్రెసుసభ్యులు వారిఉపన్యాసాలకోసమో, సంఘవ్యవహారాల కోసమో నిత్యమూ ఈ నిపుణుల సహకారంతో అనేక విషయాలు తెలుసుకుంటారు.

కాంగ్రెసు పనిచేసే విధానం వివరిస్తే – అది ఏ మంచి ఫలితాన్నీ సాధించలేదనే భావం చదువరులకు కలిగి తీరుతుంది. కాని ప్రజలకు కావలసినవీ, ఆసమయానికి అవసరమైనవీ, అయినపనులన్నీ కాంగ్రెసు ఎన్నోసార్లు చేసింది!1933 నాటినుండి ప్రతి సమావేశంలోనూ-కాంగ్రెసు చేయవలసిన ప్రపంచప్రాముఖ్యంగల నిర్ణయాలు క్రమంగా ఎక్కువవుతున్నాయి. మేధావులూ,దేశభక్తులూఅయిన కాంగ్రెసుసభ్యులుఒకవంక నిర్విరామకార్యాలలో సతమతమవుతూండగా,యీమహాసమస్యలలో సంపూర్ణపాండిత్యంపొందడం అసాధ్యంఅనిపిస్తుంది. అయినా న్యూడీల్ నుండి'మార్షల్‌పథకం', 'నూతన

రక్షణ విధానం' పర్యంతం — అన్నిశాసనాలలోనూ కాంగ్రెసు అత్యున్నత శ్రేణిలో గణింపదగ్గ విజయాన్ని, ఇరుపక్షాల సామరస్యాన్ని సాధించింది. ఏదో అగోచరమైన శక్తి కాంగ్రెసును నడిపిస్తున్నది. అమెరికన్ ప్రజలు తమ వాంఛలను, అవశ్యకతలను, నిశ్చయాలను ప్రకటించేందుకు సాధనంగా చేసుకొన్న రాజకీయ వ్యవస్థయే ప్రధానమైన మార్గదర్శక శక్తి అని చెప్పడం ధర్మం అనిపిస్తుంది. కాంగ్రెస్ కార్య విధానాలలో పైకి కన్పించే గందరగోళం ఎంత ఉన్నా, అది ప్రజాభిప్రాయాన్ని ప్రభుత్వ చర్యల రూపంలోకి పరివర్తింప చేయడానికి చక్కని సాధనంగా పనిచేస్తూంది.

కాని కాంగ్రెసు అసమర్థత మాత్రం ఎల్లప్పుడూ విమర్శలకు పాలయింది. చాలా కాలానికి ఒకసారి కాంగ్రెసు స్వయంగా తీవ్ర సంస్కరణలు చేసుకుంటుంది. 1946 లో సెనేటర్ లా పొలెట్, కాంగ్రెసు సభ్యుడు మనోనీల ఆధిపత్యాన ఒక ప్రత్యేక ఉభయసభా సంఘం వారు అమెరికన్ రాజనీతిశాస్త్ర సంఘం తరఫున సమగ్ర పరిశీలన జరిపిన తరవాత — అటువంటి తీవ్ర సంస్కరణ ఒకసారి జరిగింది. మళ్ళా ఇప్పటివరకూ అట్టి సంస్కరణ జరుగలేదు.

1946లో జరిగిన పునర్వ్యవస్థీకరణ — కమిటీల సంఖ్య తగ్గించడమే కాకుండా, ఉద్యోగుల సంఖ్య పెంచి, సభ్యుల జీతాలు ఎక్కువచేసి, ప్రభుత్వం తీర్చవలసిన బాకీలకు ప్రతిదానికీ ఒక చట్టం తయారు చేయవలసిన బాధాకారమైన పనిని కాంగ్రెసుకు లేకుండా చేసింది. చేయవలసిన సంస్కరణ లన్నీ చేయకపోవడంవల్ల యీ అవకాశం దుర్వినియోగం అయిందనీ, మళ్ళా చాలా కాలానికి గాని పునర్వ్యవస్థీకరణకు అడను రాదనీ — ఈమార్పులను తీవ్రంగా విమర్శించారు.

తీవ్ర విమర్శకు గురియైన పద్ధతుల్లో సీనియారిటీ పద్ధతి ఒకటి. ఈవిధానంవల్ల వృద్ధులకే ఎప్పుడూ అధికార స్థానాలువస్తాయి. ఈపద్ధతి ముఖ్యంగా ఔదార్యవాదులకు ఇష్టంలేదు.

ఈ సీనియారిటీపద్ధతిని అట్టేపెట్టడానికి ఒక్కటే కారణంఉంది. క్రొత్తగా కాంగ్రెసు సమావేశం అయి, సంఘాలు ఉపసంఘాలు మొదలైనవి ఏర్పడుతున్నప్పుడు సీనియారిటీ పద్ధతివల్ల వివిధస్థానాలకు నియామకాలు చేయడం తేలిక అవుతుంది. ఉదాహరణకు ధనం కేటాయింపు సంఘం వంటి కీలక సంఘపు అధ్యక్షపదవి ఎన్నిక విషయంలో అధిక సంఖ్యాక పక్షంలో

చీలికలు వస్తాయనుకోండి. అపుడు చివరకు సభ్యుల నందరినీ అల్పసంఖ్యాక వర్గంవారు ఎన్నుకొన్నట్టవుతుంది! అందుచేత సెనేటులోనూ, ప్రతినిధుల సభలలోనూ పెద్దరికంచేసే రాజకీయవేత్తలు ఎప్పటికైనా సీనియారిటీ పద్ధతిని మార్చే అవకాశాలు మృగ్యం.

చాలాకాలంనుండీ విమర్శలకు గురి అవుతున్న మరొకపద్ధతి–సెనేటులో 'కాలహరణ' చేసే ఆచారం. (Filibuster) కొద్దిమంది పట్టుదలగల వాళ్ళకి ఒక చట్టం ఆమోదించబడడం యిష్టం లేకపోతే – అనంతంగా ఉపన్యాసాలిస్తూ ఆ చట్టం చేయవలసిన అదను దాటిపోయేదాకా కాలం గడిపివేయవచ్చు! వాళ్ళు ఉపన్యాసాల్లో సరిగ్గా చట్టానికి సంబంధించిన విషయాన్ని గురించే మాట్లాడనక్కరలేదు; షేక్స్పియరు నాటకాలూ, పాకశాస్త్ర పుస్తకాలూ, వరసగా చదివేసినా సరే, సెనేట్‌నియమాలు ఆ'ఉపన్యాసాన్ని' అడ్డుపెట్టవు! మూడింట రెండు వంతుల ఓట్లతో ఏ చర్చనైనా ఆపుచేయవచ్చుననే 'సమాప్తి' నియమం ఒకటి సెనేట్‌లో ఉన్నది. కాని, ఏ పక్షానికీ 'కాల హరణం' చేసే హక్కు పోగొట్టుకునే వాంఛ లేదు. కాబట్టి – ఈనియమాన్ని ఇంచుమించు అనాచరణ యోగ్యంగా ఉండేట్టు జాగ్రత్తగా తయారు చేశారు!

ఈ కాల హరణ విధానం అధిక సంఖ్యాక వర్గ పాలన సూత్రానికి విరుద్ధంగా పనిచేస్తుందని కొందరు తీవ్రంగా విమర్శించారు. అధిక సంఖ్యాకులు ఆమోదించడానికి సిద్ధంగా ఉంటే తప్ప ఎవరూ 'కాల హరణ' చేసి చట్టాన్ని నాశనం చేయరుకదా! కాని కొన్ని రాష్ట్రాలు ఎంత మాత్రమూ సహించలేని నిశ్చయాలలో కేవలం సంఖ్యాధికుల మాటే చెల్లాలనడం ఫెడరల్ రాజ్య సూత్రం కాదనే గాఢమైన భావం ఒకటి ఉన్నది. అధిక సంఖ్యాక పాలనకు కూడా పరిమితు లున్నా యనీ, ఏ అధిక సంఖ్యాక వర్గానికైనా అది అధిక సంఖ్యాకంగా ఉండేచోట తప్ప మిగతా చోట్ల అధికారం చలాయించే హక్కులేదనీ అమెరికన్‌ల అభిప్రాయం. అసలు సెనేటు సభయే – ప్రతినిధుల సభలో ఉన్న అధిక సంఖ్యాకులే దేశాన్ని పాలించడమనే సూత్రానికి విరుద్ధంగా ఉండేందుకు రూపొందించ బడిందని గమనించవలసి ఉంది. సెనేటులో ప్రతిరాష్ట్రానికీ దాని జనాభాతో నిమిత్తం లేకుండా – రెండు వోట్లు ఉంటాయి. పెద్దరాష్ట్రాలు చిన్న రాష్ట్రాలను తమ సంఖ్యాబలంతో అణచి వేయకుండా చేయడానికే యీ సూత్రం ఏర్పాట

యింది. అందుచేత తనకు తీవ్రనష్టాన్ని కలిగించే చట్టం ఆమోదించబడ కుండా చేసేందుకు ఎంత శ్రమనైనా పడే అల్పసంఖ్యాక పక్షానికి, కేవలం సంఖ్యవల్ల దానికి వచ్చే గౌరవం కన్న ఎక్కువ గౌరవం ఇవ్వడమనే సంప్రదాయం సెనేటులో ఉండడం ఆశ్చర్యకరం కాదు. అందుచేతనే ప్రతినిధుల సభలోవలె చర్చను పరిమితం చేయడానికి తేలికైన నియమాలు సెనేటుకు కూడా అంగీకారమయ్యే అవకాశం చాలా తక్కువ.

కార్య నిర్వహణలో సామాన్య ప్రమాణాల దృష్ట్యా చాలా తక్కువగా ఉన్న ఉభయ సభల కార్యాచరణశక్తి అభివృద్ధి చెయడానికి చాలా సంస్కరణలు సూచించబడ్డాయి. ఇప్పుడు కొన్ని రాష్ట్ర శాసన సభలలో ఉన్న విధంగా విద్యుచ్ఛక్తితో పనిచేసే వోటింగ్ బోర్డులు రెండు సభలలోనూ ఏర్పాటుచేయాలని ఒక సూచన. హాజరు పట్టీ పిలుస్తూ కూచుంటే చాలా కాలం వృథా అయిపోతుంది. ప్రతినిధుల సభలో ఇది మరీ ఎక్కువ. పైగా సభలలో సభ్యులు ఇతర సభ్యులతో మాట్లాడుకోడానికి ఈ కాలం ఉపయోగించరు. విద్యుచ్ఛక్తి ఉపయోగించే పద్ధతిలో అందరు సభ్యులు ఒక్కసారే వోటుచేస్తే ఒక బోర్డుమీద వోట్లసంఖ్య తక్షణం కనపడుతుంది. ఆ అంకెలు రికార్డులో కూడా ఉంటాయి.

కొలంబియా జిల్లాకు స్వపరిపాలన ఇవ్వబడాలని మరొక సూచన. ప్రస్తుతం కాంగ్రెసు సభ ఆ జిల్లాకు బోర్డ్ ఆఫ్ ఎల్డర్ మన్‌గా, కౌంటీ ప్రభుత్వంగా, రాష్ట్రశాసన సభగా, చివరకు ఫెడరల్ శాసనసభగా – అన్నిపనులూ చేస్తోంది. వాషింగ్టన్ వారు మాత్రం, జిల్లా బయట నివాసం ఏర్పరచుకొని అక్కడ వోటుచేస్తే తప్ప – వారికి వోట్లుండవు.

సెనేటులోనూ ప్రతినిధుల సభలోనూ జిల్లా సంఘాలున్నాయి. కాంగ్రెసు ఆ జిల్లాలో స్థానిక పన్నుల చట్టాలు తయారుచేస్తుంది. ఫలానా వీధి విశాలం చెయ్యాలా అక్కర లేదా ? మంగలిషాపులు ఎలా తనిఖీ చెయ్యాలి ? అన్న విషయాలు కూడా నిశ్చయిస్తుంది. ఐక్యరాజ్యసమితితోను ఉత్తర అట్లాంటిక్ రక్షణ సంస్థతోనూ అమెరికా ఎంతవరకు సహకరించాలనే లాటి మహాత్తర విషయాలను నిర్ణయించ వలసిన శాసనసభ – ఇలాటి అల్పవిషయాలను నిర్ణయించడం దాని అంతస్తుకు తగ్గదని కాదనిపిస్తుంది.

**1878** లో కొలంబియా జిల్లాలో స్థానిక స్వపరిపాలన రద్దుచేయడంలో ఉద్దేశ్యం– ఆ పరిపాలనను సంస్కరించడమే. ఆ నాటి నగర పరిపాలనలో అవినీతి – ప్రస్తుతం ఏ నగరాలలోనూ లేనంత విపరీతస్థితికి పెరిగింది. ప్రస్తుత నవీన పద్ధతులలో నగరాలను సమ్యకంగాను, సమర్థంగాను, నగర ప్రభుత్వాలే నడిపించగలవు కాబట్టి ఇలాటి అల్ప వ్యవహారం కాంగ్రెసుసభ చేయనక్కరలేదని కొందరంటారు.

కాంగ్రెసుకు వివిధ నియోజకవర్గాలనుండి వచ్చిపడే ప్రేక్షకుల ప్రవాహమే అక్కడ జరుగుతుండే పని కుంటుపడడానికి సభ్యుల దృష్టి విక్షిప్తం కావడానికి ప్రధానకారణం. రాజధానీ సందర్శనమంటే అమెరికనులకు చాలా ప్రీతి. తమ నియోజక వర్గపు ప్రతినిధులు తమకు శాసనసభ భోజనశాలలో భోజనం పెట్టించాలనీ, సినిమాకు తీసుకు వెళ్ళాలనీ, హొటలులో గది ఏర్పాటుచేయాలనీ, ఇలావచ్చే ప్రేక్షలు కోరుతుంటారు. అమెరికా అధ్యక్షుడితో వైట్‌హౌస్ మెట్లమీద నిలబడి తాము ఫొటో తీయించుకునేందుకు తమ నియోజకవర్గపు ప్రతినిధి ఏర్పాటు చేయాలని హైస్కూలు బాస్కెట్‌బాల్ ఆటగాండ్ర జట్టువాళ్ళు కోరతారు. అతడు విధిగా ఆ ఏర్పాటు చేయవలసిందే. ఇది ఒకసారి నిజంగా జరిగిన సంఘటనే. ఒక సెనేటు సభ్యుడు ఆ జట్టువారితో అధ్యక్షుడు ఆసమయంలో యుద్ధకార్యనిమగ్నుడై ఉన్నాడని నిష్కర్షగా చెప్పే సరికి, అతనితోటి సెనేటరు ఆ అవకాశాన్ని వినియోగించుకొని ఆ జట్టువారి వాంఛ సఫలం చేశాడు !

నియోజక వర్గాల ప్రజలకు–తమ ప్రతినిధిని వేధించకుండా వదలిపెట్టమని ఎలా చెప్పాలో– ఆ ఉపాయం సూచించే సాహసం ఎవరికీ లేకపోయింది. ఏమంటే, అలా చెప్పేపక్షంలో అతనిని సరిగ్గా ఆ మాట ప్రకారమే– ఆ తరువాతి ఎన్నికల్లో 'వేధించకుండా' వదలిపెట్టివేస్తారు ! నిజానికి కాంగ్రెసు సభ్యులు తమ నియోజకవర్గాల ప్రజలతో నిత్య సంబంధం చాలా విలువైనదిగాయెంచి, కాంగ్రెసు సమావేశాలు ముగిసినవెంటనే తమ ప్రజలనుకలుసుకోడానికి వెళ్లిపోతారు. నిత్యమూ పెరుగుతూండే ఈఅతిథుల ప్రవాహానికి తట్టుకొనేందుకు అచరణ యోగ్యమైన మార్గం– కాంగ్రెసు నిత్య వ్యవహారాల నిర్వహణను ఎక్కువమంది ఉద్యోగులను నియమించి, సభ్యులకు తమ అతిథుల సౌకర్యాలు చూచే తీరిక కల్గించడం ఒక్కటే కనిపిస్తోంది.

తన కార్యాలయం నుండి కాంగ్రెసు సభకు పోతూ తన నియోజకవర్గం నుండి వచ్చిన ఇద్దరు వ్యక్తులు చెరొక చెవిలో రొద పెడుతుండగా ఆనాడు సభలో తాను ఏవిధంగా వోటు చేయవలసిందీ నిశ్చయించుకోగల చాకచక్యానికి అలవాటు పడని కాంగ్రెసు సభ్యుడు తన పదవిని తన కన్న ఎక్కువ మానసిక దార్ఢ్యం గలవాడికి వదలిపెట్టి—రాజీనామా యివ్వడమో, ప్రాణాలు వదలడమో తప్ప గత్యంతరం లేదు!

అమెరికన్ రాజకీయ వ్యవస్థ చాలా గందరగోళంతో, అలజడితో కూడి ఉన్నది కావచ్చు. కాని అమెరికన్ ప్రజలు—వారి రాజ్యాంగ నిర్మాతలు కూడా ఊహించని గడ్డు సమస్యలను, దారుణ విపత్తులను ఘోర వినాశనానికి లోను కాకుండా ఎదుర్కొని పరిష్కరించుకొన్నారు. భవిష్యత్తులో అమెరికా తనకు సంతృప్తికరమైన, ఇతర స్వేచ్ఛా ప్రియ జాతులకు సహాయకరమైన, విజయాన్ని సాధించగలదని ఆశించ వచ్చు.అమెరికా కాంగ్రెసులో-అది ప్రాతినిధ్యంవహించేప్రజలలో ఉన్నలోపాలూ,గుణాలూఅన్నీఉన్నాయి. కాలక్రమాన అది సాధించే విజయమూ, అప్రమాణంలోనే ఉంటుంది.



# సమాఖ్యా న్యాయస్థానాలు

సమాఖ్యా న్యాయస్థానాలూ, కొంతవరకు న్యాయస్థానాలలా పనిచేసే పరిపాలక సంస్థలూ, న్యాయ శాసనాన్ని ఒక్కొక్క విషయానికి అనువర్తింపచేస్తాయి. అంతేకాక, యివి యింకా చాలా పనులుచేస్తాయి. న్యాయశాసనంలోని మాటలే న్యాయ మంతటినీ వ్యక్తంచెయ్యవు. ఎప్పటికప్పుడు కొత్తవివాదాలు వస్తుంటాయి. న్యాయ శాసనం వాటికీ వర్తించాలి. ఒక్కొక్కప్పుడు అలాటి కొత్త వివాదాల కోసం కాంగ్రెసు క్రొత్త శాసనాలు చేస్తుంది. కాని కొన్నిసందర్భాలలో న్యాయస్థానాలే పాత శాసనాల్లో కొత్త అర్థాలు తీసి, ఆ అర్థాలు పాత శాసనపు నిజమైన భావానికి అనుగుణమైనవేనని ప్రకటిస్తాయి.

ఏవిధమైన వ్యాఖ్యానం చెప్పాలి అనేది న్యాయమూర్తుల వ్యక్తిగత ప్రవృత్తులమీద, ముఖ్యంగా సుప్రీంకోర్టు సభ్యుల ప్రవృత్తుల మీద ఆధారపడి ఉన్న రాజకీయ విషయం! న్యాయమూర్తులు అత్యున్నత న్యాయస్థానంలో ప్రజలకు దూరంగా ఉన్నప్పటికీ, వారికి తోటిప్రజల నైతికప్రమాణాలూ, రాజకీయ నిర్ణయాలూ అనుభూతమే కనుకనూ, వారు అధ్యక్ష స్థానానికి ఎన్నుకొనబడిన వ్యక్తిచేత నియమించబడినవారేకనుకనూ, వారు రాజకీయ వ్యవస్థకు అతీతులు మాత్రం కారు.

రిపబ్లిక్ ఏర్పడిన తొలి దినాలలో ప్రభుత్వం రాజ్యాంగాన్ని ధిక్కరిస్తే ఏమిచేయాలి అన్న విషయాన్ని ఎదుర్కొన వలసిన అవసరమే రాలేదు. ప్రజలు రాజ్యాంగాన్ని దేశపు మహోన్నత న్యాయ శాసనంగా అనుసరించారు. దాన్ని ధిక్కరించి అధ్యక్షుడు కాని, కాంగ్రెసు గాని చేసిన శాసనానికి సిద్ధాంతరీత్యా శాసన బలం ఉండదు. 1896 లో జేమ్సుబ్రైస్ చెప్పినట్టుగా 'తమ అధికారానికి మించిచేసిన శాసనాలుచెల్లవు. అతి హీనుడైన పౌరుడైనా సరే వాటిని చెల్లవని తిరస్కరించవచ్చు. నిజానికి తిరస్కరించాలి కూడా!' బ్రైస్ అభిప్రాయంలో : ఒక శాసనాన్ని 'రాజ్యాంగ విరుద్ధం' అని ప్రకటించడానికి అత్యున్నతన్యాయస్థానాలకున్న హక్కు, సహజమైనదీ; తరుగులేనిదీను. చరిత్రలో మాత్రం—ఈ అధికారాన్ని ఆండ్రుజాక్సన్, అబ్రహామ్ లింకన్‌ల వంటి ప్రముఖులే ధిక్కరించారు. 1937 లో నూతన న్యాయమూర్తుల నియామక సందర్భంలో వచ్చినవివాదంలో (Court Packing Controversy)ఇది తీవ్రంగా చర్చించబడింది.

రాజు ఇచ్చిన హక్కులపత్రం న్యాయానికి ప్రాతిపదికగా ఉండే వలసలలో ఆ పత్రానికి విరుద్ధంగా ఉండే శాసనాలు చెల్లవని న్యాయస్థానాలు ప్రకటించేవి. ఈ సంప్రదాయాన్నే తరువాత రాష్ట్రాలు కొనసాగించాయి. 1786 లో రోడ్ ద్వీపశాసనసభ చేసిన శాసనం రాష్ట్రరాజ్యాంగానికి విరుద్ధం కాబట్టి చెల్లదని ఆ రాష్ట్రపు సుప్రీంకోర్టు ప్రకటించింది.

ఈ విధంగానే 1803 లో సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జాన్ మార్షల్ కాంగ్రెసు చేసిన శాసనం చెల్లదన్న మొట్టమొదటి తీర్పు వ్రాసేటప్పుడు — అతడు సంప్రదాయబలం ఉన్న ఈ అధికారాన్నే తన చర్యకు బలీయమైన ఆధారంగా చేసుకున్నాడు. రాజ్యాంగ విరుద్ధమైన శాసనం చెల్లదన్న ప్రాథమిక సూత్రం లిఖిత రాజ్యాంగాలలో తప్పనిసరిగా చేర్చబడుతుందనీ — సుప్రీంకోర్టువారు దానిని మానవ సమాజపు ప్రాథమిక సూత్రాలలో ఒకటిగా పరిగణించ వలసి ఉన్నదని అతడు అన్నాడు.

తరువాత 50 సంవత్సరాలలో ఈ రాజ్యాంగ సంస్కారాలను ఎదుర్కొనే దానికి మరొక సిద్ధాంతం ప్రతిపాదించబడ్డది. ఏ రాష్ట్రానికైనా తాను రాజ్యాంగ విరుద్ధమనీ, అసంగికార్యమని ఎంచే ఫెడరల్ శాసనాన్ని — శక్తిహీనం (Nullify) చేసేహక్కు ఉన్నదని ఈసిద్ధాంతం. 1828 లో జాన్. సి. కాలన్ (Calhoun) దక్షిణ కెరొలినా రాష్ట్ర శాసన సభకు ఒక వ్యాసం వ్రాశాడు. దానికే తరువాత "దక్షిణ కెరొలినా ప్రకటన" (South Carolina Exposition) అని పేరు వచ్చింది. ఫెడరల్ ప్రభుత్వం — రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రతినిధి మాత్రమే అని అతడు అందులో వ్రాశాడు. కాంగ్రెసు సభ చేసిన పని యిష్టం లేకపోతే యే రాష్ట్రమైనా సరే తన ప్రాంతంలో ఆ శాసనప్రవర్తనను నిషేధించి దానిని శక్తిహీనం చేయవచ్చునని అతడు ఆ వ్యాసంలో నొక్కి వక్కాణించాడు. అపుడు ఆ శాసనం రాజ్యాంగ విరుద్ధం అవుతుంది. దానిని అమలు పరచాలంటే— రాష్ట్రాలలో మూడింట రెండు వంతుల ఆధిక్యంతో రాజ్యాంగానికి సవరణ ప్రతిపాదించడం తప్ప గత్యంతరం ఉండదు.

కాలన్ చేసిన ఈవాదనాబలంతో దక్షిణ కెరొలినాలో హాట్ హెడ్స్. ఫెడరల్ ఎగుమతి దిగుమతి పన్నుల శాసనాన్ని శక్తిహీనం చేద్దామని ఉద్దేశించారు. ఏమైనాసరే దేశపు ఐకమత్యం సంరక్షించబడాలనీ, అవసరమైతే సైనిక బలంతో సైనా ఆ శాసనాన్ని అమలు పరుస్తాననీ, అధ్యక్షుడు జాక్సన్ ప్రక

టించాడు. చివరకి సమస్య – కాంగ్రెసు తన శాసన తీవ్రతను కొంత తగ్గించడంతో – రాజీ మార్గంలో పరిష్కారమయింది.

ఇరవై సంవత్సరాల అనంతరం – విస్కాన్సిన్‌లోని శాసన సభ తన రాష్ట్రంలోకి చట్టవిరుద్ధంగా పారిపోయి వచ్చినబానిసను పట్టియివ్వమని ఆదేశించే ఫెడరల్ శాసనాన్ని గుర్తింప నిరాకరించింది. ఈ విధగా రాష్ట్రాలు తమకు యిష్టంలేని ఫెడరల్ శాసనాలు చెల్లవని ప్రకటించడం చివరకు అంతర్యుద్ధానికి దారి తీసింది. **1861 – 1865** లో జరిగిన అంతర్యుద్ధంతో – ఈ విధంగా ఫెడరల్ శాసనాలను శక్తిహీనం చేసే విధానం అంతమయింది. ఈ లోపున సుప్రీంకోర్టు మాత్రం– **1803** నుండి **1857** వరకూ ఏ న్యాయశాసనాన్నీ రాజ్యాంగ విరుద్ధంగా ప్రకటించక పోయినా – అది రాజ్యాంగాను గుణ్యమా కాదా అనే సూత్రం ప్రకారమే పరిశీలిస్తూంది. అంతర్యుద్ధం ముగిసిన తర్వాత "విధి శాసనరూప నిర్మాణం" (**Positive Legislation**) ఎక్కువగా జరగడంతో – న్యాయ స్థానం తన అధికారాన్ని మరింత తరుచుగా ఉపయోగించడం ప్రారంభించింది.

విపరీతంగా ప్రజాభిమానం చూరగొన్న శాసనాన్ని న్యాయస్థానం చెల్లదంటే ఆ నష్టానికి–తాము ఉపయోగించ వలసిన సాధనాన్ని ఉపయోగించక పోవడమే కారణమని కాలక్రమాన ప్రజలు తెలుసు కున్నారు. "**1787** లో మీరు కాంగ్రెసుకు రాబడిపన్నులు విధించే అధికారం ఇవ్వలేదు. ఇప్పుడు **1895** లో రాబడిపన్నులు మీకుకావాలంటే కాంగ్రెసును అడిగితే అది ఇవ్వలేదు·మీరాజ్యాంగాన్ని సవరించుకోవడంద్వారామిమ్మల్నేఅడుగుకోండి"అని న్యాయస్థానం చెప్పింది. అపుడు ప్రజలు–తాము రాజ్యాంగాన్ని సవరించడానికైనా సరే సిద్ధపడేటంత గాఢంగా అమ్మకపు పన్నులుకావాలనికోరుకుంటున్నామా?" అని ఆత్మపరిశీలన ప్రారంభించారు. **1913** లో వారు ఒక నిశ్చయానికి వచ్చి, కాంగ్రెసుకు ప్రత్యక్షంగా రాబడి పన్నులు విధించే అధికారం యిస్తూ రాజ్యాంగానికి **16** వ సవరణను అంగీకరించారు. ఈవిధంగా– రాజ్యాంగాన్నిసవరించడమనే సుదీర్ఘ, ప్రయాసకర మార్గంద్వారాసుప్రీంకోర్టు ఆట కట్టించవచ్చునుగాని ప్రజలు ఓర్పు వహించక, తొందరపడుతూ ఉన్నప్పుడు మాత్రం– ఈ మార్గం వారికి తృప్తికరంగా ఉండదు.

సుప్రీంకోర్టులో న్యాయవాద వృత్తిలో మంచి అనుభవం కలిగినవారే న్యాయమూర్తులుగాని యమించబడతారు. ఐతే న్యాయమూర్తు లుగానియ

మించబడే వారందరూ, అంతకు ముందు న్యాయవాద వృత్తి చేసినవారే కానక్కరలేదు. సెనేటులో సభ్యులూ, అటార్నీ జనరలు పదవి నిర్వహించినవారూ, న్యాయకళాశాలలలో ఉపాధ్యాయులూ, న్యాయపాలకాధికారాలున్న ప్రభుత్వశాఖలో ఉద్యోగులూ కూడా న్యాయమూర్తులుగా నియమించబడవచ్చు. న్యాయమూర్తులు సాధారణంగా **50** ఏళ్ళ వయసులో నియమించబడి **20** నుంచి **40** ఏళ్ళ వరకూ ఆ పదవిలో ఉంటారు. అందుచేత వారు కొంచెం పెద్ద వయస్సువాళ్ళు అయి, తమ ముందుతరంనాటి రాజకీయ పరిస్థితులతో సన్నిహిత పరిజ్ఞానం కలవాళ్లై ఉంటారు. న్యాయస్థానం తరుచు మితవాద ప్రవృత్తి కలిగి ఉండి సత్వర పురోగమనాన్ని వాంఛించే ఔదార్యవాదులకు చికాకు కలిగించేదిగా ఉంటుంది. **1937** లో న్యాయ స్థానంలో ఉన్నవారు అంతా చాలా వృద్ధులై అధికారంలో ఉన్నపక్షం తీవ్రపురోగామి దృక్పథం కలిగి ఉండేది కావడంతో **'Court Packing Plan'** అనే సంఘటన జరిగింది.

**1935–37** మధ్య న్యూడీల్‌కు సంబంధించిన అనేక శాసనాలను న్యాయస్థానం రాజ్యాంగ విరుద్ధమని కొట్టి పారవేసింది. న్యాయమూర్తులు వెనుక చూపుచూసే వృద్ధమూర్తులైపోయారని చెప్పి అధ్యక్షుడు రూజ్‌వెల్టు–తొమ్మండుగురు కొత్త న్యాయమూర్తులను నియమించి న్యాయస్థానంలో మొత్తం **15** గురు సభ్యులుండేటట్లు చేయాలని కాంగ్రెసుకు ప్రతిపాదన చేశాడు. కాని, ఇలా కోర్టులో న్యాయమూర్తులను 'కుక్కే' పద్ధతి ప్రజలు తీవ్రంగా నిరసించగా, చివరకు కాంగ్రెసు ఈ ప్రతిపాదనను తిరస్కరించింది. ఈ లోపున అధ్యక్షుడు ఇంకొక దెబ్బ కొట్టేమార్గం అవలంబించక ముందే న్యాయస్థానం తనకు దెబ్బ తగలకుండా తప్పుకొంది. **1937** తరువాత చనిపోయినవారి స్థానంలోనూ, రాజీనామా యిచ్చినవారి స్థానంలోనూ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ యెనమండుగురు న్యాయమూర్తులను నియమించ గలిగాడు. తరువాతి **20** సంవత్సరాల డెమొక్రటిక్ పక్షపు పరిపాలనలోనూ న్యాయస్థానం ఏ ఇతర నిరోధాలూ కల్పించలేదు.

ఫెడరల్ న్యాయ వ్యవస్థలోని చిన్న న్యాయస్థానాలు రాజ్యాంగ సమస్యలతో సంబంధించని నిత్య వివాదాలనే పరిష్కరిస్తుంటాయి కాబట్టి – వాటికి రాజకీయంగా ఎక్కువ ప్రాముఖ్యత ఉండదు. ఇందులో మొట్టమొదట జిల్లా కోర్టులు ఉన్నాయి. అమెరికా మొత్తంపై **200** మంది జిల్లా న్యాయాధి

పతులున్నారు. ఈ కోర్టులు ఫెడరల్ శాసనాల అధికార పరిధిలోకి వచ్చే సివిల్, క్రిమినల్ వివాదాల నన్నిటిని విచారిస్తాయి. రాజ్యాంగం ప్రకారం– **20** డాలర్లకు (ఇంచుమించు రు **100**) తక్కువ విలువ ఉన్న సివిల్ వివాదాలు మినహా- మిగతా అన్ని వివాదాలలోనూ ఈ న్యాయస్థానాలు జూరీ విచారణ జరిపించాలి.

రాష్ట్రేతర వాణిజ్యం చేస్తున్న వర్తకుడు తన ఉద్యోగులకు ఉద్యోగ కాలంలో జరిగిన నష్టానికి పరిహారం యివ్వవలసిందిగా విధించే "యజమానుల బాధ్యతల శాసనం" (**Employer's Liability Act**) వంటి ఫెడరల్ శాసనాలప్రకారం పౌరులుతెచ్చిన వివాదాలన్నీ జిల్లాకోర్టులలో విచారిస్తారు. నావికా శాసనాన్ని కూడా రాజ్యాంగం ఫెడరల్ ప్రభుత్వపు చేతుల్లో పెట్టింది. కాబట్టి, సముద్రంమీద జరిగే వివాదాలను విచారించే పని కూడా జిల్లా కోర్టులదే అయింది. ఇక, పౌరులమధ్య వచ్చే వివాదాలున్నాయి. ఏదైనా సంస్థకూడా అది స్థాపించబడ్డ రాష్ట్రంలో పౌరునికున్న హక్కులన్నీ ఉన్నాయి అది శాసనం ప్రకారం రాష్ట్రేతర పౌరుని వలె ఇతర రాష్ట్రాలతో వ్యవహారం చేస్తూండవచ్చు. కాబట్టి ఇంచుమించు ఏ వర్తక వివాదమైనా యీరకమైన వివాదం క్రిందికే వస్తుంది. ఇవన్నీ జిల్లాకోర్టుల లోని సివిల్ వివాదాలు.

ఇక ధరల కంట్రోలు శాసనాలవంటి వాటిని ధిక్కరించిన నేరాలను, జిల్లా కోర్టులలో క్రిమినల్ నేరాలుగా విచారిస్తారు. పన్నుల విషయంలో మోసం చేసినందుకు ఒక పౌరుని ప్రభుత్వం శిక్షించడం, ఒకపౌరుని దగ్గర నుండి అన్యాయంగా పన్ను వసూలు చేసినందుకు అతడు ప్రభుత్వంమీద దావా తేవడం, ఇవి అన్నీ 'పన్నుల వివాదాలు'.

ఇంచుమించు అన్ని వివాదాల విషయంలోనూ జిల్లా కోర్టులకు "ప్రాథమిక విచారణాధికారం" (**Original Jurisdiction**) ఉంటుంది. అంటే – ఒక వివాద విషయంలో జ్యూరీసహాయంతో మొట్టమొదటగా వివరాలు సేకరించి, తీర్పుచెప్పే అధికారం. ఈకోర్టు విచారణలో తప్పు చేసిందనే కారణంతో కాని, లేదా న్యాయ శాసనం రాజ్యాంగ విరుద్ధమనే కారణంతో కాని – ఆ తీర్పుపై అపీలు చేయవచ్చు. ఈ అపీళ్ళు – ఫెడరల్ న్యాయ వ్యవస్థలో మధ్య మెట్టుగా ఉన్న – అపీళ్ళ న్యాయస్థానానికి వెళ్తాయి.

ఈ అపీళ్ళ న్యాయస్థానం క్రింది న్యాయస్థానం పంపిన వివరాలు ఆమోదిస్తుంది కాబట్టి, దీనికి జ్యూరీతో అవసరంలేదు. వివాదాస్పదమైన న్యాయ శాస్త్ర విషయాలలో తీర్పుచెప్పడమే దీనిపని. అపీళ్ళ న్యాయస్థానంలో ముగ్గురు న్యాయాధిపతులు కలిసి కూర్చొని వివాదాలు విచారిస్తారు. రాజకీయప్రాముఖ్యంలేని నిత్య వివాదాలు సుప్రీంకోర్టుదాకా వెళ్ళనక్కరలేకుండా పరిష్కరించడమే–ఈ న్యాయస్థానపు ప్రధానబాధ్యత. ఒక శాసనం రాజ్యాంగ విరుద్ధమని అపీలులో వాదించినప్పటికీ, దానిని సుప్రీంకోర్టుకు పంపకుండా ఆ అపీలును అపీళ్ళ న్యాయస్థానం వారే విచారించి, వాదనలు విని, వివాదాస్పద విషయాలను వివరించవచ్చు. ఒక్కొక్కప్పుడు ఈన్యాయస్థానపు నిర్ణయం చాలా స్పష్టంగాను, ధర్మంగాను ఉండి ఇక దానిపై సుప్రీంకోర్టు జోక్యం కల్పించుకొన నిరాకరించవచ్చు. అపుడు అపీళ్ళకోర్టే–కనీసం ఆ వివాద పరిస్థితులకు సంబంధించినంతవరకూ – అత్యున్నత ధర్మనిర్ణేతగా వ్యవహరించి నట్లవుతుంది.

కాని, ఇంచుమించు ఒకే విధంగా కన్పించే రెండు వివాదాలపై రెండు అపీళ్ళ కోర్టులు రెండు విధాలుగా తీర్పుచెప్పిన సందర్భంలో ఆ తీర్పులను కాదనడమో లేక వివరించడమో చేయదలచుకొన్నప్పుడు, సుప్రీంకోర్టు అపీళ్ళకోర్టు తీర్పుపై అపీలును అంగీకరిస్తుంది. ఇవిగాక కొన్ని వ్యాపార విషయాలలో రాజకీయంగా ప్రాముఖ్యంగలవీ, ఆచరణలో చాలా క్లిష్టమైనవీ అయిన శాసనాలున్నాయి. ఆ శాసనాలు అమలు జరగడంలో అలస్యం జరుగకుండా–వాటి ప్రవర్తనను ఫెడరల్ కోర్టులద్వారా త్వరితం చేయాలని కాంగ్రెసు నిశ్చయించింది. అటువంటి వివాదాలు క్రిందికోర్టులో ముగ్గురు న్యాయాధిపతులచే విచారించ బడతాయి. వారిచ్చిన తీర్పుపై తిన్నగా–మధ్య అపీలు కోర్టుతో ప్రమేయం లేకుండా–సుప్రీంకోర్టుకు అపీలు చేసికొనవచ్చు.

మూడు దశలుగల ఈ ఫెడరల్ న్యాయపాలనా వ్యవస్థలో ఈ న్యాయస్థానాలు కాక, యింకా అనేక ప్రత్యేక న్యాయస్థానాలున్నాయి. ఇవి–క్లెయిముల కోర్టు, పన్నుల కోర్టు, ఎగుమతి సుంకాలకోర్టు, పేటెంటు అపీళ్ళకోర్టు మొదలైనవి. న్యాయాధిపతి తన కాలాన్నంతటిని వినియోగిస్తే తప్ప అర్థం

కాని ప్రత్యేక విషయాలకోసం ప్రత్యేక న్యాయస్థానాలు ఏర్పాటు చేస్తాయి. ఈ ప్రత్యేక న్యాయస్థానాలు-పూర్తిగా న్యాయపాలక శాఖకు చెందిన న్యాయ స్థానాలకూ, న్యాయపాలకాధికారాలతో ప్రభుత్వం ఏర్పాటుచేసిన పరిపాలక శాఖలకూ మధ్య ఉంటాయి.

"విదేశాలతోనూ, వివిధ రాష్ట్రాలమధ్యనూ, ఎర్రఇండియన్ జాతులతోనూ జరిగే వాణిజ్యాన్ని క్రమబద్ధం చేయడానికి" 'వాణిజ్యసూత్రం' ద్వారా రాజ్యాంగం కాంగ్రెసుకు అధికారాన్నిచ్చినా, ప్రభుత్వం నేటివలె వ్యాపారాన్ని క్రమబద్ధం చేయడం మొదట రాజ్యాంగంలో ఉద్దేశించ బడలేదు. మొదట్లో కాంగ్రెసు చేసే పనిలో ఎగుమతి, దిగుమతి సుంకాలను సంబంధించిన పనులూ, రాష్ట్రాలమధ్య ఎగుమతి సుంకాలు నిషేధించడమూ మాత్రమే ముఖ్యంగా ఉండేవి. కాని-వ్యాపారం పెరగడంతో రైలురేట్లూ, ప్రయాణ సౌకర్యాలూ, ఆహార పదార్థాలు కల్తీకాకుండా చూడడం, రేడియో మార్గాలు కేటాయించడం మొదలైన పనులన్నీ కాంగ్రెసు చేయవలసి వస్తోంది. ఇందులో చిత్రమేమిటంటే-కాంగ్రెసు ఇలాటి ప్రతి చిన్న విషయాన్ని గురించి ఒక శాసనం చేయలేదు. ఫ్లారిడా రాష్ట్రంలోని సిల్వర్ స్ప్రింగ్స్ నుంచి న్యూయార్కు రాష్ట్రంలోని సిర్‌కాస్ వరకూ నారింజపండ్లు పంపడానికి రైలుచార్జి ఇంత ఉండాలి అని కాంగ్రెసు శాసనంద్వారా నిబద్ధం చేయలేదు. అయినప్పటికీ – కాంగ్రెసు కొరేరేట్లు ఇంచుమించుగా అమలులో ఉన్నాయి. ఈ రేట్ల విషయంలో అనుసరించవలసిన సూత్రాలను గురించి స్థూలంగా వివరిస్తూ కాంగ్రెసు శాసనం చేస్తుంది. పరిస్థితుల కనుగుణంగా ఆ సూత్రాలను అమలు పరుస్తుండేందుకు ఒక ఉద్యోగిని నియమిస్తుంది.

వ్యాపారాన్ని క్రమబద్ధంచేసే ప్రభుత్వాంగాలలో ముఖ్యమైనవి : అంతర్రాష్ట్ర వాణిజ్య సంఘం (**Inter State Commerce Commission,**) సమాఖ్యా వర్తక సంఘం (**Federal Trade Commission**) మున్నగునవి.

సామాన్యంగా యీ సంఘాలు నిజమైన విషయాలను పరిశీలించిన మీదట చేసినపనికి ఎంత పుచ్చుకోవచ్చునో, లేక శాసన ప్రకారం యెంత పుచ్చుకుంటూండవచ్చునో వర్తక సంస్థలతో చెపుతాయి. ఈ సంఘాలకు

ఎవరినైనా జైలులో పెట్టడానికీ, జరిమానాలు విధించడానికి అధికారంలేదు. కాని తమ ఆజ్ఞలకు బలం ఉండేందుకుగాను వ్యాపారస్థుడి నెవరినైనా, శాసనాన్ని ధిక్కరించాడనే నేరంపై కోర్టు కీడ్చడానికి మాత్రం వీటికి అధికారం యివ్వబడింది. అంటే వ్యక్తులకు సంబంధించినంత వరకూ యీ సంస్థలే న్యాయాన్ని నిర్ణయిస్తాయని చెప్పవచ్చు. సుప్రీంకోర్టు తప్ప—ఇతర ఫెడరల్ న్యాయస్థానాలు అన్నిటికన్నా ఇవే ఎక్కువగా క్రొత్త న్యాయాన్ని రూపొందిస్తాయి.

మూడు ప్రధానాంగాలు గల ప్రభుత్వ వ్యవస్థలో ఇమడని యిటువంటి పరిపాలక సంఘాలు క్రొత్త న్యాయం తయారుచేస్తాయని అంగీకరించడానికి న్యాయపాలక శాఖ యిష్టపడదు. ఈ పరిపాలక సంఘాలు (కమిషన్‌లు) అటు కార్యనిర్వాహకశాఖకూ, ఇటు న్యాయపాలక శాఖకూ, మధ్యగా ఉన్నప్పటికీ వీటిలో న్యాయపాలకశాఖా లక్షణాలే ఎక్కువగా ఉన్నాయి. ఇందులో వ్యక్తులు అధ్యక్షునిచేత నియమింపబడి సెనేటు పరిశీలన తరువాత ఆమోదించబడతారు కాబట్టి—వీటికి రాజకీయాలతో సంబంధం ఉన్నదని చెప్పవచ్చు. కొన్ని వ్యాపార సంస్థలు పార్టీ నిధులకు ఉదారంగా విరాళాలిచ్చి—ప్రజలకోసం పనిచేసేవారూ, పెద్ద వ్యాపార సంస్థల ప్రయోజనాలకు ప్రతికూలంగా ఉంటేవారూ కమిషన్ అధిపతులుగా నియమించబడితే, ఆ నియామకాలను సెనేటుచేత తిరస్కరింపచేయడం కూడా కద్దు. కంచే చేనుమేస్తే ఎవరు కాపలా కాస్తారన్న ప్రశ్నకు న్యాయస్థానాలు ఉచితమనుకొన్న పరిమితికన్న ఎక్కువగా రాజకీయ శాసనగల జవాబులు చాలా ఉన్నాయి.

అయితే ఈ పరిపాలక సంఘాలపై న్యాయస్థానాలకు ఏ అధికారమూ లేకుండా పోలేదు. కాని ఆ సంఘాలు వివరాలు సేకరించడానికి అనుసరించిన పద్ధతులలోనూ, ఆ వివరాలు ఆధారంగా చేసిన నిర్ణయాలలోనూ, మంచిచెడ్డలు పరిశీలించినంతగా—ఆ వివరాలలోని మంచి చెడ్డలను న్యాయస్థానాలు పరిశీలించవు. అంతేకాక, కొన్ని పరిమితులకు లోబడి పోలీసులను అవలంబించ నిచ్చిన పద్ధతుల కంటె మోటైన పద్ధతులను ఈ సంస్థలు అవలంబించడానికి న్యాయస్థానాలు అనుమతిస్తాయికూడా. 1950 లో ఫెడరల్ ట్రేడ్ కమిషన్ మార్టన్‌సాల్ట్ కంపెనీ లోపలికి వెళ్ళి కాగితాల

కట్టలను పరిశీలించవచ్చునని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది. ఇలా సోదాచేసే పని—న్యాయస్థానానికి గాని, మామూలు పోలీనువారికిగాని, అనుచితమైనది. "సముచిత న్యాయవిధానం" అనే మాటలకు ప్రభుత్వపాలనలో అవసరాలకు తగినట్టుగా క్రమంగా క్రొత్త నిర్వచనం చెప్పకుంటున్నారు!

ఫెడరల్ న్యాయస్థానంలో వివాదాలలో తరుచు ప్రభుత్వం ఒక పక్షంగా ఉంటూంటుంది. సుప్రీంకోర్టులో ప్రభుత్వం తరఫున వాదించడానికి **1789** లో మొట్టమొదటి అటార్నీ జనరల్‌ను నియమించారు. ప్రస్తుతం న్యాయశాఖలో సొలిసిటర్ జనరల్ అనే ఉద్యోగి యీ పనులు చూస్తున్నారు. ప్రభుత్వం తరఫు న్యాయవాది చేయవలసిన పనులన్నీ న్యాయశాఖ చూస్తుంది.

ఒక వ్యక్తి ఆదాయపు పన్ను ఎగవేశాడని రెవెన్యూశాఖకు అనుమానం వస్తే-ఆవివాదాన్ని న్యాయశాఖ వారికి వదలి పెడుతుంది. సెనేటు సంఘం విచారణకు సాక్షిరానన్నడంగాని, సాక్షి అబద్ధం చెప్పాడని వారికి నమ్మకం కలగడంగాని జరిగితే ఆ వివాదాన్ని గ్రాండ్‌జ్యూరీ పరిశీలనకు పెట్టి, ఆ వ్యక్తికి శిక్ష విధించే ఏర్పాటు చేయడంకూడా న్యాయశాఖ పనే.

న్యాయశాఖలో ఫెడరల్ ప్రభుత్వ అపరాధ పరిశోధన సంస్థ (ఫెడరల్ బ్యూరో అఫ్ ఇన్‌వెస్టిగేషన్ **F. B. I.**) కూడా ఒక భాగం. ఇది ఫెడరల్ ప్రభుత్వపు అపరాధ పరిశోధక మండలిలో ముఖ్యభాగం. ఈ సంస్థ దొంగలను, బ్యాంకిదోపిడిదార్లను, ఫెడరల్ శాసన ధిక్కారం చేసిన ఇతరులను పట్టుకుంటుంది. ప్రభుత్వోద్యోగుల భక్తి విశ్వాసాలను పరీక్షించే పనికూడా ఈ సంస్థే చేస్తుంది. దొంగనోట్లు తయారుచేసేవారిని, రాబడిపన్ను ఎగవేసేవారిని, ఎగుమతి సుంకాలు కట్టకుండా సరుకులు పట్టుకుపోయే వార్ని అధ్యక్షునిపై హత్యాప్రయత్నం చేసేవారినీ పట్టుకొనడంకూడా ఈ సంస్థే చేస్తుంది. ఇలాంటి వ్యక్తులందరిపై న్యాయశాఖగాని, స్థానిక ప్రభుత్వ న్యాయవాదిగాని ఫెడరల్ న్యాయస్థానాలలో కేసు పెడతారు.

న్యాయశాఖ తన దృష్టికి తేబడిన అన్ని శాసన ధిక్కారాలను శిక్షించడం సాధ్యంకాదు. ముఖ్యంగా సరిహద్దుప్రాంతాల్లో జరిగే నేరాల విషయంలో సుదీర్ఘ విచారణ తరువాత కాని అసలు శాసన ధిక్కారం జరిగిందో లేదో

తెలియదు. తాను వాంఛనీయ మనుకొన్న మార్గంలో వ్యవహారం నడిచే అవకాశమున్న వివాదాలను ప్రభుత్వన్యాయవాది ఎంచుతాడు. శాసన ధిక్కారం కాదనడానికి వీలులేనంత స్పష్టంగా జరిగిన వివాదాలు చాలా తక్కువ. సామాన్యంగా న్యాయశాస్త్రవేత్తలు వివాదపడే సంఘనలేఉంటాయి ఈ విధంగా ఏ శాసన సూత్రాలు అమలుపరచబడాలో, ఏయే పనులు శాసన ధిక్కారం కిందికి వస్తాయో, నిర్ణయించడంలో ప్రభుత్వ న్యాయవాదికి ఎక్కువ వివేచన ఉంటుంది. అధ్యక్షుని విధానాలతో నిమిత్తం లేకుండా అతడు నిర్ణయాలు చేయడు. అందుచే ఈ నిర్ణయాలపై కూడా రాజకీయాల ప్రభావం ఎక్కువగా ఉంటుంది.

ఉదాహరణకు ట్రూమన్ పరిపాలనపోయి ఐసెన్‌హోవరు వచ్చేటప్పటికి "వర్తక సంస్థ సమాఖ్యా నిషేధక శాసనం" **(Anti trust Law)** తాలూకు చాలా వివాదాలు కోర్టులకు వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాయి. అందులో ఒక వివాదంలో-ముడిపదార్థాన్ని ఉత్పత్తిచేసే ఒక పెద్ద సంస్థ ఏయే చిన్న సంస్థలను తన చేతిక్రింద ఉంచుకోవచ్చు అనే ప్రాథమిక ప్రశ్న వచ్చింది. ప్రభుత్వ న్యాయవాది ఈ వివాదాన్ని కోర్టుకు తీసుకువెళ్ళ డం మంచిదా, లేక వదిలివేయడం మంచిదా అని ఆలోచించక తప్పలేదు.

ప్రభుత్వన్యాయవాదులనుండి సుప్రీంకోర్టులో న్యాయమూర్తుల పర్యం తం-అందరినీ నియమించడంలోనూ, రాజ్యాంగాన్నీ న్యాయ శాసనాలనూ వివరించడంలోనూ, సర్వత్రా ఉన్న ఈ రాజకీయాల ప్రాపక ప్రభావాలతో "న్యాయం" సామాన్య మానవుడు తనకు అండగా ఉండగలదనుకొన్న కొండలాంటిది కాకుండా పోయింది. ఇపుడు న్యాయానికి 1787 లో జనం అనుకొన్నదానికంటే తక్కువబలం ఉంది. ఆ రోజుల్లో మానవ నిర్మిత న్యాయానికి ఆధారంగా భగవనిర్మిత న్యాయం ఉన్నదనీ, దానిని న్యాయ మూర్తులు దర్శించి వివరించగలవారనీ నమ్మకం ఉండేది. బ్లాక్‌స్టన్ అనే ఆయన వ్రాసిన 'వ్యాఖ్యానాలు' ఈ సిద్ధాంతంపైనే వ్రాయబడ్డాయి. రిప బ్లిక్ తొలిరోజుల్లో ఆ పుస్తకం అమెరికన్ న్యాయవాదులను, న్యాయాధిపతు లను బాగా ఆకర్షించింది.

కాని 1776లోనే బ్లాక్‌స్టన్ వద్ద చదువుకొన్న జెరెమీ బేంతామ్ ఆ సిద్ధాంతంపై తిరుగుబాటు చేశాడు. బెంతామ్, లండన్‌లోని మురికిపేటలను

చూచి భగవంతుని న్యాయం ఇంగ్లండు న్యాయానికి ఆధారంగా ఉన్నట్టు కనిపించడంలేదని అన్నాడు. మురికిపేటలను తొలగించడం వంటి ఉపయోగకరమైన శాసనాలు మానవులు చేసుకోవచ్చునని అతడు సూచించాడు. ఈతని వాదానికి 'ప్రయోజన వాదం' (**Utilitarianism**) అనిపేరు. తరువాత ఈ సిద్ధాంతమే అమెరికాలో 'ఆచరణవాదం' ఉద్భవించడానికి కారణమైంది. ఏదైనా విషయం ఆచరణలో సరిగా పనిచేస్తే అది సరియైనదేనని యీ సిద్ధాంతం చెపుతుంది. ఈ మార్పు అమెరికన్ ప్రజలనూ, క్రమంగా న్యాయశాస్త్రవేత్తలనూ, న్యాయాధిపతులనూకూడా – న్యాయం యెడలగల భావంలో విప్లవకర పరివర్తన తెచ్చింది.

భగవంతుని మనస్సులో స్థిరంగా ఏర్పడిన న్యాయం బైబిలులోనూ, శాస్త్ర పండితుల విజ్ఞానకోశంలోనూ తప్ప మరెక్కడా కనపడదని ప్రజలు నమ్మినంత కాలం న్యాయం పెద్ద పర్వతం లాంటిదనీ, దానిపైన పొగ మంచులో మోసెస్‌కు దేవుడు చెక్కియిచ్చిన శిలాశాసనాలు కనపడతాయని ప్రజలు నమ్మేవారు. కాని యిప్పుడు న్యాయం దేశంలో మంచివ్యవస్థను, ధర్మాన్ని, చివరకు అభివృద్ధినికూడా సాధించడానికి ప్రజ లుపయోగించే సాధనం అని అనుకుంటూన్నారు కాబట్టి – ఇప్పటిస్థితి వేరు.

150 ఏళ్ళ క్రిందట న్యాయ పండితులు ఉపయోగించిన తేలికైన,క్రూరమైన, పద్ధతులకు బదులు ఇప్పుడు ఎక్కువ ఆచరణీయమైనవీ, అయినా ఎక్కువ క్లిష్టమైనవీ అయిన పద్ధతులు ఉపయోగిస్తూన్నారు. మనకు కావలసిన పద్ధతిలో సమాజం రూపొందడం ఈ మార్పుల ఉద్దేశ్యం. సర్వస్వాధికారయుతులైన ప్రజలకు యిష్టం వచ్చినట్లుగా సమాజాన్ని తీర్చిదిద్దడం ఎక్కువగా రాజకీయాలు చేయవలసినపని. పాత న్యాయసిద్ధాంతాల విషయంలో పాత న్యాయస్థానాలు తమకున్నవని విశ్వసించినంతపాటి బలమైన న్యాయమైనా – నవీన రాజ్యంలోని సమస్యల విషయంలో 1937లో డెమోక్రట్లు ఏర్పాటుచేసిన నేటి సుప్రీంకోర్టుకు లేదు. న్యాయమే స్థిరంగా లేకపోయినప్పుడు న్యాయనిర్ణయంలో ప్రమాణాలు ఎక్కడ ఉంటాయి?

ఏవో అతిమానుష శక్తివల్ల న్యాయమూర్తులు ధర్మాన్ని తెలుసుకుంటారనే నమ్మకం నేడు లేకపోయినంత మాత్రాన, న్యాయమూ, గౌరవమూ, సామరస్యమూ, ధర్మమూ అనే విశ్వాసాలు ప్రజలలో లేకుండా పోలేదు.

ప్రజలు ఇప్పటికీ ధర్మనిర్ణయ సూత్రాలున్నాయి. న్యాయాధిపతులుకూడా ప్రజలే కాబట్టి వారూ ఆ సూత్రాలనే వివరిస్తారు. తత్ఫలితంగానే ఇంచు మించు అత్యున్నత న్యాయస్థానపు తీర్పులన్నిటినీ భిన్న అభిప్రాయాలు కారణంగా కొందరు అంగీకరించరు; కొందరు అంగీకరిస్తారు. కాని తమ స్థితికి ఆధారంగా ఉండడానికి వీలయిన నిత్య సత్యాన్ని అన్వేషించే పని మాత్రం అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది.



# రాష్ట్రాలు

అమెరికాలో రాష్ట్రాలకు సాధారణంగా స్వతంత్ర రాజ్యాలకుండే అధికారాలూ హక్కులలో – ఈ క్రిందివి తప్ప మిగిలినవి అన్నీ ఉంటాయి.

1. ఫెడరల్ రాజ్యాంగరీత్యా రాష్ట్రాలకు నిషిద్ధమైన హక్కులు.

2. ఫెడరల్ ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వాలకూ ఉమ్మడిగా ఉన్న హక్కులలో ఫెడరల్ ప్రభుత్వంతో సంఘర్షణ వచ్చినంత మేరకు రాష్ట్ర ప్రభుత్వాల హక్కులు.

3. సమాఖ్యనుండి విడిపోయి రాజీనామా ఇచ్చే హక్కు, ఉదాహరణకు విదేశాలతో వ్యవహరించే హక్కు – రాష్ట్రాలకు లేదని రాజ్యాంగం నిషేధిస్తూంది. ఒక రాష్ట్రం మరొక రాష్ట్రంతో వ్యవహరించవచ్చు. కాని రాష్ట్రాల మధ్య జరిగిన ఒడంబడికలు కాంగ్రెసు ఆమోదం పొందినతరవాతనే చెల్లుబాటు అవుతాయి. అంతర్రాష్ట్ర వాణిజ్యానికి సంబంధించిన వ్యాపారాన్ని, కార్మికవిధానాలను రాష్ట్రప్రభుత్వాలూ ఫెడరల్ ప్రభుత్వమూకూడా నియమబద్ధం చేయవచ్చును. కాని, ఈ రెండు ప్రభుత్వాల అధికారాల మధ్య సరిహద్దు గీతనిర్ణయించే సమస్యపై నిత్యమూ పేచీలు వస్తాయి.

అంతరంగిక వ్యవహారాలతో మాత్రం రాష్ట్రాలు సర్వస్వాతంత్ర్యం కలిగి ఉంటాయి. ఇతర రాష్ట్రాలకు కూడా సంబంధం ఉన్న రాష్ట్రపు రాబడి పన్నుల విధానం, విడాకుల చట్టం వంటి విషయాలలో కూడా రాష్ట్రాలకు పూర్తి స్వాతంత్ర్యం ఉంది. అందుచేతనే ఒక రాష్ట్రం తన వ్యవహారాలలో తన యిష్టం వచ్చిన పనులుచేసి పొరుగు రాష్ట్రానికి బోలెడు చికాకులు కలిగించవచ్చు. అప్పుడు దాని పనులను ఆపడానికి రాజ్యాంగాన్ని సవరించడమో, కొత్త వ్యాఖ్యానం చెప్పడమో తప్ప గత్యంతరం లేదు.

ఒక క్రొత్త రాష్ట్రాన్ని సమాఖ్యలో చేర్చుకొనేముందు అది అనుసరించబోయే రాజ్యాంగాన్ని రిపబ్లికన్ రకపు రాజ్యాంగంగా కాంగ్రెసు ఆమోదించాలి. అలా ఆమోదించిన తరువాతనే ఆ రాష్ట్రం సమాఖ్యలో చేరుతుంది. కాని చేరిన తరువాత మిగిలిన 13 రాష్ట్రాలకూ ఉన్న ప్రాధమిక సర్వస్వాతంత్ర్యాధికారాలు క్రొత్త రాష్ట్రానికికూడా ఉంటాయి. అటుతరువాత

అరాష్ట్రాల రాజ్యాంగాన్ని పరోక్షంగా ఫెడరల్ రాజ్యాంగానికి సవరణ ప్రతిపాదించడంద్వారా తప్ప-ప్రత్యక్షంగా తానై ఫెడరల్ ప్రభుత్వం మార్చలేదు.

ఉదాహరణకు మొదట రాజ్యాంగంలో, ప్రజలలో ఎవరికి వోటుహక్కు ఉండాలో నిశ్చయించే అధికారం రాష్ట్రాలు అట్టిపెట్టుకున్నాయి. కాంగ్రెసు ఎన్నికల్లో వోటు చేయడానికి ఏ రాష్ట్రం ఏ అర్హతలు నిర్ణయిస్తే ఆ అర్హతలనే రాజ్యాంగం అంగీకరించింది. రాష్ట్ర రాజ్యాంగాలూ, రాష్ట్ర శాసనాలూ నిర్ణయించిన నిబంధనలను మార్చడానికి ఫెడరల్ కాంగ్రెసుకు అధికారం లేదు. కాని ఫెడరల్ రాజ్యాంగానికి తదనుగుణమైన సవరణ ప్రతిపాదించి, కాంగ్రెసులోని ముప్పాతిక రాష్ట్రాలు ఆ సవరణను బలపరుస్తే మిగిలినవారి మాట త్రోసివేయవచ్చు. ఇలాటి సవరణల మూలంగానే రాష్ట్రాలు స్త్రీలకు వోటుహక్కు ఇవ్వవలసి రావడం, సెనేటు సభ్యులను ప్రజలందరూ వోట్లువేయడం మూలంగా ఎన్నుకోవడానికి అంగీకరించడం జరిగాయి.

1868 లో ఆమోదించబడిన 14వ రాజ్యాంగపు సవరణలో ఉత్తర రాష్ట్రాలవారు నీగ్రోలకు వోటు హక్కు ఇవ్వమని దక్షిణ రాష్ట్రాలవారిని బలవంతంచేయ చూచారు. కాని ఆ సవరణలో ఉదాహరించబడిన కొన్ని రాష్ట్రాలనుండి ప్రతినిధుల సంఖ్యను తగ్గించడానికి కొన్ని రాజకీయ కారణాలవల్ల కాంగ్రెసుకు సాధ్యం కాకపోవడంవల్ల ఆ సవరణ ఖచ్చితంగా అమలు జరుపబడలేదు. కాని, దక్షిణ రాష్ట్రాలలో సాంఘిక, ఆర్థిక అభివృద్ధివల్లా, ఎవరూ నిరోధించని, నిరాదరించని సుప్రీం కోర్టు తీర్పులవల్లా, నీగ్రోలకు చాలా దక్షిణరాష్ట్రాలలో డెమోక్రాటిక్ ప్రైమరీ ఎన్నికలలో వోటువేసే హక్కు లభించింది. ఈసమస్య చాలా ప్రముఖమైనది. డెమోక్రటిక్ పక్షం పేరు రాజ్యాంగంలో ఉదహరించలేదు. కాబట్టి అది తన యిష్టంవచ్చిన వారిని సభ్యులుగా చేసికొనే హక్కు ఉన్న ప్రైవేటు సంస్థ అని భావించేవారు. కాని, రాజ్యాంగయుతమైన ఎన్నికల్లో ఎన్నుకోబడే వ్యక్తులను నిజంగా ఎంచుకొనేది రాష్ట్రాలలోని డెమోక్రటిక్ ప్రైమరీ సమావేశాలలోనే! ఈ సమస్యా సక్రమపరిష్కారం రాజ్యాంగ విహితమైన విధానాలకు అతీతమైనది. అందుచేత దక్షిణరాష్ట్రాలకు సమ్మతంగా ఉండేట్టు ప్రజాభిప్రాయం మారేవరకూ ఈ సమస్య ఆగవలసి వచ్చింది.

స్థానిక ప్రభుత్వాలను స్థాపించడానికి రాష్ట్రప్రభుత్వాలకు పూర్తి అధికారం ఉన్నది. లండన్‌లో స్థానిక ప్రభుత్వాలను స్థాపించడానికి, ఏకం చేయడానికి, రద్దుచేయడానికి బ్రిటిష్‌పార్లమెంటుకున్న అధికారం లాంటిదే ఈ అధికారం. సాధారణంగా ఒక రాష్ట్రానికి, ఆ రాష్ట్ర ప్రభుత్వంకన్న ఎక్కువ రాబడివచ్చే దానిలోని ఒక పెద్దనగరానికి సంఘర్షణ వస్తుంది. రాష్ట్రశాసనసభ అనుమతి లేనిదే– ఆ నగరం దాని పాలకసంఘాన్ని మార్చడం, నగరంలో భూగర్భ రైలుమార్గాన్ని నడపాలా వద్దా అని నిర్ణయించడం వంటి పెద్ద పనులేవీ చేయడానికి వీలులేదు.

రాష్ట్రాన్ని నియోజక వర్గాలుగా విభజించేటప్పుడు నగరవాసులకన్నా రైతులకు ఎక్కువ స్థానాలు వచ్చేటట్లు విభజింపడానికి రాష్ట్ర శాసన సభలు ప్రయత్నిస్తూ ఉంటాయి. రాజకీయంగా బలం 'అనిశ్చితమైన' రాష్ట్రాలలో నగరపాలకసంఘం డెమోక్రాటిక్ పార్టీచేతిలోను రాష్ట్ర శాసన సభ రిపబ్లికన్ పార్టీ చేతిలోను ఉండడం కూడా కద్దు. గవర్నరు రాష్ట్ర పోలీసు దళానికి సైన్యాలకూ ఆధిపత్యం వహిస్తాడు. ఈ బలాలను ఇంకొక రాష్ట్రంపైకి పంపకూడదు. అంతరంగిక భద్రతకు మాత్రమే వినియోగించుకోవాలి. ఈసైన్యాలను అవసరమయితే ఫెడరల్ ప్రభుత్వం ఉపయోగించుకోవచ్చు. గవర్నరు భద్రత చేకూర్చలేకపోతే ఫెడరల్ ప్రభుత్వం సైన్యపు సహాయం కోరవచ్చు. గవర్నరు చేతిలో అన్నీకాకపోయినా కొన్ని శాసనాధికారాలు ఉంటాయి. ఫెడరల్ ప్రభుత్వంతో వ్యవహరించ వలసినవాడు అతడే. అతడే గవర్నరుల సమావేశాలకువెళ్ళి, తనతోటి గవర్నరులతో రాజకీయసమస్యలు చర్చిస్తాడు.గవర్నరుకు క్షమించేఅధికారం ఉంది; కాని అతడు క్షమాసంఘం (Perol or pardon board) వారి సలహాను అనుసరించవలసి ఉండడంవల్ల ఈ అధికారం ఒక్కొక్కప్పుడు పరిమితం కావచ్చును. అమెరికాఅధ్యక్షునివిషయంలోవలె కాకుండా, గవర్నరుక్రింద ఉండే కార్యనిర్వాహకోద్యోగులు తమ ఉద్యోగాలకై అతనిమీద ఆధారపడకుండా ప్రజలచేతనే ఎన్నుకొన బడుతారు. గవర్నరు వారసుడైన లెఫ్టినెంటు గవర్నరు గవర్నరుతో పేచీపడితే రాష్ట్రపాలనలో ప్రతిష్టంభన ఏర్పడడం కూడ తరుచు జరుగుతుంది.

కొన్ని రాష్ట్రాలలోని పాలనావిధానంలోని ఒక విచిత్ర విశేషం– రీకాల్ (Recall) అనేది. ఇది గవర్నరును, ఇతర ఉద్యోగులను తొలగించేందుకు ప్రత్యేకపుఎన్నికలు జరపాలని కోరడానికి ప్రజలకుగల హక్కు. తాము ఎన్నుకున్న ఉద్యోగులు పేచీపడుతూంటే వారి వివాదాలు తీర్చడానికి ఈ హక్కు ప్రజలకు సైద్ధాంతికంగా అవకాశం ఇస్తుంది. కాని నిజానికి ఇది వారి తగవులు తీర్చడంలో కన్న వారికి ఒక హెచ్చరికగా ఎక్కువ ఉపయోగ పడుతున్నది. గవర్నరుకు అధ్యక్షునికి మరొకతేడా– గవర్నరు పైపదవికి ఆశించగలగడం. తరుచు గవర్నర్లు అలాచేస్తారు. అమెరికా సెనేటులో ఖాళీవస్తే – అపుడు గవర్నరు తన పదవికి రాజీనామాయిచ్చి, లెఫ్టినెంటు గవర్నరుచేత తనను ఆ పదవికి నియమింపచేసుకోవచ్చు. కాని తరుచు అతడు ఆ పదవికి తన మిత్రులనో, ప్రతికక్షినో నియమిస్తాడు. ఈ నియామకాలు ఎల్లప్పుడూ అనాలోచితంగా జరిగేవి కావు. సెనేటుకు రాబోయే ఎన్నికలలో ఎవరు పోటీచేస్తారు? గవర్నరు సెనేటుకు పోటీచేయ దలచుకొన్నాడా లేక మళ్ళీ గవర్నరుగానే ఎన్నిక కాదలచుకొన్నాడా? ఇటువంటి అనేక విషయాలపై ఆ నియామకాలు ఆధారపడి ఉంటాయి. న్యూయార్క్, ఓహియోలవంటి కొన్ని ముఖ్య 'అనిశ్చిత' రాష్ట్రాలలో గవర్నరు తప్పకుండా వైట్‌హౌస్‌ను ఒకకంట కనిపెడుతూ ఉంటాడు. రాష్ట్రప్రభుత్వ కార్యాలయానికీ సెనేటుకీ మధ్య అతని పన్నుగడ లన్నీ– భవిష్యత్తులో తన పార్టీ జాతీయసమావేశంలో అతని ఆశలకు పూర్వరంగాలు కావచ్చు.

రాష్ట్రశాసనసభ అమెరికన్ రాజకీయాల్లో ఒక్కలేని బిడ్డలాంటిది. అది కాంగ్రెసు సభలాగ ప్రజలదృష్టి నంతటినీ ఆకర్షించగలంత ఆకర్షకం గానూ ఉండదు. నగర ప్రభుత్వాల లాగా స్థానిక సంస్కరణలు జేసి ప్రజలకు సన్నిహితంగానూ ఉండలేదు.

రాష్ట్రాలలోని ప్రజలు వాళ్ళ రాష్ట్రశాసనసభలను పని లేనప్పుడు సమావేశమయ్యే సభలలాగ చూస్తారు. సభ్యులంతా ప్రాపకంగల సామాన్యులు. వాళ్ళు ప్రతిసంవత్సరమో, రెండు సంవత్సరముల కొకసారో కొన్నివారాలు సమావేశమై రాష్ట్రవిషయాలు చర్చిస్తారు. అందుకనే వాళ్ళ జీతాలుకూడా– దినమంతా పనిచేస్తే ఇచ్చే జీతంలాగ కాకుండా– వాళ్లు వ్యయంచేసిన కాలాన్ని లెక్కచూచి ఇచ్చినట్లే ఉంటాయి. అందుచేత చాలా

మంది శాసనసభ్యులు వాళ్ళ ఊళ్ళలో చిన్న వ్యాపారాన్నో, ఉద్యోగాన్నో చేస్తూండడం ఆశ్చర్యకరమైన విషయంకాదు. ఒక్కొక్కప్పుడు శాసన సభ్యుడు చేసే వ్యక్తిగత వ్యాపారంవల్ల అతడు నిర్ణయించ వలసిన ప్రజా వ్యవహారంలో నిష్పక్షపాతంగా ఉండలేక పోవచ్చు.

ఉదాహరణకు ఒక రాష్ట్రంలో రెండవ ప్రపంచ సంగ్రామానికి ముందు రాష్ట్ర శాసన సభ్యులకు సంవత్సరానికి సుమారు 700 డాలర్ల (రు. 3500) లోపు జీతం ఇచ్చేవారు. ఆ రాష్ట్రంలోని పెద్దగనులపై యాజమాన్యం ఉన్న ఒక సంస్థప్రతినిధి– తమ సంస్థపై 'పృథక్కరణ పన్ను' (Severance tax) ఎవరూ విధించరని - ఆ రాష్ట్ర శాసన సభలోని సభ్యులలో అధిక సంఖ్యాకులు తమ సంస్థలో సంవత్సరానికి 5000 డాలర్ల జీతంపై న్యాయవాదులుగా పనిచేస్తూండడమే ఇందుకు కారణమని గొప్ప చెప్పుకు న్నాడట! చాలా రాష్ట్రాలలో పెద్దపెద్ద వ్యాపార సంస్థలతరఫున పనిచేసే 'అధిపతులు' అనేకులు ఉంటారు. చాల రకాల వ్యాపారానికి రాష్ట్రశాస నాలతో అవసరం ఉంది. ప్రభుత్వపు పనులు చేయదలచుకున్న కంట్రాక్ట ర్లకూ, జైల్లో పెట్టబడకుండా బయట ఉండదలచుకున్న జూదగాళ్ళకీ కూడా శాసనాలు చాల ముఖ్యం. శాసన సభలో కొందరిని చేతుల్లో పెట్టు కొనడం ద్వారా ఆ 'అధిపతి' తన కాతాదార్లను సంతృప్తి పరుస్తాడు. అతని సలహను త్రోసిపుచ్చే ఏ సభ్యుడైనా సరే వచ్చే ఎన్నికలో అతడు ఓడించ గలడనే గాఢ సమ్మకం అతని ప్రాబల్యానికి ఆధారం.

ఇక కొందరు శాసన సభ్యులు 'ఉపద్రవకర' మైన బిల్లులు ప్రవేశ పెట్టి డబ్బు సంపాదిస్తారు. ఒక సభ్యుడు సినిమాశాలలు అనుసరించవలసిన అగ్నిప్రమాద సంరక్షక విధానాలగురించి తీవ్రమైన శాసనంపెట్టవచ్చు. అప్పుడు సినిమాశాలల యజమానులు భయపడిపోయి ఆ సభ్యుడి దగ్గరకు పరుగెత్తుకొని వస్తారు. అతనితో వాదించి ఆ బిల్లును అతడు ఉపసంహ రించుకొనేట్లు చేయడానికి ఫలానా న్యాయవాదిని కుదుర్చుకో మని వారికి సలహా ఇవ్వబడుతుంది. చివరకు న్యాయవాది ఫీజు పేరుతో ఆ సభ్యుడికి కొంత లంచం ముట్టిన తరువాత ఆబిల్లు ఉపసంహరించుకో బడుతుంది.

ఈ విధంగా రాష్ట్రప్రభుత్వాలలో నైతిక ప్రమాణాలు తక్కువగా ఉండ టానికి వీటన్నిటిలో శ్రద్ధ తక్కువ ఉండడమే కారణం. ప్రజలు ఎన్నడూ

రాష్ట్రశాసనాల లోని క్లిష్టతను, వ్యాపారానికి దానికి ఉన్న సంబంధాలను అవగాహన చేసుకోడానికి ప్రయత్నించరు. పోనీ నమ్మకస్థులైన వ్యక్తులకు—ప్రత్యేక వ్యాపారమేమీ లేకుండా రాష్ట్రాలకు సేవచేయడానికి వలసినంత ప్రతిఫలం ఇవ్వడానికి ఇష్టపడరు. మంచి పార్టీ యంత్రాంగంద్వారా వోట్లన్నీ సేకరించుకొవడానికి నమ్మకస్థులైనవాడికి అవకాశం ఉండేటట్టు రాష్ట్రరాజకీయాల్లో రగినంత ఆసక్తినైనా చూపరు. కాని ఒక్కొక్కప్పుడు ఏదో పెద్ద పుకారుపుట్టి రాష్ట్రప్రజలంతా ఒక్కసారిగా సంస్కరణలు కావాలని గోల చేస్తారు.

రాష్ట్ర శాసనసభల యెడల ప్రజలకు నమ్మకం లేకపోబట్టి 1900 ప్రాంతంలో సుమారు 20 రాష్ట్రాల రాజ్యాంగాలలో ప్రవేశము, జన సమ్మతి (Initiative, referendum) అనే హక్కులు చేర్చబడ్డాయి. నూటికి 10 మంది వోటర్లు సంతకం పెట్టి ఒక చట్టాన్ని శాసనసభలో చర్చించమని పంపవచ్చు. శాసనసభ చర్చిస్తున్న ఏ శాసనాన్నైనాసరే వోటర్లలో అధిక సంఖ్యాకులు 'జనసమ్మతి' ద్వారా ఆపుచేయవచ్చు. నూటికి 10 మంది సంతకంపెట్టితే ప్రత్యేకమైన ఎన్నికలు వస్తాయి. అందులో శాసనసభ చేస్తున్న శాసనాన్ని తిరస్కరిస్తూనో అంగీకరిస్తూనో ప్రజలు నిర్ణయం చేయవచ్చును. ఈ విధమైన ప్రత్యక్ష ప్రజాస్వామ్యం చాలా బెడదతో కూడినదని తేలింది. ఈ విధానాలు 1900 లో తన్నిర్మాతలు ఆశించినంతగా ఉపయోగంలోకి రాలేదు. కాని శాసనసభ ప్రజలలో బాగా అపఖ్యాతి పాలైతే ప్రజలకు చేతిలో ఆయుధంగా ఇవి పనికివస్తాయి.

రాష్ట్ర శాసనసభలలో ప్రజలకు నమ్మకం లోపించడంవలన ఏర్పడిన మరొక ఫలితం- రాష్ట్ర రాజ్యాంగాలలోనే సామాన్య శాసనాలు కూడా చేర్చబడడం. ఇందువల్ల ప్రాథమిక న్యాయాన్ని మాత్రమే సూత్రప్రాయంగా నిర్వచించవలసిన రాజ్యాంగాలు సుదీర్ఘమై పోయినవి; చరమన్యాయపత్రములుగా- వాటికి ఉండవలసిన గౌరవం తగ్గిపోయింది.

ప్రజలలో ఆసక్తి, గౌరవం ఇంతగా లోపించినప్పటికీ రాష్ట్ర ప్రభుత్వాల వల్ల అమెరికన్ ప్రజలకు ఇంత రాజకీయాభివృద్ధి జరగడం విశేషం. నిపుణుడైన గవర్నరు ప్రజలకు కావలసింది ఇది అని చూపించినపుడూ, ప్రజలు తమ ఆసక్తిని ఒక లక్ష్యంవైపుకు కేంద్రీకరించినప్పుడూ ప్రజలు కోరింది తప్పకుండా జరిగి తీరుతుంది.

చాలా విషయాలలో రాష్ట్రాలు ముందడుగు వేశాయి. రైలుమార్గాలను క్రమబద్ధంచేయడం, ప్రజోపయోగకర కార్యాలూ, మద్య వ్యాపారం, ఇలాటి చాలావాటిల్లో అవి ముందుగా దారితీశాయి. స్త్రీల, పిల్లల, రక్షణకు- రాష్ట్రాలే మొదటి కార్మిక శాసనాలు చేశాయి. నగరాల పాలనలో నూతన విధానాలు అవలంబించి ఫలితాలు చూడడానికి అనుమతించాయి. ఇటీవల- రాష్ట్రశాసనసభలు తమ స్వంతని అభివృద్ధి చేసుకొనడంలో కూడా అన క్తిని కనపరుస్తున్నాయి. శాసన నిర్మాణ పరిశోధక వర్గాలనూ, శాసన రచనా కార్యాలయాలనూ, శాసన నిర్మాణ సమస్యలు చర్చించ డానికి అంత ర్రాష్ట్ర సంస్థలనూ రాష్ట్ర ప్రభుత్వాలు ఏర్పాటు చేస్తున్నాయి.

నిజానికి ఫెడరల్ ప్రభుత్వపు సాంఘిక సంక్షేమ శాసనా లన్నీ- రాష్ట్ర శాసనాల నుండి అభివృద్ధి పొందినవే. ఇలాగే- ఫెడరల్ రాజ్యాంగంలోని వాణిజ్య సూత్రంకూడా రాష్ట్రాలలో వ్యాపారాన్ని క్రమబద్ధం చేయడంలో వచ్చిన గందరగోళం ఫలితంగా ఉద్భవించినదే. ఫెడరల్ ప్రభుత్వపు సాంఘికరక్షణ శాసనాలుకూడా రాష్ట్ర శాసనాలనుండి పుట్టినవే - అనేక లక్షల మంది ఒకరాష్ట్రంనుండి మరొక రాష్ట్రానికి నిత్యమూ మారుతూ ఉంటారు. అలా పరరాష్ట్రానికి వీరు మారినా, మారని నిశ్చితమైన న్యాయసూత్రాలు వారికి వర్తింప చేయడమే ఈ శాసనాలు ఫెడరల్ ప్రభుత్వం చేయడం లో ఉద్దేశ్యం. అయినప్పటికీ కొత్తశాసనాలు ప్రయోగించి ఫలితాలు తెలుసు కొనడానికి పరిశోధనాగారాలుగా- రాష్ట్రాలు పనిచేస్తాయి. ఆ ప్రయోగం సత్ఫలితాలనిస్తే క్రమంగా ప్రజలంతా దానిని ఆమోదించడం జరిగి ఆ శాసనం ఫెడరల్ శాసనంగా రూపొందుతుంది.

రాష్ట్రాలలోని న్యాయస్థానాలు ఫెడరల్ కోర్టులవిధానం ప్రకారమే నిర్మించ బడ్డాయి. రాష్ట్రాలకు కూడా ఒక సుప్రీంకోర్టు ఉంటుంది. అది రాష్ట్రశాసనాలు రాష్ట్ర రాజ్యాంగాను గుణంగా ఉన్నాయో లేదో చూస్తుంది. రాష్ట్ర న్యాయస్థానాలు వివిధ వివాదాలను విచారిస్తూ- ప్రజలకు ఎక్కువ సన్నిహితంగా ఉంటాయి. ఫెడరల్ న్యాయస్థానాలు ఫెడరల్ రాజ్యాంగానికి సంబంధించిన వ్యవహారాలే చూస్తాయి. రాష్ట్ర న్యాయస్థానాలు అలాకాక, రాజ్యాంగం ప్రకారం ఫెడరల్ న్యాయస్థానానికి దత్తంచేయబడిన అధికారాలు మినహా మిగిలిన అన్నిరకాల శాసనాల విషయంలోను తీర్పులు ఇస్తాయి

రాష్ట్ర ధర్మశాస్త్రం కొంత రాష్ట్రరాజ్యాంగంలోను, కొంత రాష్ట్ర శాసనాల రూపంలోను ఉన్నది. కాని చాలాభాగం అమెరికనులు ఇంగ్లీషువారినుంచి వారసత్వంగా పొంది అమెరికను పరిస్థితులకు అనుగుణంగా మార్చుకొని వినియోగించుకొంటున్న ఇంగ్లండులోని ధర్మశాస్త్రమే! లూయిజియానా రాష్ట్రంలో ఎక్కువగా నెపోలియన్ స్మృతి నుండి గ్రహించిన ఫ్రెంచి ధర్మశాస్త్రం ఆచరణలో ఉన్నది.

సాధారణ ధర్మశాస్త్రంలో- బ్రిటిష్ కోర్టులతో సహా కోర్టులు ఇంతకు ముందు ఇచ్చిన తీర్పులు ప్రధానభాగం. శాసనసభ శాసనంచేసిన విషయాలలో తప్ప మిగతావాటిలో ఈ ధర్మశాస్త్రమే అమలులో ఉంటుంది. అమెరికన్ రాజ్యాంగంలో పౌరులందరికీ వాగ్దానం చేయబడిన 'క్రమవిధానం' (due process) అంటే ఇంచుమించు "సాధారణ ధర్మశాస్త్రాన్ని అమలు జరుపడం" అని అర్థం.

ఉదాహరణకు - 1876 లో గిడ్డంగులను ప్రభుత్వాధీనం చేస్తూ ఇల్లినాయిస్ రాష్ట్రంలో చేయబడిన ఒక శాసనాన్ని ఇల్లినాయిస్ కోర్టువారు ఆమోదించగా- న్యాయవిరుద్ధంగా ఆస్తిని స్వాధీనం చేసికొన్నందుకు- సుప్రీంకోర్టు దాకా ఆ విషయం తీసుకువెళ్ళారు. గిడ్డంగులు ప్రజాప్రయోజనాలతో సంబంధించినవి కాబట్టి వాటివిషయమై అట్టి శాసనం చేయవచ్చునని ఆ కోర్టు తీర్పునిచ్చింది. దీనికి ఇంగ్లీషు సాధారణ ధర్మశాస్త్రమే కోర్టుకు ఆధారం. రాజ్యాంగబలంపై వ్యవహరిస్తున్న ఫెడరల్ ప్రభుత్వం కూడా- శాసనాలద్వారా గాని, రాజ్యాంగపుసవరణల ద్వారాగాని మార్పు జరగని విషయాలలో ఈ సాధారణ ధర్మాన్నే ప్రయోగిస్తుంది.

ఫెడరల్ కోర్టులకున్న రాష్ట్ర న్యాయస్థానాలు తరుచుగా 'ప్రాకృతిక ధర్మం' (equity) ఆధారంతో వివాదాలను విచారిస్తాయి. వివిధ వారసుల మధ్య వారి ఆస్తిని సమానంగా పంచడంవంటి సివిల్ వివాదాలకే వర్తించే కొన్ని సూత్రాల సంపుటి-ఈ 'ప్రాకృతికధర్మం'. న్యాయమైన కారణం ఏమీ లేకుండా ఇంకొకనికి కష్టం కలిగించే పనులు-శాసనానుగుణమైన పనులైనాసరే-ఎవరైనాచేస్తుంటే, వెంటనే న్యాయాధిపతులు ఇంజక్షన్ ఉత్తర్వులు ఇచ్చి అతనిచర్యను నిరోధించడానికి ఈ 'ప్రాకృతికధర్మ'మే సహాయ పడుతోంది.

కొన్ని అసాధారణ పరిస్థితులలో న్యాయం చెయ్యడానికి వీలులేకుండా ఉన్నందువల్ల సాధారణ ధర్మాన్ని వదలి- యీ 'ప్రాకృతికధర్మ'మునే ఇంగ్లండు ప్రజలు ఎక్కువగా ఆశ్రయించారు. ఈ ధర్మమే రాజుగారి మనే భావాన్ని ప్రతిబింబించేది. న్యాయస్థానంలో అన్యాయం ఏదైనా జరిగితే ఆయన తన ప్రత్యేకాధికారాలతో దానిని సవరించేవాడు. ఛాన్సెలర్ ఈ 'రాజ మనోభావాన్ని' ప్రకటించేవాడు. ఛాన్సరీ న్యాయస్థానం చర్చి న్యాయాన్ని, రోమన్ న్యాయాన్ని కలిపి విలక్షణమైన నూతన న్యాయసూత్రాలను తయారు చేసుకుంది.

ఛార్లెస్ డికెన్స్ నవలలు చదివినవారికి తెలిసినట్టుగా - ఇంగ్లండులో ఛాన్సెరీ న్యాయస్థానం – శాస్త్రబద్ధమైన విధానపు గందరగోళంలో పడబట్టి, చివరకు ఎప్పటికీగాని పెద్దపెద్ద అక్కులసంపకం పరిష్కారం అయ్యేది కాదు. అమెరికాలో యీ "ప్రాకృతికధర్మా"నికి సంబంధించిన వారసత్వపు సూత్రాలు శాసనబద్ధం చెయ్యబడ్డాయి. కొన్నిరాష్ట్రాలలో ఇటువంటి వివాదాలు విచారించేందుకు ప్రత్యేక ఛాన్సెరీ న్యాయస్థానాలుంటాయి.కాని చాలా రాష్ట్రాలలో ఫెడరల్ కోర్టులు, రాష్ట్ర న్యాయస్థానాలు కూడా మామూలు న్యాయ వివాదాలతోపాటు ఈ 'ప్రాకృతికధర్మా'నికి సంబంధించిన వివాదాలనుకూడా విచారిస్తాయి. చాలా రాష్ట్రాలలో మేజస్ట్రేటుకోర్టులో, లేక పోలీసు కోర్టులో మొట్టమొదటి కోర్టులు. ఈకోర్టులలో తాగినవారికి ముప్ఫైరోజులు జైలుశిక్షవేయడం, ఎక్కువ వేగంతో వెళ్ళినందుకు మోటారు డ్రైవరుకు జరిమానా వెయ్యడం లాంటి పనులు చేస్తారు.ఈ కేసులకు జూరీతో పనిలేదు. ఒక్కొక్కప్పుడు ఈ కోర్టులకు హత్యానేరం చేసిన వారిని పెద్ద కోర్టులో విచారించాలో వద్దో నిశ్చయించే అధికారం కూడా ఉంటుంది.

మేజస్ట్రేటు కోర్టుకు పైన సమగ్ర విచారణ జరిపే కోర్టులు (Trial Courts) ఉన్నాయి. ఇవి జ్యూరీతో అవసరం ఉన్నంత ప్రాముఖ్యంగల పెద్ద వివాదాలను విచారిస్తాయి.

మేజస్ట్రేటు కోర్టుల్లో నీచమైన అవినీతి ప్రబలి ఉంటుంది. తరుచు అక్కడ న్యాయాధిపతి తనకుగల న్యాయశాస్త్ర ప్రావీణ్యంవల్ల గాక, రాజకీయ ప్రాపక బలంవల్ల ఆ ఉద్యోగం సంపాదించినవారై ఉంటారు. కాని పెద్ద కోర్టుల్లో మాత్రం ఇలాటి అవినీతి చాలా తక్కువ.

చాలా రాష్ట్రాల్లో, పెద్ద కోర్టులకు న్యాయాధిపతులను పరిమిత కాలాని కొకసారి ప్రజలు ఎన్నుకుంటారు. కాని, ఈ పద్ధతివల్ల న్యాయాధిపతిగా ఎన్నుకొనబడవలసినవాడు రాజకీయ వాతావరణాను గుణంగా వ్యవహరించ వలసిఉంటుంది. అందుకనే - న్యాయవాదులకు - ఈ ఎన్నిక పద్ధతి అంగీకారం కాదు. న్యాయవాదుల సంఘాలు వారి దృష్టిలో మంచివారు న్యాయాధిపతులుగా ఎన్నుకోబడడానికి వీలుగా అభ్యర్థుల ప్రతిపాదనల విషయంలో జోక్యం కలిగించుకుంటాయి. కార్మిక సంఘాలు, రైతు సంఘాలు తమకు మంచి న్యాయాధిపతులు రావడానికోసం ఎన్నికలు ఉండాలని కోరతాయి. లేకపోతే గవర్నరు పెద్ద వ్యాపారస్థులకు అనుకూలంగా ఉండేవారిని న్యాయాధిపతులుగా నియమిస్తాడేమో నని వారి భయం. ఈ విధంగా అమెరికను ప్రజల వివాదాలలో ఎక్కువ భాగాన్ని విచారించే రాష్ట్రాల న్యాయస్థానాలు రాష్ట్రంలోని రాజకీయ వాతావరణానికి అనుగుణంగా ఉండవలసి వచ్చింది. అందుచేత వాటిద్వారా, ఎన్నికదారులైన ప్రజలు కావాలని కోరినంతపాటి న్యాయమూ, ధర్మమే లభ్యమవుతాయి సావకాశాన్ని బట్టి కాక, రాజకీయ కారణాలవల్ల ఉద్యోగాలకు వచ్చినవాళ్ళు ఫెడరల్ పరిపాలనాంగాలలోకంటే రాష్ట్ర ప్రభుత్వ శాఖలలో ఎక్కువమంది ఉంటారు. రాష్ట్రశాసనసభలవలెనే రాష్ట్రఉద్యోగివర్గంకూడా - ప్రజలయొనాసక్తి వల్ల పాడయింది. కాని అంతమాత్రాన పురోగమనంవైపు, అభివృద్ధివైపు నడిపించే శక్తులు మాత్రం కొరవడలేదు.

ఉద్యోగాలలో నిపుణులు కావలసిన శాఖలు—అంటే ఆరోగ్యరక్షణశాఖ, ఇంజనీరింగ్ శాఖల వంటివి — ఎక్కువకావడంవల్ల, సామాన్య రాజకీయ వేత్త అలాటిశాఖల్లో అధికారంలో ఉన్న వాళ్ళపై విమర్శలు చేయలేదు. అప్పుడు ఆ ఉద్యోగాలలో రాజకీయవాదుల ప్రమేయం తగ్గి సమర్థులకే ఉద్యోగాలిచ్చే పద్ధతి వస్తుంది. ఇది కొంత అభివృద్ధికి కారణం.

రెండవది ఫెడరల్ ప్రభుత్వసహాయం. ఫెడరల్ ప్రభుత్వం రాష్ట్రాలకు యిచ్చే ధనాన్ని వ్యయం చేయవలసిన రాష్ట్రోద్యోగులు దానిని దుర్వ్యయం చేయవచ్చు — తినివేయవచ్చు. ఇటువంటిపని కొన్నాళ్ళపాటు జరిగేనరికల్లా ప్రజలలో ఆందోళన బయలుదేరుతుంది. అప్పుడు వాషింగ్టన్‌లో కూర్చున్న ప్రభుత్వవర్గంవారు రాష్ట్రాలలో ధనసహాయం వ్యయమవుతున్న

పన్నులను మితిమించి ఎక్కువ చేయడానికి ఏమాత్రం ప్రయత్నించినా ప్రక్క రాష్ట్రంలో వస్తువులు చవకగా దొరికితే వ్యాపారం అంతా సరిహద్దు దాటి అటుపోతుంది.

రాష్ట్ర ఆదాయానికి ఇన్ని పరిమితు లుండబట్టి రాష్ట్రాల బాధ్యతలు కూడా పరిమితంగానే ఉంటాయి. రాష్ట్రాలు తమ బరువును కొంత ఫెడరల్ ప్రభుత్వంపై పడవేసేందుకు యత్నిస్తాయి. రాష్ట్రాలలో రోడ్లకు, స్కూళ్ళకు ఫెడరల్ ప్రభుత్వసహాయం ఇవ్వడం అమెరికన్ సంప్రదాయాలలో ఒకటైపోయింది. 1933 నుండి నిరుద్యోగులకు సహాయం వంటి రాష్ట్రప్రభుత్వ బాధ్యతలు ఫెడరల్ సాంఘిక సంక్షేమ శాఖవారు వహించారు. క్లిష్టసమయాల్లో ప్రజోపయోగ కార్యక్రమాలకు ఫెడరల్ ప్రభుత్వం సహాయం చేయాలనే భావం యిప్పుడు సర్వత్ర అంగీకరించారు.

రాష్ట్రాలకు ఫెడరల్ సహాయం రెండు ఆర్థికకారణాలపై ఆధారపడి ఉంది. ఒకటి : రాష్ట్రాలకన్నా ఫెడరల్ ప్రభుత్వానికి పన్నులు వసూలు చేసే బలం ఎక్కువ. ఎందుకంటే – అమెరికా నుండి వెళ్ళిపోతే తప్ప ఎవరూ ఫెడరల్ ప్రభుత్వం బారినుండి తప్పించుకోలేరు కాబట్టి. రెండవది : ఫెడరల్ ప్రభుత్వంద్వారా అన్నిరాష్ట్రాలకూ సమానత్వం సాధించడం దేశానికి శ్రేయస్కరం. సహజంగా పేద రాష్ట్రాలలోని వ్యాపారం మూలంగా ధనవంతమైన రాష్ట్రాలలోని పెట్టుబడివాళ్లు ఎక్కువ డబ్బు సంపాదిస్తారు. ఫెడరల్ ప్రభుత్వం ఆ డబ్బున్న రాష్ట్రాల నుండి పన్నులు వసూలుచేసి పేదరాష్ట్రాలలో ఖర్చుపెడితే అప్పుడు తేడా సరిపోతుంది; వ్యాపారం జరుగుతూనూ ఉంటుంది. "రాష్ట్రాల స్వయంసమృద్ధి" అనే సిద్ధాంతం కన్న "రాష్ట్రాలసమానత్వం" అన్నది మంచి సిద్ధాంతం. ఈవిధంగానే ఒక రాష్ట్రంలోని ధనిక భాగాన్ని, నిర్ధనిక భాగాన్ని సమానం చేయడం రాష్ట్ర ప్రభుత్వపు బాధ్యత. రాష్ట్రంలోని నగరాలకు ప్లాంటేషన్లతో వర్తకం మూలంగా యెక్కువ లాభాలు వస్తాయి. ఎవరి జోక్యమూ లేకుండా ప్లాంటేషన్ల ధనమంతా నగరాల్లోని బ్యాంకులలోకి, ఇన్సూరెన్సు కంపెనీలలోకి, పెట్టుబడిదారులదగ్గరకి వచ్చేస్తుంది. 1933కు ముందు ఇలాగే జరుగుతుండేది. ఇది దేశ సౌభాగ్యానికి మంచిదికాదు. ప్రైవేటు వ్యాపారంవల్ల వచ్చే అస్థిరత్వం వలని దుష్ఫలితాలను అరికట్టడానికి పేద ప్రాంతాలకు సహాయం అవసరం. ఈ సహాయం సామాన్యంగా రోడ్లు వేయించడం,

స్కూళ్ళకు, లైబ్రరీలకు, స్థానిక సంక్షేమ నిధులకు సహాయం చేయడం మొదలైన పనుల రూపంలో ఉంటుంది. ఈ విధమైన సమానత్వం అవసరం కాబట్టి, ఫెడరల్ ప్రభుత్వం పన్నులు వసూలుచేసే శక్తి ఎక్కువ అయింది. అందువల్ల రాష్ట్రాలు కేంద్రంవైపు సహాయంకోసం చూడడం, ఆ ప్రభుత్వం సహాయం చేయడం జరిగింది.

కాని ఈ పరిస్థితి అమెరికా ప్రజలకు ఇష్టంకాదు. ఇందువల్ల మేలుకు తోడుగా, కేంద్రప్రభుత్వంలో ఉద్యోగివర్గబలం విపరీతంగా పెరిగిపోవడం, దానికి ప్రాంతీయ స్థానిక కార్యాలయాలు ఏర్పడడం, రాష్ట్రాల బాధ్యతా గౌరవాలు తగ్గడం జరుగుతుంది. ఫెడరల్ సహాయాన్ని ఆపుచేసే మార్గాల కోసం ఉభయ రాజకీయపక్షాల ప్రతినిధులూ అసక్తిని ప్రకటించారు. 1952లో ప్రచారోద్యమంలో గవర్నరు స్టీవెన్సన్ సాధ్యమైనంతవరకూ వాషింగ్టన్నుండి రాష్ట్రాలకు, అచటినుండి స్థానిక ప్రభుత్వాలకు, అధికార వికేంద్రీకరణ చెయ్యవలసిన అవసరాన్ని నొక్కిచెప్పాడు. 1953లో అధ్యక్షుడు ఐసెన్హోవరు ఫెడరల్, రాష్ట్ర ఆదాయాలను రాష్ట్రాలలో రాజకీయ సామర్థ్యం పెంపొందించే అభిప్రాయందృష్ట్యా పరిశీలించమని ఆజ్ఞాపించాడు.

రాష్ట్రాల గౌరవం, బాధ్యత పెంపొందించేందుకు చాలా మార్గాలు సూచించబడ్డాయి. రాష్ట్రాల ఎక్కువ ఆదాయాన్ని పొందే గ్యాసొలిన్పన్ను వంటి కొన్ని పన్నులను ఫెడరల్ ప్రభుత్వం విధించనూడదని ఒకసూచన. రాష్ట్రాలు తమ పౌరులపై విధించని కొన్ని పన్నులను ఫెడరల్ ప్రభుత్వం విధించవచ్చును కాని, రాష్ట్రాలు విధిస్తున్న పన్నులే విధించడం మానాలని మరొక సూచన. రాష్ట్రాలను ఫెడరల్ సాంఘిక రక్షణ విధానంతో సహకరింప చేయడానికి ఈ పద్ధతి ఉపయోగించపడింది. ఆదాయపుపన్ను విషయంలో కూడా ఈపద్ధతి ఉపయోగింపబడాలని సూచించారు. ఇతర రాష్ట్రాలవారు ఒక రాష్ట్రంలోకి వెళ్ళే వ్యాపారస్థులకు ధనికులకు లాభసాటి షరతులు చూపించి పోటీపడకుండా ఉంటే రాష్ట్రాలఆదాయం పెరుగుతుంది.

సహజంగా కేంద్రీకరణవైపు లాగుతున్న శక్తులను రాజకీయంగా వీలైనంతవరకూ కృత్రిమ విధానాలవల్ల దుర్బలంచేస్తారు. అమెరికన్ ప్రజలు తమరాష్ట్ర ప్రభుత్వాల విషయంలో తరుచు అలక్ష్యం చేసినా, ఆ ప్రభుత్వాలు ప్రమాదంలో ఉన్నప్పుడు వాటి రక్షణకు వస్తారు.

# స్థానిక ప్రభుత్వం

అమెరికా ప్రజలలో సగంకన్నా ఎక్కువమంది నగరాలలో నివసిస్తున్నారు. అందులో ఒకవంద నగరాలు ఒక్కొక్కటి లక్షమందికన్నా ఎక్కువ జనాభా కలవి. మిగిలిన అమెరికన్ ప్రజలకు స్థానిక పరిపాలనా సౌకర్యం — ముఖ్యంగా కౌంటీలద్వారా కలుగుతుంది. ఇవికాక పాఠశాలల కోసం, పారిశుద్ధ్యం కోసం, ఇతర పనులకోసం ప్రత్యేకమైన జిల్లాలున్నాయి. ఒక్కొక్కపౌరుడు అనేక ప్రభుత్వ వర్గాలకు అంటే—ఫెడరల్ ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వానికి, నగర ప్రభుత్వానికి, కౌంటీ ప్రభుత్వానికి రెండు రకాల జిల్లాలకూ—పన్నులు చెల్లించడం కద్దు.

థామస్ జెఫర్సన్ నగరాలను లంచగొండితనానికి నివాసస్థానాలని — అసహ్యించుకొన్నాడు. నిజంగానే 19వ శతాబ్దంలో నగరాల్లో రాజకీయరంగం విపరీతంగా లంచగొండితనంతో నిండి ఉండేది. యూరపునుండి, అమెరికన్ పల్లెపట్టులనుండి నగరాలకు వచ్చే కొత్తజనం అక్కడి రాజకీయ యంత్రాంగానికి తేలికగా చిక్కుతూండడమే ఇందుకు ముఖ్యకారణం. 20వ శతాబ్దారంభం నుండీ నగర ప్రభుత్వాలలో కొంత మంచితనం, సామర్థ్యం పెంపొందాయి. ఇటీవలి సంవత్సరాలలో ఈ అభివృద్ధికి ఒక కారణం ఇంతకు ముందు రాజకీయ 'అధిపతుల'పై, వారి దయాధర్మాలపై ఆధారపడి ఉన్న కార్మికుల జీవన ప్రమాణాలు అభివృద్ధి కావడం. నగరాలలో ప్రభుత్వం క్రొత్త, సమర్థతర విధానాలు అనుసరించడం మరొక కారణం.

నగరాలకు స్వయంగా సర్వస్వాధికారాలులేవు. కాని పౌరులకు కావలసినట్టి అధికారాలను రాష్ట్ర ప్రభుత్వం నుండి అవి పొందుతాయి. నగరప్రభుత్వాలకు మూడురూపాలున్నాయి. ఒకటి—మేయరు, కౌన్సిలూ ఉన్న పాతపద్ధతి ప్రభుత్వం. ఇది యిప్పటికీ చాలానగరాల్లో అమలులో ఉన్నది. కమిషన్ ఉండేపద్ధతి ప్రభుత్వాన్ని 1901 లో టెక్సాస్‌లోని గాల్వెస్టన్ నగరంలో పెద్ద వరదలు వచ్చినపుడు అత్యవసరంగా పనులు నెరవేర్చడానికి ఏర్పాటు చేశారు. అప్పటినుండి ఆ రకం ప్రభుత్వం చాలా పేరుపొందింది, 15 ఏళ్ళపాటు మధ్యరకం నగరాలలో చాలా వ్యాప్తిపొందింది. కాని తరువాత అది అంతగా వ్యాపించలేదు. ప్రస్తుతం కౌన్సిలు మేనేజర్ లేక సిటీ

మేనేజరు పద్ధతి ఎక్కువ వ్యాప్తిలో ఉంది. ఇది ఇప్పుడు రమారమి 900 మధ్యరకం నగరాలలో పనిచేస్తోంది.

పురపాలకసంఘం, అధ్యక్షుడూ ఉండే పాత పద్ధతి ప్రభుత్వాలలో పుర పాలక సంఘ సభ్యులు (ఎల్డర్‌మెన్) అంతా స్థానిక రాజకీయ ప్రముఖులు. వారు రాజకీయ సేవకు ప్రతిఫలంగా తమవారికి నగరాలలోని ఉద్యోగాలు ఇచ్చేవారు. నగరాలలో రాజకీయవాదులకు ఈరకం ప్రభుత్వాలు చాల అనుకూలంగా ఉంది. కొత్తరకం ప్రభుత్వానికి వాళ్ళు అంగీకరించే వాళ్ళు కారు. అయినా కాలక్రమేణా యీ విధానంలోనే అభివృద్ధికరమైన మార్పులు ప్రవేశపెట్టబడ్డాయి.

చాలా పురపాలక సంఘాలలో పూర్వం రెండు సభలు ఉండేవి. ఇప్పుడు వాటిని ఒక సభచేసి వాటిలో సభ్యులసంఖ్య గూడా తగ్గించారు పురపాలక సంఘాల బాధ్యతలు ఎక్కువై,ఎక్కువమంది సుశిక్షిత ఉద్యోగుల అవసరం కలుగుతూన్నకొలదీ, పురపాలన క్రొత్తపద్ధతులలో రూపొందింపబడు తూంది. చాలా నగరాలలో పురపాలక సంఘాధ్యక్షుని (మేయరు) అధికా రాలు ఎక్కువచేసి, అతనికి పరిపాలనలో ఎక్కువ బాధ్యతలు అప్ప చెప్పారు. ఇందువల్ల ఈ పద్ధతి సిటీమేనేజరుపద్ధతిగా మారకపోయినా దానికి కొంచెం అనుకూలంగా తయారయింది.

పరిపాలనా బాధ్యత నంతటిని కొద్దిమంది ప్రముఖులైనవ్యక్తులకు అప్ప చెప్పేందుకు అనువుగా 'కమిషన్' పద్ధతి తయారయింది. మామూలుగా కమిషన్‌లో ఐదుగురు సభ్యులుంటారు. అందులో ఒకరు అధ్యక్షుడుగా ఎన్నుకోబడతారు. అతడిని మేయరు అంటారు. కమిషన్ అనుసరించే విధానాల్ని సభ్యులంతా నిశ్చయిస్తారు.ఒక్కొక్కశాఖకు ఒక్కొక్క సభ్యుడు అధిపతిగా ఉంటారు. (ఇది ఇంచుమించు సమిష్టి బాధ్యతగల మంత్రి వర్గంలా ఉంటుంది.) కాని యిందులో సభ్యులమధ్య విభేదాలు వచ్చి ప్రతి ష్టంభన ఏర్పడితే, అది పరిష్కారమయ్యే మార్గం లేదు.

ఇదే ఇందులో ప్రధాన దౌర్బల్యం. 1908 లో వర్జీనియాలోని స్టాంటన్ నగరంలో ప్రవేశపెట్టబడిన మేనేజర్ పద్ధతిలో విధాన నిర్ణయాధికారము, ఆజ్ఞలనిచ్చే అధికారము కౌన్సిలువారికే ఉండినా, పరిపాలనాధికారం మాత్రం ఒక నిర్వాహకుని (మేనేజరు) చేతిలో ఉంటుంది.అతనిని కౌన్సిలు

లువారే జీతంయిస్తారు. అతడు ఇంకొకనగరం వాడై ఉండవచ్చు. అతడు సమర్థుడైతే– అంతకన్నా మంచి ఉద్యోగాలకు పోవచ్చు. కాని అతడు మాత్రం– పరిపాలనలో మంచి ఫలితాలకోసం సమర్థులనే ఉద్యోగాలకు నియమిస్తాడు.

నగర ప్రభుత్వం చేయాలని ప్రజలు కోరే పని– వ్యాపారసంస్థలు చేసే పనిలాంటిదేనని. అంటే వీలున్నంత తక్కువ ఖర్చుతో మంచిరకం ఉద్యోగులతో మంచిసేవ చేయడమేననే అభిప్రాయం కౌన్సిలు – మేనేజరు పద్ధతి ప్రభుత్వానికి ప్రాతిపదిక, ప్రజలుకూడా–నగరంలో ఒక మేనేజరు, కొంతమంది డైరెక్టర్లు ఉన్న కార్పొరేషనును – ఇంచుమించు వ్యాపారసంస్థలాంటి దానిని–ఏర్పాటు చేయాలని భావిస్తున్నారు. అలాటి సంస్థలో ప్రజలే వాటాదార్లుగా ఉంటారు.

ప్రజలు కావాలనుకోవాలే గాని– ఒక జాతి పరిపాలనకన్నా, ఒక నగర పరిపాలన రాజకీయాలతో అట్టే సంబంధంలేకుండా సాగుతుంది. ఎందుకంటే– రాజకీయ భేదాలచేతనే పరిష్కరించ బడవలసిన సమస్యలేవీ నగర పాలనలో లేవు. ఉదాహరణకు నగరానికి విదేశ వ్యవహారాలు లేవు. కేంద్ర ప్రభుత్వం తీర్చవలసిన ఆర్థికమాంద్యం, ద్రవ్యోల్బణంవంటి ప్రాథమిక ఆర్థికసమస్యలే ఉండవు. కాని పౌరులందరిచేత ఎను కొనబడి అధిక సంఖ్యాకుల ప్రయోజనాలే చూస్తే యీ కౌన్సిలు–మేనేజరు పద్ధతిలో అల్ప సంఖ్యాక వర్గాలవారికి లాభం ఏమి ఉండదు కాబట్టి–వారు మాత్రం యీ పద్ధతిని తీవ్రంగావిమర్శించారు. నిష్పత్తిక ప్రాతినిధ్యం ఏర్పాటుచేసి– పౌరులలో ఉండే రాజకీయ విభేదాలను గుర్తించాలని చాల నగరాలవారు సూచించారు. ఈ పద్ధతి ప్రకారం ఐదింట ఒకవంతు ఓట్లువచ్చిన వర్గం– అసలుసీట్లులేకుండా పోకుండా-ఐదింటఒకవంతు సీట్లు పొందుతుంది.కానిఈ విధానంవల్ల దేశంలో కుక్క గొడుగు పక్షాలు చాలా ఏర్పడి – ద్విపక్ష విధానానికి దెబ్బ తగులుతుంది కాబట్టి దానిని అంగీకరించలేము. అందుచేత నగరాల్లోనూ కూడా నిష్పత్తిక ప్రాతినిధ్యం ప్రవేశపెట్టడానికి అభ్యంతరం వచ్చింది.

నగరాలలోని ప్రజలకు పూర్వంకన్న ఇపుడు ఎక్కువ సౌకర్యాలు అవసరమయినాయి. జార్జి వాషింగ్టన్ రోజుల్లో అక్కరలేని నగర పారిశుద్ధ్య

విధానాలు ఇప్పుడు జనాభా పెరగడంతో బోలెడు డబ్బు ఖర్చుపెట్టి అనుస రించవలసి వస్తోంది. ప్రజలకు ఉపయోగకరమైన పనులు, అగ్నినిరోధక విధానాలు, స్కూళ్ళు, గ్రంథాలయాలు, రక్షకభటులు అన్నీ యిప్పుడు కావాలి. ఇందువల్ల నగరాలలో ప్రభుత్వాల పని నగర పాలక సంఘాలకు వచ్చే ఆదాయాన్ని మించి పెరిగిపోయింది.

నగరాలకు ఎక్కువ ఆదాయం—పెద్ద ఆస్తులపై పన్నులవల్ల అమ్మకపు పన్నులవల్ల, వస్తకంపై ప్రత్యేకపు పన్నులవల్ల వస్తుంది. కాని పెద్ద ఆస్తులపై పన్నూ అమ్మకపు పన్నూ కూడా వ్యాపారం మీద పడేవే. అందుచేత నగరాలు ఏమాత్రం పరిమితి దాటి పన్నులు ఎక్కువ చేసినా — వ్యాపారం నగర సరిహద్దులు దాటిపోతుంది.

నగరాలు సంపాదించే ఆదాయానికి అవి చేయవలసిన వ్యయానికి మధ్య ఇంత అంతరం ఉండబట్టి—నగరాలు పై ప్రభుత్వ సహాయంమీద ఆధార పడి ఉండవలసి వస్తోంది. కాని రాష్ట్రప్రభుత్వాలు వ్యవసాయదారుల వోట్ల మీద ఆధారపడి ఉండబట్టి, అవి నగరాలపై పన్నులు వేసి పల్లెటూళ్ళలో ఖర్చుపెట్టి, 'సమమట్టంచేసే విధానాన్ని' అనుసరిస్తుంటాయి. కాబట్టి నగరప్రభుత్వాలు ఫెడరల్ ప్రభుత్వ సహాయంకోసం ఎదురుచూడక తప్పదు.

**1953** లో న్యూయార్కు రాష్ట్ర గవర్నరుకూ, న్యూయార్కు నగరపు మేయరుకూ మధ్య — రాష్ట్రం నుండి నగరం పొందవలసిన సహాయంగా ముట్టే మొత్తంపై — తగాదా వచ్చింది. రాష్ట్రం తనకు పన్నులవల్ల వచ్చే ఆదాయంలో నూటికి 55 వంతులు స్థానిక ప్రభుత్వాల సహాయార్థం ఉప యోగిస్తున్నదట. రాష్ట్రంనుండి న్యూయార్కు నగరంపొందే సహాయం దాని బడ్జెట్‌లో నూటికి 15 వంతులును వచ్చింది. మేయరు ఆరోపణ: రాష్ట్రాలు సహాయ నిధులను పంచిపెట్టడానికి అనుసరించే సూత్రాలు పక్షపాతంతో కూడినవి; అందువల్ల చిన్నయూనిట్లకు అన్యాయం జరుగుతున్నది—అని.

నగరాలలోనే ఎక్కువ ధనం కూడుతూంటుంది కాబట్టి నగరాలు ఫెడ రల్ ప్రభుత్వానికి సహాయం కోసం "సమమట్టం చేసే సూత్రాన్ని" ఆధారం చేసుకొని అర్థించలేవు. అవి పన్నులు విధించే శక్తిలో అంతరాన్ని ఆధారం చేసుకుంటాయి. పెద్ద వ్యాపారసంస్థలపై ఎక్కువ పన్నులు వేస్తే అవి నగ

రంలోని ఆఫీసులు తప్పించుకు పోతాయి కాబట్టి వాటిపై ఎక్కువ పన్నులు వేయడానికి వీలులేదు. కాని ఫెడరల్ ప్రభుత్వం వాటిపై పెద్దపన్నులు విధించి తత్ఫలితంగా వచ్చే రాబడిలో కొంత నగరాలకు ఇవ్వవచ్చు. ఫెడరల్ ప్రభుత్వాలు చేసే పని యిదే !

ఇందువల్లనే–1930 నాటి ఆర్థిక మహామాంద్యంలో సహాయపు బరువుతో నగరాలు కృంగిపోయిన నాటినుంచి నగర ప్రభుత్వాలు తమ రాష్ట్ర ప్రభుత్వాన్ని క్రూరురాలైన సవతితల్లిలాగ, ఫెడరల్ ప్రభుత్వాన్ని ఆప్యాయతగల పినతండ్రిలాగ చూడడం అలవాటైంది.

నగరాలలో చాలా ఉద్యోగశాఖలలో కొత్త ఉద్యోగులు న్యాయనీయమైన విశ్వాస సామర్థ్యాలు చూపుతూంటే నగరాలలో పోలీసులు ఇంకా వెనుకబడి ఉన్నారు. సామర్థ్యంపై ఉద్యోగాలు ఇచ్చేపద్ధతి కనిపెట్టకముందునుంచి పోలీస్ శాఖలో ఉద్యోగాలు రాజకీయ కారణాలపై ఇవ్వడం ఆచారమై పోయింది. వాళ్ళకి సుసంఘటితంగా నేరాలు చేసేవాళ్ళతో ప్రత్యక్ష సంబంధాలుంటాయి. వాళ్ళని పట్టుకోకుండా రక్షిస్తున్నందుకు నేరస్థులు బాగా ఎక్కువడబ్బు ఇస్తారు. ఈ పోలీసులకి జీతం చాలా తక్కువ. పైగా వీళ్ళని 'మంచి' వాళ్ళు అనుమానంతో, ఏహ్యభావంతో చూస్తారు. 1950–51 లో అమెరికన్ సెనేటర్ ఎస్టెస్ కెఫావర్ అధ్యక్షతను ఏర్పడిన పరిశీలకసంఘం-రాష్ట్రాలలో జరుగుతున్న నేరాలను పరిశీలించి చాలాదొంగలగుంపులు రాష్ట్ర పోలీసులకు డబ్బు యిస్తూన్నట్లు బలమైన సాక్ష్యం ఉన్నదన్నారు. నేరాలను పట్టుకోవడంలో సాంకేతిక పరిజ్ఞానం ఉన్నవారి అవసరం పెరుగుతున్న కొద్దీ పోలీసులయెడల ప్రజల ఆసక్తి, శ్రద్ధ ఎక్కువవుతూంటాయి. కాబట్టి ఇతర ఉద్యోగులవలెనే పోలీసులు కూడా త్వరలో అభివృద్ధిపొందుతారని ఆశించవచ్చు. నగరాలలో నివసించని కోట్ల అమెరికనులకు ప్రధానమైన సన్నిహిత ప్రభుత్వం–కౌంటీప్రభుత్వం. ఈ ప్రభుత్వం వలసరోజుల నుండి యిప్పటివరకు యించుమించు ఏ మార్పూ లేకుండా వచ్చింది. కౌంటీ ప్రభుత్వంలో 10 మందికన్నా తక్కువ సభ్యులుగల ఒక సంఘం ఉంటుంది. దానికొక అధ్యక్షుడు ఉంటాడు. అతడు కౌంటీ కోర్టుకు న్యాయాధిపతికూడా అయి ఉండవచ్చు. ఆస్తులపత్రాలు, మరణశాసనాలు, వివాహ

పత్రాలు, ప్రభుత్వపు రికార్డులో ఉండవలసిన ఇతరకాగితాలు-కౌంటీలో ఉంటాయి. కౌంటీ ప్రభుత్వమే స్థానిక రహదార్లను వేయిస్తుంది. రాష్ట్ర, దేశపు ఎన్నికలకు స్థానికంగా ఏర్పాట్లు చేస్తుంది- జనాభా లెక్కలకూ, సైన్యంలోనికి మనుషులను పంపడానికీ ఇవే ప్రమాణం.

వివిధ రాష్ట్రాలలో కౌంటీలకు వివిధ విధాల పని ఉంది; వివిధ నామాలున్నాయి; వివిధ ప్రమాణాలలో: విశ్వసనీయత, సామర్థ్యము ఉన్నాయి. ఇవే ప్రజలకు అత్యంత సన్నిహితమైనవీ, సంప్రదాయ సిద్ధమైనవీ అయిన ప్రభుత్వాలు. చాలా కౌంటీ ఉద్యోగాలలో-శిక్షణ పొందనివాళ్ళు విరామ కాలంలో తరుచు జీతం భత్యం లేకుండా పని చేస్తుంటారు. పల్లెటూరి వాళ్ళు సంప్రదాయం అంటే పట్టుదల కలవాళ్లు. అందుచేత తాతలనాటి ఆ పాత పద్ధతుల కౌంటీలకు మార్చడానికి ఒప్పరు. ఆ ప్రజలలో అసమర్థత, లంచగొండితనమూకూడా వాళ్ళకు ఆచారంగా వస్తున్న గుణాలలో వున్నాయి!

క్రమంగా రోడ్లకు, స్కూళ్ళకు డబ్బు వ్యయం చేయవలసిన బాధ్యత-రాష్ట్ర ప్రభుత్వాలమీద, ఫెడరల్ ప్రభుత్వంమీద పడుతోంది. చివరకు స్థానికంగా జరిగిన హత్యానేరం కూడా-రాష్ట్ర ప్రభుత్వ అపరాధ పరిశోధకులే వచ్చి దర్యాప్తు చేస్తున్నారు. అందుచేత అధికార కేంద్రీకరణవల్ల కౌంటీ ప్రభుత్వాలకు సాంప్రదాయకంగా వస్తున్న కొన్ని బాధ్యతలు తప్పిపోయాయి. కాని యీ కేంద్రీకరణ విధానం వల్లనే అతిపూర్వం జిల్లా అధికారులచేత నిర్వర్తించబడే కొన్ని బాధ్యతలు కౌంటీ ప్రభుత్వానికి వచ్చాయి.

చాలాజిల్లాలు-పాఠశాలలను నడపడానికి ఏర్పాటు చేయబడినవి. మిగిలినవి - పన్నుల జిల్లాలు, రోడ్ల జిల్లాలు, ఇలాంటివి, ఒక్కొక్కప్పుడు ఆ ప్రాంతపు న్యాయాధిపతి అధికారంచెల్లే ప్రాంతానికి జిల్లా అనే పేరు ఉండవచ్చు. ఈ జిల్లాలకు అసలు అధికారులంటూ ఉంటే - వారు చాల కొద్దిమందే ఉంటారు. ఉన్న చిన్నచిన్న బడులన్నీ కలిపి కేంద్రపాఠశాల చేయడం, మిగిలిన స్థానిక కార్యక్రమాలు కౌంటీ ప్రభుత్వానికి అప్పచెప్పడంతో-తరుచు ఈ జిల్లాలు నామమాత్రావశిష్టం అయిపోయాయి.

న్యూ యింగ్లండు రాష్ట్రంలో పట్టణాలే ప్రాథమిక రాజ్యవిభాగాలు. ఆ రాష్ట్రంలో నగరాలు సామాన్యంగా 30 నుండి 60 చతురపుమైళ్ళ వైశాల్యం కలవై ఉంటాయి. వ్యవసాయదారులు నగరంలో పనిఉంటే, గుర్రపు బగ్గీమీద ఉదయం వెళ్ళి సాయంకాలానికి తిరిగి రావడానికి వీలున్నంత దగ్గరలో యీ నగరాలుంటాయి. పట్టణ పాలక సంస్థ ఎన్నికలు "పట్టణ సభ"లో జరుగుతాయి. అందులో సెలెక్ట్‌మెన్‌-ను ఎన్నుకొంటారు. వారు నగర వ్యవహారాల నన్నిటినీ చూస్తారు. ఈ విధమైన శుద్ధ ప్రజాస్వామ్యం-నగరంలో జనాభా విపరీతంగా పెరిగిపోనంతవరకూ బాగా పనిచేస్తుంది. కాని అలా జనాభా పెరిగిన తరువాత వారు తమ పట్టణాన్ని నగరంగా గుర్తించమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరతారు.

కొన్ని ఉత్తర రాష్ట్రాలలో పల్లెటూళ్లకీ నగరాలకీ మధ్యస్థంగా ఆరు చదరపుమైళ్ళ విస్తీర్ణంతో చిన్నపట్టణాలు ఏర్పాటు చేశారు. కాని ప్రయాణ సౌలభ్యం పెరగడంతో అవి క్రమంగా కౌంటీప్రభుత్వాల చేతిలోకి వచ్చేశాయి.

మోటారుకారు రావడంతో పూర్వం కాలినడకనో, గుర్రంపైనో వెళ్ళి పనులన్నీ చూచుకునే ఆచారంగల ప్రజలకు సంప్రదాయవినాశకారకమైన మార్పువచ్చింది. నగరాలలో ఒకేచోట నివసించేవారి ఉద్యోగాలూ, స్నేహితులూ,పాఠశాలలూ,చర్చీలుఎక్కడెక్కడోఉంటూండడంవల్ల వారి సాంఘిక రాజకీయ జీవనంలో ఏకత్వం కొరవడింది. ఇపుడు వారు రాజకీయ సంఘాలలోనూ సాంఘిక కార్యక్రమాలలో పాల్గొంటున్నా వారు చాలామంది అపరిచితులతో నిత్యమూ వ్యవహరించవలసి వస్తుంది.

అతి పరిచితమైన ఇరుగుపొరుగు వారితోడి బాంధవ్యం తెగిపోయిన ఫలితంగా పోయిన ఏకభావాన్ని తిరిగి పొందడానికి అనువుగా అమెరికన్ ప్రజలు తమ ఆచారాలను, సంఘాలను పునర్నిర్మించడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. అమెరికా ప్రభుత్వంకూడా తన కార్యక్రమాలను వీలయినంతవరకూ వికేంద్రీకరిస్తోంది. వ్యవసాయ శిక్షణ తరగతులను ఏర్పాటుచేస్తూ కొన్ని కుటుంబాలను ఇరుగు పొరుగులుగా ఉంచి స్నేహాన్ని పెంచే ప్రయత్నం కూడా-ప్రభుత్వవ్యవసాయశాఖవారు చేశారు. పల్లెప్రాంతాలకు కేంద్ర పాఠశాలలు, సహకార విద్యుచ్ఛక్తి ప్రసారకేంద్రాలు, రాష్ట్రవిశ్వవిద్యా

లయాలు ఇవన్నీ వేగగమనంపలని పరిస్థితులకు అనుగుణంగా కొత్త రకం సాంఘిక జీవనాన్ని అభివృద్ధి చేస్తున్నాయి.

ఈ కొత్తసంస్థలన్నీ కృత్రిమ నిర్మితాలే కావచ్చు. కాని అంతమాత్రం చేత అవి అమెరికా సంప్రదాయ బాహ్యాములైనవి మాత్రం కావు. అవసర మని భావించినపుడు కొత్తసంస్థలను నిర్మించడం అమెరికా ప్రజలకు చాలా యిష్టం. యాంత్రికాభివృద్ధివల్ల జరిగే కేంద్రీకరణలో వారికి చాలా అను భవాలున్నాయి. వారు జాతీయ జీవనాన్ని వికేంద్రీకరించడానికి నిత్యమూ మార్గాలు వెతుకుతూనే ఉన్నారు. అందువల్ల సంప్రదాయసిద్ధమైన సాంఘిక రాజకీయ జీవితాన్ని పునరుజ్జీవింప జేయాలనీ అందులోనుండే దేశాభివృద్ధికి కావలసిన పోషకపదార్థాలు లభిస్తాయనీ వారి నమ్మకం. చిన్న పెద్ద ప్రభు త్వాలు చాలా ఉన్న అమెరికన్ ప్రభుత్వ వ్యవస్థయొక్క క్రమాభివృద్ధి— అమెరికన్ ప్రజాజీవితంలోని కేంద్రీకరణ వికేంద్రీకరణ శక్తుల చర్యల ఫలితంగా జరుగుతున్నది.



# ప్రభుత్వము : వ్యాపారము

ఇతర ప్రజాస్వామిక దేశాలవలెకాక, అమెరికాలో మిశ్రమ ఆర్థిక వ్యవస్థ ఉన్నది. ఇంచుమించు పాఠ్యపుస్తకాలలో వర్ణింపబడి పెట్టుబడిదారీ వ్యవస్థ వంటి స్వేచ్ఛాయుతమైన పోటీఉన్నవ్యాపారం ఉన్నది. చాలమట్టుకు చిన్న వ్యాపారమూ, వస్తునిర్మాణసంస్థలూ, రైతులూ, వివిధ స్వతంత్ర వృత్తుల వాళ్ళూ–యీ వ్యవస్థలోనివాళ్ళు. "గుత్తదారీపోటీ"కి లోబడవలసిన పెద్ద వ్యాపారులు ఉన్నారు. సహజంగా గుత్తదార్లయిన టెలిఫోన్, విద్యుత్ సరఫ రాలవంటి సంస్థలున్నాయి. కాతాదార్లే ఎక్కువగా లాభాలుపొందే సహకార సంస్థలూ ఉన్నాయి,లాభదృష్టిలేకుండా వివిధసేవలుచేస్తూ ప్రజల విరాళాల వల్ల పోషింపబడే సంస్థలూ, వివిధ వ్యక్తులు స్థాపించిన విశ్వవిద్యాలయాలు, సమాజాలు, ధర్మసంస్థలు, కార్మిక సంఘాలు – మొదలైనవీ ఉన్నాయి. ఇక పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యాన ఉండే తపాలా ఆఫీసులు, ప్రభుత్వ పాఠశాలలూ మొదలైనవికూడా ఉన్నాయి.

వ్యాపారానికి ప్రభుత్వంతో గల సంబంధాలు అనేకవిధాలఆర్థిక వ్యవస్థల వల్ల, ఫెడరల్, రాష్ట్ర, స్థానికప్రభుత్వవ్యవస్థలవల్ల చాలా క్లిష్టంగా ఉం టాయి. ప్రభుత్వ సహాయం కావాలని వచ్చేవాళ్లు తరుచు ప్రజలలో పెట్టు బడిదారీ వర్గానికి చెందినవాళ్ళే అయిఉంటారు. అంటే పెద్ద చిన్న వ్యాపా రులూ, ధనికులూ, రైతులూ, వీళ్ళు. వీరు తరుచు తమలోతాము తీవ్రంగా పోటీ పడుతుంటారు. అయినప్పటికీ చర్చిలకు, కళాశాలలకు, సహకార సంఘాలకు కూడా ప్రభుత్వం, ఆర్థికసహాయం ఇచ్చింది. ప్రభుత్వ శాసనాల వల్ల – మిగిలిన రెండువిధాల వ్యాపారస్థులకంటే, సహజ పరిస్థి తులవల్ల గుత్తవ్యాపారులైన వాళ్ళు (టెలిఫోన్, విద్యుత్శక్తి సరఫరా మొద లైనవి) బాగా దెబ్బతిన్నారు.

రాజ్యాంగం ప్రకారం ఫెడరల్ ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడంలో ప్రధా నోద్దేశ్యం – యూరపులో షూమన్ ప్రణాళికకు ఉన్న ఉద్దేశ్యం లాంటిదే. ఎగుమతి దిగుమతి సుంకాల నియమాల గోడలు అడ్డంఉన్న చిన్నచిన్న ప్రాంతాలకు బదులు, వ్యాపారానికి విశాలమైన ప్రదేశం ఉండేట్టు చేయ డమే ఈ ఉద్దేశ్యం. రాష్ట్రాలమధ్య వర్తకానికి అడ్డంకులు తొలగించడం మూలంగా ఈ ఆశయాన్ని రాజ్యాంగం సాధించింది.

అప్పటినుండి అలెగ్జాండర్ హమిల్టన్ పరిశీలన క్రింద వస్తుకాభివృద్ధికి సహాయపడడానికి – స్థిరమైన ఆర్థిక వ్యవస్థ నెలకొల్పడానికి ప్రభుత్వం ప్రయత్నించింది. చాలా చవకగా స్పెక్యులేటర్లు కొనేసిన విలువలేని యుద్ధ ఋణపత్రాలను, రాష్ట్రాల పత్రాలతోసహా – తీరుస్తానని ప్రభుత్వం బాధ్యత వహించింది. దిగుమతి పన్నులు ఎక్కువగా విధించి ముఖ్యంగా ఆ ఆదాయంతోటే ఈ పత్రాల నన్నింటినీ ప్రభుత్వం తీర్చింది. క్రొత్తగా ఏర్పడిన సంయుక్త రాష్ట్రాలలో అప్పుడే ఏర్పడుతున్న వ్యాపారానికి పెట్టుబడిగా ప్రభుత్వం ఈవిధంగా యిచ్చిన డబ్బు ఉపయోగించింది.

దిగుమతి పన్నులు ఈ విధంగా ఆదాయం కొనమేకాక విదేశాల సరకుల ధరలు ఎక్కువచేసి కొత్త అమెరికన్ పరిశ్రమలను విదేశాల పోటీనుండి రక్షించడానికి బలమైన సాధనలుగాకూడా ఉపయోగించ బడ్డాయి. అంతేకాక అనతికాలంలో ఫెడరల్‌ప్రభుత్వం, వ్యక్తుల వ్యాపారానికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను 'సహాయం' ఇవ్వడం ప్రారంభించింది. ప్రభుత్వం కాలువలు, రోడ్లు, రైల్వేలు నిర్మించి వ్యాపారానికి కావలసిన అభివృద్ధికి సహాయ పడింది. ప్రభుత్వం కొన్నవీ, జయించినవీ అయిన పశ్చిమ భాగపు భూములు చాలాభాగం ఊరకనే ఇచ్చివేయడమో, చాల తక్కువ ధరకు అమ్మివేయడమో చేసింది. పచ్చికబయళ్ళలోని దున్నని భూములనూ, విస్కాన్సిన్, మిన్నిసోటా రాష్ట్రాల్లోని కొట్టని అడవులనూ, అనేక దశాబ్దాల పాటు వాటి విలువను, సంరక్షించే ఉద్దేశ్యంగాని అ విలువ సాధించే ఉద్దేశ్యంగాని లేకుండా అట్టేపెట్టేశారు. అందువల్ల 20 వ శతాబ్దం కొంతగడచే వరకూ కూడా గోధుమ, కలప ఉత్పత్తికి కొత్తభూములు, అడవుల విలువ వల్ల సహాయం జరుగుతూండబట్టి, వాటి అమ్మకపుధరలు కిట్టుబాటు ధరల కన్నా తక్కువ ఉండేవి. మొదటి వందసంవత్సరాల కాలంలో ఫెడరల్ ప్రభుత్వం పశ్చిమప్రాంతంలో కొత్త సంపదలు కనుగొంటూ, వాటిని డబ్బు చేసుకొనేందుకు ప్రైవేటు వ్యాపార సంస్థలకు ఇచ్చేస్తూనే ఉంది.

వ్యాపారాన్ని దొంగతనాల బారినుండి రక్షించడం కొంచెం నెమ్మదిగా అభివృద్ధి అయింది. దొంగతనంగా సరుకులు సరిహద్దు దాటించి తీసుకుపోవడం, మంచి సరకులకు చెడ్డసరకులు మార్చడం, దొంగతనాలు, ఇలాంటి పాతకాలపు నేరాలనుండి తప్ప, ఇతర విధాలలో మొదట్లో వ్యాపా

రాన్ని ఫెడరల్ ప్రభుత్వం రక్షించవలసిన అవసరం లేకపోయింది. కాని తరువాత తరువాత దూరప్రాంతాల వర్తకం, కొత్త పరిశ్రమల వల్ల వ్యాపారం క్లిష్టమై, కొత్తరకం దుష్టపద్ధతులు వచ్చి, తత్ఫలితంగా ప్రభుత్వం కొత్తరకాల రక్షణలు కల్పించ వలసి వచ్చింది.

19వశతాబ్దపు రెండవఅర్ధభాగంలో ప్రజలలో కలవరంపుట్టించిన ప్రధానమైనవిషయంగుత్తవ్యాపారం. 1861-65లో అంతర్యుద్ధానంతరం వ్యాపారం బాగా అభివృద్ధి అయి గుత్తవ్యాపారాలు పెరిగాయి. కాని అప్పటికింకా అమెరికన్ ప్రజలు నూతన మార్గాలన్వేషిస్తున్నారు. కొత్త భూభాగాలైన పశ్చిమ రాష్ట్రాలలో ప్రతికుటుంబం తన దైనిక జీవితంలో చాలస్వతంత్రంగా ఉండేది. కాని వారు గోధుమలు అమ్ముకొని కావలసిన సరుకులు కొనుక్కునే సమయం వచ్చేసరికి వారికి ఎక్కడచూచినా- ధాన్యపుకొనుబడిలో- రైల్వేకంపెనీలలో – సరుకులఅమ్మకంలో – అన్నిటిలో గుత్తవ్యాపారులు ప్రత్యక్షం అయ్యారు. వారిని తప్పించుకొనే మార్గం బోధపడలేదు. వారికి విపరీతమైన ఆగ్రహం కలిగింది. గుత్త వ్యాపారమంటే అమెరికన్ ప్రజలకున్న చిత్రమైన అనిష్టం ఈ కాలంనుండే ప్రారంభం అయింది.

1890 ప్రాంతాల్లో దక్షిణ, పశ్చిమప్రాంతాల లోని రైతులలో – గుత్త వ్యాపారుల వ్యాప్తిని నిరోధించడానికి "పాప్యులిస్టు పార్టీ" స్థాపించబడింది. రైలుమార్గాలను, తంతిమార్గాలను, టెలిఫోనును జాతీయం చెయాలని యీ పార్టీ కోరింది. పోస్టల్ సేవింగ్సుబాంకులను, తరాలవారీ ఆదాయపు పన్నును ఈ పార్టీ కావాలంది. ఈ పార్టీవారు అనువచ్చు నోట్లను అచ్చువేసి వెండి యిస్తే ఊరకనే నాణెములుగా అచ్చుగుద్ది, డబ్బు సరఫరా చేయడంలో బ్యాంకులకుగల గుత్తఅధికారాన్ని సమ్ముచేయడానికి ఉద్దేశించారు. కాని కాగితపు డబ్బు ఇష్టంలాగె రెండవ విధానం కూడా ద్రవ్యోల్బణకారకమే అయింది. ఒకడాలరు విలువగల వెండిని నాణెములుగా చేయిస్తే- అంతకన్నా ఎక్కువ విలువగల నాణెములు రావడమే అందుకు కారణం. 1896 లో విలియమ్ జె. బ్రేయన్ నాయకత్వాన డెమోక్రటిక్ పార్టీ ఈ ఉచితనాణెములు వేసే విధానాన్ని ఎన్నికల ప్రణాళికలలో చేర్చుకొంది ఆ పార్టీవారికి పాప్యులిస్టులు మద్దత్తు యిచ్చినారు. బ్రేయన్ ఎన్నికల్లో ఓడి పోయాడు.

కాని పాప్యులిస్టుల ఉద్యమంవల్ల ప్రజలలో రగుల్కొన్న కోపం ఫలితంగా దేశంలోని ఉభయ రాజకీయ పక్షాలు 1890 నాటికి దేశవ్యాప్తంగా గుత్తవ్యాపారానికి ప్రతికూలంగా చర్యలు తీసుకోవాలనే నిశ్చయించాయి తత్ఫలితమే షెర్మన్ తయారుచేసిన వర్తక సంఘ సమాఖ్యానిషేధక శాసనం. వర్తకులతో వర్తకులు చేతులు కలిపి కుట్ర చెయ్యడం, ఏకమై గుత్త సంస్థలు ఏర్పరచడం-ఇలాటి పనులు శాసన విరుద్ధాలని షెర్మన్ శాసనం నిషేధించింది.

షెర్మన్‌శాసనం చెయ్యకపూర్వం సాంప్రదాయిక ధర్మాన్ని ఆధారం చేసుకొని గుత్త వ్యాపారాన్ని ఆపుచేయడానికి రాష్ట్రాలు కొన్ని ప్రయత్నాలు చేశాయి. కాని వ్యాపారసంస్థలు పెద్దవై, దేశాలుదాటి వ్యాపారం చేయుడంతో, ఈ ప్రయత్నాలు నిష్ఫలం కాజొచ్చాయి. షెర్మన్ శాసనాన్ని ఇంచుమించు రాజ్యాంగ సవరణలాగ, సాంప్రదాయిక ధర్మశాస్త్ర సూత్రంలాగా, సామాన్య పదాపళితో తయారుచేశారు. దాని ప్రత్యేకోపయోగాలను న్యాయస్థానపు తీర్పులూ, అప్పుడప్పుడు చేయబడిన కొత్తశాసనాలూ నిర్వచించాయి. కాలక్రమాన ఈ విధంగా— అమెరికా దేశపువర్తక సంఘ సమాఖ్యా నిషేధక శాసనం చాలాసూత్రప్రాయంగా తయారై సహస్ర విధాలుగా జరిగే అన్యాయాలను అడ్డుకొనే శక్తిని పొందింది.

వర్తకసంఘ సమాఖ్యా నిషేధక శాసనాన్ని అమలు పరచడంలో ఒడుదుడుకులు ఎన్నివచ్చినా, వర్తకం గుత్తవ్యాపారుల చేతిలో పడిపోయిన సంఘటనలు యింకా ఎన్ని ఉన్నా, ఒక్కటిమాత్రం నిజం. యూరపు వాసులకు అలవాటైన ఆచారానికి విరుద్ధంగా అమెరికా దారి తీసింది.

అమెరికా ప్రజలు—డెమోక్రటిక్‌పార్టీవారు, రిపబ్లికనుపార్టీవారుకూడా—షెర్మన్ శాసనాన్ని అమెరికన్ స్వాతంత్ర్యసౌధ మూలస్తంభాలలో ఒకటిగా గౌరవిస్తారు. ఆశాసనాన్ని ఎవరైనా అతిక్రమిస్తే అందుకు వారు దానికి చెప్పుకొన్న వ్యాఖ్యానం కారణం కాని, అందులోని పవిత్ర సూత్రాన్ని ధిక్కరించాలనే ఉద్దేశ్యం కాదు.

అమెరికన్ వర్తకులు చేసే నియమాతిక్రమణలు ఏమేమిఉన్నా, అమెరికన్ ప్రజల మనోభావాన్ని చాలా ఇతర స్వేచ్ఛాప్రజల మనోభావంకన్నా విలక్షణంగా, విశిష్టంగా చేసిన ఒక నియమం ఉన్నది. సంయుక్తసంస్థలు, గుత్తవ్యాపారమూ నైతికంగా తప్పు అని, ఆర్థికంగా ఆత్మహత్యాకరమనీ

అమెరికనులు విశ్వసిస్తారు. వస్తుకసంఘ సమాఖ్యానిషేధక శాసనం ఎంత చిక్కిరిబిక్కిరిగా, గందరగోళంగా ఒక్కొక్కప్పుడు కన్పించినా అది స్వతంత్రులైన ప్రజలకు స్వేచ్ఛాపతాకగా, అమెరికనుల అభివృద్ధికి ప్రధాన కారణంగా నిలబడిందని వారు నమ్ముతారు.

కొత్తగా స్థాపింపబడిన యూరోపియన్ కోల్ అండ్ స్టీల్ కంపెనీ(బొగ్గు, ఉక్కువ్యాపారం చేసేసంస్థ) నిర్మాణంలో గుత్తవ్యాపార విరుద్ధమైన లక్షణాలుండి, అది పోటీని పెంచి పరిశ్రమల సామర్థ్యాన్ని అభివృద్ధిచేయడానికి రూపొందించబడడం అమెరికనులు సక్రమమార్గంలో పురోగమిస్తున్నా రనడానికి చక్కని ఉదాహరణ.

పెట్టుబడిదారీ వ్యవస్థ అధిక సంపన్నమై అధిక ఉత్పాదక మవుతుండగా దానికి కారల్‌మార్క్సు, అతనిఅనుయాయులు సంభవిస్తాయని ప్రవచించిన వినాశకర రోగాలు రాకుండా చేయవచ్చుననీ, కాని గుత్తవ్యాపారం పెరిగితే దానిని మొదలంట పెరి పారవేయడానికి ప్రభుత్వాలకు నిత్యమూ అవకాశమివ్వడమే అందుకు గల మార్గమనీ అమెరికన్ ప్రజలు అనుభవం వల్ల కనుగొన్నారు.

కొనుగోలు దారులు మోసగించ బడకుండా చూచేందుకు కొన్ని ఇతర పోలీసు రక్షణలు కూడా ఫెడరల్ ప్రభుత్వం కల్పించింది. వెనుకటి రోజుల్లో, నాలుగురోడ్ల కూడలిపాపులో రైతు తన బజారుపని అంతా చూచుకొనేటప్పుడు కొట్టు యజమాని గౌరవంగా బ్రతక దలచుకొనేవాడు గనుక వర్తకంలో "నమ్మకమే విజయసూత్రం" అనుకొనేవాడు. కాని దేశవ్యాప్త వర్తకం ప్రబలడంతో కొత్తవీ అపరిచితమైనవీ అయిన వస్తువులు చాలా వచ్చాయి. వాటిసంగతి కొనుక్కొనే వాళ్ళకు తెలియదు. మోసమే చాలా లాభకరమైపోయింది. ఈ పరిస్థితుల వలన శృంగారవస్తువులలోను ఆహారపదార్థాలలోను ప్రమాదకర విషపదార్థాలుకలపడాన్ని, మోసంచేసే వ్యాపార ప్రకటనలనూ, నిషేధిస్తూ శాసనాలు చేశారు. ఈ శాసనాల ప్రకారం ప్రతి ప్యాకెట్‌పై ఆవస్తువులలో వాడిన దినుసుల పేర్లు, వాని బరువు వేయాలి.

రాజకీయంగా చూస్తే మోసాన్ని నిషేధిస్తూ చేయబడిన శాసనాలు ప్రజలు సాధించిన ఘనవిజయాలే అని చెప్పాలి. ఎందుకంటే—దేశంలో ప్రతివారూ కొనుగోలు దారులే. వీరికి సంఘటితమైన సంఘాలు ఉండవు. కాని అమ్మే

వాళ్ళు బాగా సంఘటితమై ఉంటారు. వారు వాషింగ్టన్‌లోనూ, రాష్ట్రరాజధానుల్లోను, శాసన సభలలోను ప్రాపకం కలవాళ్లై ఉండడానికి అవకాశముంది. ఒక్కొక్కప్పుడు ఒక పరిశ్రమ యజమానులు ఒక మంచి సరకును మిగిలిన కల్తీసరుకు పోటీనుండి రక్షిస్తే బాగుంటుందని అనుకోవచ్చు. కాని, తరుచు అలాటి శాసనాలు పత్రికలలో వ్యాసాల మూలకంగా మేల్కొన్న ప్రజల ఆందోళనలవల్ల—పరిశ్రమల వారు ప్రతిఘటిస్తూన్నా తయారవుతాయి.

అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ పరిపాలనలో జరిగిన పెద్ద పనులలో ఒకటి: సెక్యూరిటీల మార్కెట్‌లో నమ్మకాన్ని విశ్వసనీయతనూ పాదుకొల్పడం. 1933 వ సంవత్సరపు సెక్యూరిటీల శాసనమూ, 1934 వ సంవత్సరపు సెక్యూరిటీల వినిమయ శాసనమూ సెక్యూరిటీలను జారీచేసే సంస్థలు వాటి నిజస్థితిని తెలియపరుస్తూ నివేదికలు పంపాలనీ తప్పు క్లెయిముల వలని నష్టాలలో వారే బాధ్యులుగా ఉండాలని విధించాయి.

ఇటువంటి ఇంకొక శాసనమే "నిర్వాహక సంస్థా నిషేధక శాసనం" **(Holding Company Act of 1935)** ఇది వ్యాపార సంస్థలన్నీ ఒక వరసగా చేర్చబడడాన్ని నిషేధిస్తూంది. ఇలాటి వరసలో ప్రతి సంస్థకూ దానిక్రిందిసంస్థలో దానిని అదుపులో ఉంచుకొనడానికి, దానిని నిర్వహించడానికీ అవసరమైనన్ని వాటాలుంటాయి. ఈక్లిష్టవిధానంవల్ల, ఈకంపెనీల లాభాలన్నీ కొద్దిమంది "గుటకాయ స్వాహా" చేసేస్తారు. చివఱకు పెట్టుబడి పెట్టిన సామాన్యభాగ స్వామికి ఏమీ మిగలదు.

అసత్య ప్రకటనల ద్వారాను, స్టాకు బజారులో కపటం మూలం గాను పెద్ద పెద్ద నిర్వాహక సంస్థలను ఏర్పాటు చేయడం మూలంగాను ప్రజలను మోసం చేస్తున్న సంస్థలవాళ్లు యీ 'నిర్వాహక సంస్థల' శాసనాన్ని అడ్డుకోడానికి తీవ్రప్రయత్నాలు చేశారు. ఒకసారి ఒక కుఱ్ఱవాడు తనను ఈ శాసనానికి వ్యతిరేకంగా తంతివార్తలు పంపడానికి సంతకానికి మూడు సెంట్లు (ఇంచుమించు అణా) చొప్పున కూలికిపెట్టారని సాక్ష్యంచెప్పాడు. ఈవిధంగా వాషింగ్టన్‌కు బిల్లుకు ప్రతి కూలంగా లక్షల కొలదీ టెలిగ్రాములు పంపించేశారు- ఇటువంటి ప్రాతికూల్యం వంచకులు చేసేపని అని ఋజువవడం వల్ల ఆ బిల్లు ఆమోదించబడింది. ఈ బిల్లువల్ల ఆర్థిక వ్యవస్థలో ఒడుదుడు

కులు తగ్గి, ప్రజలకు అందులో విశ్వాసం కలిగింది. కాని అప్పట్లో ఆర్థిక మాంద్యవల్ల బాధితులయిన వారి రాజకీయప్రాబల్యమే యీ చట్టాలు ఆమోదింపబడడానికి తోడ్పడింది.

ప్రభుత్వం, వ్యాపారస్థులకు సేవ చాలవఱకూ ఉచితంగానే చేస్తుంది. మొదట్లో ఫెడరల్ ప్రభుత్వంలో వ్యవసాయిక పరిశోధన: విద్యా విభాగాలు ఏర్పాటయినాయి. తరువాత క్రమంగా ప్రభుత్వం శాస్త్రపరిశోధన విషయాలు, అంకెల్లో సమాచారం, వాతావరణ సమాచారం, దేశ విదేశ విపణుల వివరాలు – ఇవన్నీ అందచేస్తోంది. రాజ్యాంగంలో సూచించబడ్డరీతిని ప్రభుత్వం కాపీరైటు, పేటెంటు హక్కులను రక్షిస్తుంది.

అధ్యక్షుడు హెర్బర్ట్ హూవర్ హయాంలో పునర్నిర్మాణ సహాయక సంస్థ (Reconstruction finance Corporation) ను స్థాపించారు. సెక్యూరిటీల విలువలు పడిపోతున్నందువల్ల దివాలా తీస్తున్న సంస్థలకు సహాయం చేయడం ఈ సంస్థ ఉద్దేశ్యం. ఈ సంస్థ రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో వివిధ విధాలుగా వ్యాపించింది. వేలకోట్ల డాలర్లు అప్పుగా యిస్తూ, వ్యయం చేస్తూ వృద్ధిపొందింది. దీనికితోడు 1934 లో ఏర్పడిన ఎగుమతి – దిగుమతుల బ్యాంకు విదేశ వర్తకాన్ని వృద్ధి పొందించడానికి అప్పు యిస్తుంది. ఫెడరల్ గృహ నిర్మాణశాఖవారు (Federal Housing Administration) తనఖాపెట్టే ఇళ్ళను భీమాచేసి, వాటిపై అప్పు ఇచ్చేవాడికి నష్టంగలిగే అవకాశం తొలగించి తత్ఫలితంగా ఇళ్ళ తాకట్లపై వడ్డీ రేటు తగ్గించారు. పల్లెటూళ్లకు విద్యుచ్ఛక్తి తీగలు వేసుకొనేందుకు తక్కువ వడ్డీ రేట్లకు డబ్బు అప్పుగా యివ్వడంకోసం 'గ్రామీణ విద్యుత్ శక్తి సంఘం' (Rural Electrification Administration) అనే సంస్థను ఏర్పరచారు.

ఫెడరల్ ప్రభుత్వం ప్రపంచంలో కల్లా పెద్ద బ్యాంకుమాత్రమే కాకుండా ప్రపంచంలోకల్లా పెద్ద భీమా కంపెనీగా కూడా వ్యవహరిస్తోంది. ఉద్యోగులకు భీమా, ముసలివారికి, మాజీ ఉద్యోగులకూ భీమా యింకా అనేక ఇతర భీమాలు అన్నింటినీ ప్రభుత్వమే నిర్వహిస్తుంటుంది.

వ్యక్తుల వ్యాపారానికి, ప్రభుత్వ వ్యాపారానికి మధ్యసరిహద్దుగీత ఏది అనే ప్రశ్న అమెరికన్ రాజకీయాలో నిత్యమూ ఉదయిస్తూ ఉంటుంది. వ్యక్తుల

వ్యాపారం సత్ఫలితాల నిచ్చే చోట్లకూడా– ఉదాహరణకు జలవిద్యుచ్ఛక్తి నిర్మాణంవంటి వాటిల్లోకూడా– ప్రభుత్వమే వ్యవహరించడానికి రిపబ్లిక నులు యిష్టపడరు. కాని డెమోక్రట్లు విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులను ప్రభుత్వ యాజమాన్యాన – కొంతవరకు ప్రైవేటు సంస్థల విద్యుచ్ఛక్తి ధరలను అదుపులో ఉంచడానికి పనికి వచ్చే పోటీదార్లుగా నిర్మించారు.

కాని ఇటు డెమోక్రట్లు గాని, అటు రిపబ్లికనులుగాని సామాజికవాద వ్యవస్థను ఆచరణీయ లక్ష్యంగా అనుసరించ నంగీకరించరు. ప్రభుత్వమే యాజమాన్యం వహించవలసిన అగత్యం ఉంటేతప్ప ఏ వ్యాపారాన్నీ ప్రభుత్వం చేయడానికి ఉభయపక్షాలూ అంగీకరించవు.ప్రభుత్వ, ప్రైవేటు వ్యాపారాలలో ఏది ఎంచుకోవాలనే నిశ్చయాన్ని చేయడానికి మూడు సూత్రా లున్నాయి.

మొదటిది :

ప్రజలకు ఎదైనా – వరదలను నివారించడం, వాతావరణ సమాచారం వంటి సేవ కావాలంటే – ఆ సేవ పొందేవారు దానికి డబ్బు చెల్లించేటట్లు చేసే తేలికమార్గం ఏదీ లేదు. అలాంటప్పుడు ప్రభుత్వాన్ని ఆ వ్యవహారం చూడమంటారు.

రెండవది ।

విద్యాబోధ ముసలికాలపు భీమాలవంటి పనులేవైనాప్రజలకు కావలసి ఉన్నప్పుడు ప్రైవేటు సంస్థల కన్నా చవకగా ఆ పనులు ప్రభుత్వం చేయ గలిగితే అపుడు ప్రభుత్వం ఆ పనిలో ప్రవేశిస్తుంది.

మూడవది :

ప్రైవేటు సంస్థల చేతిలో టెలిఫోన్, తపాలపద్ధతివంటి గుత్తహక్కుగల సంస్థలు ప్రయోజనకరంగా ఉండకపోతే– అపుడు ప్రభుత్వ యాజమాన్యం ఉండాలని అంతా ఆందోళనచేస్తారు. ఎక్స్‌ప్రెస్ కంపెనీ లన్నీ అసంతృప్తి పడితే అపుడు బుక్‌పోస్టు పద్ధతిని ప్రవేశ పెట్టారు. అమెరికాలో చాలా నీటి సరఫరా కేంద్రాలు, విద్యుచ్ఛక్తి సరఫరాకేంద్రాలు పురపాలకసంఘాల యాజమాన్యం క్రిందికి తీసుకోబడ్డాయి. టెలిఫోన్ కంపెనీలు, నిత్యమూ తమ కంపెనీల ప్రాశస్త్యాన్ని గురించి ప్రకటనలుచేస్తూనే ఉంటాయి. లేక పోతే ప్రజలు అసంతృప్తిచెంది– చివరకు పరిశ్రమ జాతీయం చేయబడే

ప్రమాదం ఉంది. రైలుమార్గాలు, టెలిఫోన్, టెలిగ్రాఫ్, రేడియో, విమాన మార్గాలవంటి సహజమైన గుత్తవ్యాపారాలు ప్రైవేటు సంస్థల చేతిలోనే ఉండి ప్రభుత్వ నియమానికి లోబడి ఉండాలని అమెరికన్ప్రజల అభిప్రాయం. కాని ఈ వ్యాపారం మరీ విపరీతమార్గాలు పట్టుతుంటే అడ్డుకోడానికి వీలుగా ఆ పరిశ్రమలపు జాతీయంచేసే అవకాశం ఉండనే ఉంది.

ప్రభుత్వ, ప్రైవేటు రంగాలను వేరుచేసే యీసూత్రాలే యీ సంకిష్ట కార్యరంగంలో అమెరికనుల ప్రవృత్తిలో విలక్షణమైనవి. ఫెడరల్ రాష్ట్ర ప్రభుత్వ, స్థానిక ప్రభుత్వాల బడ్జెట్‌లు రక్షణ కార్యక్రమపు బడ్జెట్‌తో సహా చాలావరకూ వస్తుకప్రపంచానికి ప్రత్యక్షంగా సంబంధించిన వ్యాపారాల కోసం సంబంధించి ఉంటాయి. లక్షల కొలదీ యీ చిన్నపెద్ద వ్యాపారాలలో అమెరికన్ ప్రజలు ఎప్పుడూ, సామాన్య లౌకిక జ్ఞానయుతంగానే వ్యవహరిస్తారు.

రాజకీయ వివాదాలలో ఎప్పుడూ – ఈ మధ్యేమార్గాన్ని వదలి ఫాసిస్టు పద్ధతినో, కమ్యూనిస్టుపద్ధతినో అనుసరించాలనే వాదం రాదు. కాని ఆమధ్యే మార్గం సరిగ్గా ఏది అనే విషయంమీదనే పేచీ.

---

# వ్యక్తి స్వాతంత్ర్యములు

"మానవునికి సృష్టికర్త కొన్ని అనన్య సంక్రామ్య స్వామ్యములను ప్రసాదించాడు. జీవనము, స్వాతంత్ర్యము, సౌఖ్యాన్వేషణ మొదలైనవి ఇట్టి స్వామ్యములలో కొన్ని. ఈహక్కులు పరిరక్షించడానికే జగత్తులో ప్రభుత్వములు సంస్థాపించబడ్డాయి" అని స్వాతంత్ర్య ప్రకటన పత్రం ప్రవచించింది.

**1946**లో అధ్యక్షుడు ట్రూమన్ ఏర్పాటుచేసిన పౌరస్వామ్యాల సంఘం—నాలుగు విధములయిన హక్కులను పేర్కొని, వాటిని పరిరక్షించడానికి "మం మార్గములను అన్వేషించవలసిన అవసరాన్ని గుర్తించింది. ఆ" నాలుగు విధముల హక్కులు యివి :

1. వ్యక్తికి రక్షణకు, భద్రతకు గల హక్కు.
2. పౌరత్వాన్ని, తత్సౌకర్యాలను పొందడానికి గల హక్కు.
3. భావ స్వాతంత్ర్యమునకూ, తత్ప్రకటనకూ గల హక్కు.
4. అవకాశ స్వామ్యానికి గల హక్కు.

పౌరుని ప్రభుత్వంనుండి రక్షించేవి, పౌరుని ఇతర పౌరుల నుండి రక్షించేవి. పౌరులను అందరికీ వచ్చే నిరుద్యోగం, మశూచి వంటి కష్ట నష్టాల నుండి రక్షించేవి—అని హక్కులను యింకొక పద్ధతిలోగూడ వర్గీకరించవచ్చు. జీవనానికీ, స్వాతంత్ర్యానికీ, సౌఖ్యాన్వేషణకూ నష్టం కలిగించే ముఖ్య శత్రువులైన ఈ మూడింటినీ రాజనీతిశాస్త్రంలో వేరువేరుగా పరిశీలిస్తారు కాబట్టి—ఈ విధమైన వర్గీకరణం—రాజనీతి, ప్రభుత్వము మొదలైన విషయాలు చర్చించేటప్పుడు బాగా ఉపయోగిస్తుంది.

ఫెడరల్ ప్రభుత్వంగాని, రాష్ట్ర ప్రభుత్వంగాని, స్థానిక ప్రభుత్వంగాని పౌరుల హక్కులకు విరుద్ధంగా ప్రవర్తిస్తే- న్యాయస్థానాలు రాజ్యాంగం యిచ్చిన బలంతో – యీ హక్కులను నిలబెడతాయి. అన్యాయంగా బంధింపబడిన ఖైదీని విడుదల చేయమని కోర్టు ఆజ్ఞాపించ వచ్చు. కోర్టు ఆజ్ఞను ప్రభుత్వ మెన్నడూ తిరస్కరించదు. ఒక పౌరుడు ఇంకొక పౌరుని యెడలచేసే తప్పులు సాధారణ ధర్మంప్రకారం న్యాయ విరుద్ధం కావ

చ్చును. లేదా అవి శాసనారీత్యా కూడా న్యాయ విరుద్ధంగా చేయబడ వచ్చును. కాని చర్చిలు, ఇతరసంస్థలు 'నీతిబాహ్యం' అని ఖండించే చాలా చెష్టపనులు శాసనరీత్యా నిషేధించ బడలేదు. ఇవన్నీ జాతివిచక్షణకూ,మత విభేదాలకూ సంబంధించినవి. అటువంటివి శాసనరీత్యా నిషేధించబడాలా వద్దా అనే విషయంలో చాలా వివాదాలు వస్తాయి.

సమాజంలోను, జాతిలోను సభ్యుడుగా పౌరునికి బాంబులు వేసే వాళ్ళ నుండి రక్షించబడే హక్కు మాత్రమే కాక, అగ్ని, అంటువ్యాధులు, వరదలు మొదలైన వాటినుండి రక్షించబడే హక్కు కూడా ఉన్నది.ఇంగ్లండు దేశపు ప్రాచీన ధర్మంప్రకారం— పౌరునికి తిండిలేకపోతే పరుల ఆదరాన్ని పొందే హక్కు గూడా ఉన్నది. ఈ రక్షణపొందే హక్కుకు సరియైన అవధులు ఏవి ? అనేది— సంప్రదాయ వాదులకూ, ఔదార్యవాదులకూ, మధ్య వివాదాస్పద విషయం. ఈ విషయంపైనే రిపబ్లికనులకు డెమోక్రట్లకూ కూడా వివాదం ఉన్నది. ఆ పార్టీలలో వివిధ వర్గాలకు కూడా ఇదే వివాద మున్నది.

అమెరికన్ ప్రజలు విప్లవంలో జయించి స్వతంత్రమైన దేశాన్ని సాధించు కొన్నాక, మొదట చేయబూనిన పని- రాబోయే ప్రభుత్వాలు తమహక్కులను అణగ ద్రొక్కకుండా భద్రపరుచుకొనడమే. మిగిలిన హక్కులను సంప్రదాయము, సాంప్రదాయిక ధర్మమూ కూడా కాపాడుతూండబట్టి—వాటి విషయమై వారికంతభయంలేక పోయింది, అందుచేత తరువాత వారికి అవీ ముఖ్యమైన హక్కులుగానే కనిపించినా— అప్పట్లో వారు వాటిని అంత ప్రముఖమైన హక్కులుగా భావించలేదు.

అమెరికన్ పౌరులకూ వారి ప్రభుత్వ ప్రతినిధులకూ మధ్య వ్యవహారాలన్నింటిలోనూ రాజ్యాంగం యిచ్చిన హక్కులు నిత్యమూ ఆచరణలో ఉంటాయి. కాని సందేహాస్పద విషయాలలో మాత్రం— ఆ హక్కులు-- చెల్లితే, ఎంతవరకూ చెల్లుతాయి అనే విషయం కోర్టులు నిశ్చయించ వలసిందే.

1951 లో సుప్రీంకోర్టు- నేరం ఒప్పించేందుకు పోలీసులు హింసను ప్రయోగించడం (దీనినే Third Degree అని అమెరికాలో అంటారు.) 14 వ రాజ్యాంగపు సవరణకు విరుద్ధమని నిశ్చయించింది. క్రమమైన న్యాయ విచారణ లేకుండా ప్రభుత్వం ఒక పౌరుని ప్రాణాన్నిగాని,

స్వేచ్ఛనుగాని, ఆస్తినిగాని హరించరాదని ఈసవరణ విధిస్తున్నది. ఒక పోలీసు ఉద్యోగి దోషిగా అనుమానింపబడిన ఒకపౌరునిచేత నేరం ఒప్పించ డానికి సాధికారంగా హింసను ప్రయోగించగా—అతడు ఫెడరల్ శాసన విరుద్ధంగా వ్యవహరించాడని తీర్పు చెప్పారు. ఈ విధంగా పాతహక్కుకు కొత్త నిర్వచనం చెప్పబడింది.

ఏ రాష్ట్రమూ, పౌరులందరికీ సమానంగా న్యాయ రక్షణ కల్పించక పోవడానికి వీలులేదని 14 వ సవరణ విధిస్తోంది. హత్యానేరం మోపబడిన వ్యక్తిని జైల్లో పెట్టారు. జైలుఅధిపతి జైలు నియమాల ననుసరించి, అతని వివాదపత్రాలు రాష్ట్రపు సుప్రీంకోర్టుకు పంప నిరాకరించాడు. రాష్ట్రప్రభుత్వం ఆ దోషికి న్యాయరక్షణ కల్పించలేదనీ తక్షణం క్రమమైన విచారణ జరిపించడమో, వెంటనే అతనిని విడిచి పెట్టడమో చేయాలని ఫెడరల్ సుప్రీం కోర్టు తీర్పుచెప్పింది.

అకారణంగా సోదాలు, అరెస్టులు చేయకూడదని 4 వ సవరణ విధిస్తోంది. అందుచేత, ఏది అకారణమైనది ఏది సకారణమైనది అని న్యాయస్థానాలు తరుచు నిశ్చయించవలసి వస్తుంది. ఒకసారి— ఒక సారావ్యాపారి తనస్నేహితుని ఇంటిలో సారా దాచాడని పోలీసులకు బలమైన అనుమానం కలిగింది. వారంటు లేకుండా యింట్లో ప్రవేసించి సోదాచేసి సారాసీసాలు పట్టుకున్నారు. ఈ చర్య రాజ్యాంగ విరుద్ధమని సుప్రీకోర్టు తీర్పుయిచ్చింది. తప్పుచేశాడని అనుమానించబడినవాడు ఎంత దోషియైనా అన్యాయ విధానాలద్వారా అతనిని బంధించడానికి పోలీసులకు న్యాయశాసనం అధికారం యివ్వదు. అలా అధికారం యిస్తే అమాయకులైన అనేకుల హక్కులకు భంగం కలుగుతుంది.

'న్యాయమైన విచారణ' అనే మాటకు న్యాయస్థానాలు తరుచు కొత్త నిర్వచనం చెపుతుంటాయి. అందువల్ల కొత్తరకమైన శాసన ధిక్కారాలూ, అతిక్రమణలూ చాలాకాలం నుండి జరుగుతూన్న శాసనధిక్కారాలూ సవరించబడతాయి.

ఫ్లారిడా రాష్ట్రంలో ఇద్దరు నీగ్రోలపై మానభంగ నేరం మోపబడింది. వారిని మధ్య కోర్టులోను పెద్దకోర్టులోను విచారించిన జ్యూరీలో అంతా తెల్ల వాళ్ళే ఉన్నారు. ఆ నేరాన్ని రాష్ట్ర న్యాయస్థానం ఆమోదించి — నీగ్రోలను

శిక్షించింది: కాని ఫెడరల్ సుప్రీంకోర్టు మాత్రం జ్యూరీలో తెల్లవాళ్ళనే నియమించిన కారణాన ఆ వివాదాన్ని ఏకగ్రీవంగా కొట్టివేసింది. ఈ కేసులో ఇంకొక విశేషం— ఆ నీగ్రోలు తమ తప్పులను ఒప్పుకుంటూ ప్రకటన చేసినట్టు ప్రాసిక్యూషన్‌వారు కోర్టులో చెప్పకపోయినా, దిన పత్రికలలో మాత్రం వారు పశ్చాత్తాపపడినట్లు వార్తలు ప్రచురించబడ్డాయి. ఈ విధంగా పత్రికలు వివాదంలో జోక్యం కలిగించుకోవడమే 'న్యాయమైన విచారణ' జరుగ లేదన్నదానికి పెద్ద ఉదాహరణ అని ఇక్షప సుప్రీంకోర్టు న్యాయమూర్తులు ప్రకటించారు.

5—వ సవరణ ప్రకారం — తనను క్రిమినల్ విచారణలో చిక్కుకొనచేసే జవాబును చెప్పవలసిన ప్రశ్నకు దేనికైనా 'సమాధానం ఇవ్వను' అని సాక్షి తిరస్కరించవచ్చు, కాని, కమ్యూనిస్టు పార్టీ ప్రముఖ నాయకులపై ప్రభుత్వాన్ని హింసాయుత సాధనాలవల్ల బలవంతంగా పడగొట్టడానికి ప్రయత్నం చేశారనే క్రిమినల్ నేరం మోపబడగా— వారిపై ఆనేరం మోపడానికి ఆధారమైన 1940 వ సం॥రపు స్మిత్ శాసనాన్ని రాజ్యాంగ విరుద్ధంగా ప్రకటించడానికి సుప్రీంకోర్టు నిరాకరించింది. అందువల్ల — కాంగ్రెసు దర్యాప్తు సంఘంవారు ఎవరినైనా పిలచి అతనికి కమ్యూనిష్టుల పనులు క్రిమినల్ నేరాల క్రిందికి వస్తాయని శాసనం ఉన్నది కాబట్టి అతడు నిజం చెపితే దోషియై క్రిమినల్ విచారణలో చిక్కుకొంటాడు కాబట్టి, ఆ ప్రశ్నకు జవాబు చెప్పనని తిరస్కరింవచ చ్చు. ఒక వ్యక్తిని క్రిమినల్ విచారణలో దింపడానికి కారణం కాగల సమాచార పరంపరలో ఒక్క అంశాన్ని కూడా అది స్వతఃఎంత నిరపాయకరమైనదైనా — అతడు చెప్ప తిరస్కరించవచ్చునని సుప్రీంకోర్టు వ్యాఖ్యానించింది.

ఈ 5—వ సవరణ — ఒక సాక్షిని అతడు కమ్యూనిస్టు కుట్రదారుడనే నేరంపై జరిగే క్రిమినల్ విచారణలో చిక్కుకొనకుండా రక్షింపవచ్చును గాని, ఈవిధంగా తిరస్కరించే హక్కును ఉపయోగించుకొనడం — అంటే నిజం చెపితే అది ప్రమాదకర మవుతుందనే విషయాన్ని అంగీకరించడమే నని అతని యజమాని నమ్ముతాడు కాబట్టి — అందువల్ల అతని ఉద్యోగం పోతే మాత్రం దానికి భద్రత కల్పించలేదు.

మొదటి సవరణ భద్రపరచే మత స్వాతంత్ర్యం నేటికీ తరుచు పునర్వ్యాఖ్యానించ బడుతూండవలసి వస్తోంది. రోడ్డు మలుపుల్లో నిలబడి మత ప్రచారోపన్యాసా లిచ్చే మతబోధకులలో తరుచు దెబ్బలాటలకు దిగే చిత్రమైన మనుషు లుండబట్టి, ఏ న్యాయసూత్రం క్రిందికి వస్తుందో పరిశీలించవలసిన సందేహాస్పద వివాదాలు కొన్ని వస్తుంటాయి. 'మతప్రచార స్వాతంత్ర్యం' అనే హక్కు క్రమంగా దేమ్మికి ఉపయోగించ బడడం ఎక్కడ జరిగిందో నిశ్చయించవలసినవారు పోలీసులే. ఏదో చర్చిపేరు పెట్టుకొని మత ప్రచారకుల దుస్తుల్లో, దొంగలూ మోసగాళ్ళూ తిరుగుతుంటారు. దీనివల్ల మన స్వాతంత్ర్యపు హక్కు విషయంలోని వివాదాలలో ఇంకా ఎక్కువ అనుమానాస్పదమైన వివాదా లుంటాయి.

పత్రికా స్వాతంత్ర్యం అమెరికాలో చాలా అభివృద్ధి అయింది ముఖ్యంగా ప్రభుత్వోద్యోగులపై ఎలాటి విమర్శలనైనా చేయడానికి హక్కు ఉన్నది. ఈ స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యానికి ప్రధాన రక్షణగా పరిగణించబడుతోంది. కాని ఈ శాసనాలు ప్రజలకు పత్రికా స్వాతంత్ర్యం యిచ్చినంతగా తాము కోరినట్టుగా పత్రికలు అచ్చు వేసుకో గలిగిన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని యివ్వవు. పెద్ద పత్రికలు చాలా తక్కువధరలకు వ్యాపార ప్రకటనలు వేసుకోగలంతగా అభివృద్ధిపొందాయి. అందుచేత నేడు చాలాచోట్ల చిన్న పత్రికలన్నీ పడిపోయి, ఏదో ఒక్క పెద్ద పత్రిక మాత్రమే నిలవ గలుగుతోంది. తత్ఫలితంగా స్థానిక దినపత్రికలలో విరుద్ధభావాలను చదివే వీలు ప్రజలకు లేకుండా పోయింది.

పత్రికా స్వాతంత్ర్యాన్ని ఆచరణలో పెట్టినప్పుడు వచ్చిన ఈ సమస్యను పరిష్కరించడానికి రాజకీయ యంత్రాంగం ఏమి ప్రయత్నించలేదు. ఒక్కొక్కప్పుడు చిన్న పత్రికలకు పోటీగా వ్యాపార ప్రకటనలు అన్యాయంగా తీసుకుంటూన్నందుకు పెద్దపత్రికలవారిని శిక్షించవచ్చు. కాని, తరుచు వ్యాపారాలలో గుత్తహక్కు-శాసన విరుద్ధంగా ప్రవర్తించ బట్టి కాక, స్వేచ్ఛా వ్యాపారంలోని పోటీ ఫలితంగానే వస్తుంది. అందుచేత చిన్నపత్రికలకు ప్రభుత్వ సహాయం చేయడం కన్నా అనుచితమయిన పని వేరొకటి ఉండదు. ఈ సమస్యకు ఏదైనా పరిష్కారమార్గం ఉంటే, అది రాజకీయ

చర్యల రూపంలో కాక, చిన్న పత్రికలకు అనుకూలమయిన యాంత్రికాభి వృద్ధరూపంలో ఉండడానికి అవకాశం ఉంది.

అమెరికన్ ప్రజలు చాల జాతులనుండి వచ్చినవారు. అందులో వాయువ్య యూరపునుండి వచ్చినవారు బాగా బలీయమైన కూటమిగా ఏర్పడి వారే అత్యధిక సంపదనూ, రాజకీయాధికారానికీ అధిపతులుగా ఉన్నారు. మిగిలినవారంతా వారి మతం వేరుకావడంవల్లనో, సంప్రదాయాలు భిన్నంకావడం వల్లనో, ముఖ్యంగా వారి శరీరవర్ణం వేరుకావడం వల్లనో-భేదభావంతో చూడబడుతారు. నీగ్రోలు, చైనావారు, జపానువారు, మెక్సికనులు, ఎర్ర ఇండియనులు, రియోగ్రాండీలోయలో మొదట స్థిర పడిన స్పెయిను జాతీయుల సంతతివారైన హిస్పానో అమెరికనులు-వీరంతా ఏదోవిధంగా వేరు చేయబడుతున్నవారే. ఆ విధంగానే యూదులు, కేథలిక్కులు, ఇతర ప్రొటెస్టంటు కూటములకు చెందినవారు కూడా వేరు చేయబడుతుంటారు. ఇంచుమించు యూరపు ఖండపు తూర్పు దక్షిణ ప్రాంతాలనుండి వచ్చినవారందరూ- వారి భాషలు మాట్లాడుతూ ప్రత్యేక కూటములుగా ఉంటున్నంతకాలమూ విజాతీయులుగానే చూడబడు తూంటారు.

అల్ప సంఖ్యాకులను భేద భావంతో చూడడానికి చాలావరకూ నిరుద్యోగ భయం కారణం. ఉద్యోగం సంపాదించడానికి వీలుగా ఒక జాతిగాని, మతంగాని ఉంటే, కార్మికులు తాము ఆ ప్రత్యేక వర్గానికే చెందిన వాళ్ళ మని చెప్పడం ప్రారంభిస్తారు. 1940 తరువాత ఉద్యోగాలు సులభంగా దొరికే రోజుల్లో ఈ విభేదాలు చాలా వరకూ తగ్గాయి. అందువలన నీగ్రోల యెడల గూడా విభేద భావం తగ్గింది.

పౌర స్వామ్యాలను పరిశీలించడానికి అధ్యక్షుడు ట్రూమన్ ఏర్పరచిన సంఘం అల్ప సంఖ్యాక వర్గాలకు చెందిన పౌరులు పడుతున్న కష్టాల పట్టిక ను తయారుచేసి చూపించారు. వారికి జరుగుతున్న అన్యాయాలను పరి శీలించడం, వాటిని నివారణమార్గాలు సూచించడం - యీ సంఘం వారు చేయవలసిన పని. కాని ఈ దారుణ అన్యాయాలన్నిటిని ఎత్తి చూపించ బోయే ముందు అమెరికన్ జాతీయ జీవితంలో అల్పసంఖ్యాకులకు గూడా

స్వేచ్ఛా అవకాశాలు చాలా ఎక్కువగా ఉన్నాయనీ, రానురాను పౌరస్వామ్యాలు భద్రతను పొందుతున్నాయనీ ఈ సంఘంవారు వివరించారు:

వ్యక్తి జీవితపు భద్రతకు, క్షేమానికి గల హక్కులవిషయం వివరిస్తూ దొమ్మీలలో హత్యలు ఈ శతాబ్దపు మొదటి దశాబ్దంలో సంవత్సరానికి 150 నుండి– 1940 తరువాత కాలంలో సంవత్సరానికి 6–కు తగ్గిపోయాయని వ్రాశారు. కాని, ఈ మధ్యకాలంలో చంపబడిన వారి సంఖ్యకంటే ఎన్నో రెట్లమందిని దొమ్మీనుండి స్థానిక ప్రభుత్వాధికారులు రక్షించారు. హత్య, హత్యాప్రయత్నాలను గురించి సరియైన లెక్కలు వ్రాస్తుండే టస్కజీ ఇన్‌స్టిట్యూట్ వారు 1946 కు పూర్వం 7 సంవత్సరాల కాలంలో 226 మంది చంపుతామని బెదరించబడ్డ వాళ్ళు రక్షించబడ్డారని, అందులో 200 మంది నీగ్రోలని నివేదించేరు.

రానురాను విద్య, సంపద పెరగడం వల్ల, పోలీసులలో సత్ప్రవృత్తి ఏర్పడడంవల్ల, ఈ సామూహికదౌర్జన్యాలు తగ్గిపోయాయి. ఇప్పుడు పోలీసు ఉద్యోగి ఎవరైనా ఒకజనసమూహాన్ని అజ్ఞాపించడానికి వస్తే వారు తిరగబడి అతన్ని కొట్టడం లేదు. సామూహిక హత్యాప్రయత్నాన్ని ఫెడరల్ నేరాలలో ఒకటిగా చేయమని అధ్యక్షుడు ట్రూమన్ కాంగ్రెసును కోరాడు కాని, ఆ చట్టాన్ని 'కాలహరణ, (ఫిలిబూస్టర్) ఆయుధాన్ని ఉపయోగించి ఆమోదించకుండా చేసేశారు.

పోలీసు క్రూరంగా ప్రవర్తించడం, న్యాయ స్థానాలలో పక్షపాతంతో చూడడం మొదలైనవి వ్యక్తిస్వాతంత్ర్యాన్ని ధిక్కరించిన నేరాలే. ఈ దోషాలన్నీ తరుచు ఫెడరల్ రాజ్యాంగ విరుద్ధాలయి ఉంటాయి కాబట్టి అమెరికా సుప్రీంకోర్టు ఇట్టి వివాదాలను విచారించవచ్చు. ఈవిధంగానే అప్పుడప్పుడు బైటపడే 'వెట్టిచాకిరి' (Peonage) వివాదాలుకూడా', ఈవెట్టిచాకిరి చేయించుకొనడం ప్రజలు పేదవాళ్ళయి, భయస్థులయి, వారి హక్కులు తెలియనివారయిన ప్రదేశాలలో మాత్రమే సాధ్యం. స్వార్థపరుడై క్రూరుడైన వ్యక్తి తనకు బాకీఉన్న వానిచేత ఆ అప్పును అతడు తీర్చేవరకూ వెట్టిచాకిరు చేయించుకుంటాడు. పైగా ఆవిధంగా చాకిరీచేయడం అప్పుపడ్డవాని ధర్మ మని కూడా విశ్వసింపచేస్తాడు.

ఏ జాతికి చెందినవారైనా సరే—అమెరికా సంయుక్త రాష్ట్రాలలో జన్మించిన వ్యక్తులందరికీ పౌరసత్వం తప్పకుండా యివ్వబడుతుంది. కాని చాల మంది ఆసియావాసులకు—వారి కొడుకులకూ, కూతుళ్ళకూ జన్మతః పౌర సత్వం సిద్ధించినా— వారికి నివాసరీత్యా పౌరసత్వం ప్రసాదించబడలేదు, పౌరసత్వానికి అర్హులు కాని విజాతీయులకు వ్యవసాయక్షేత్రాలు కొనుక్కొనే హక్కు, కొన్ని సందర్భాలలో వారి కుమారుల వ్యవసాయ క్షేత్రాలలో పోషింపబడే హక్కుగూడా నిరాకరించబడ్డాయి. న్యాయ శాసనరీత్యా, అట్టి భేదభావాలను ఒడంబడికల ద్వారాగాని, దేశాంతరాగమన నియమాలను మార్పుచేసిగాని, తొలగించవచ్చు. కాని వాస్తవరాజకీయ పరిస్థితుల దృష్ట్యా ప్రజలలో కొంత సహనభావం ఏర్పడేవరకూ అట్టి మార్పులు సాధ్యంకాక పోవచ్చు.

వోటు చేసే హక్కు చాలా శాసన నియమాలవల్ల ఆటంకపరుపబడింది కాని, క్రమంగా ఆ ఆటంకాలు రాజ్యాంగ విరుద్ధాలని ప్రకటించారు. దక్షిణాన కొన్ని ప్రదేశాలలో దౌర్జన్యాలు జరుగుతాయనే భయంతో నీగ్రోలకు కొంతకాలం వోటు హక్కు ఇవ్వలేదు కాని, **1952** లో జరిగిన ఎన్నికల లెఖ్ఖల ప్రకారం దక్షిణరాష్ట్రాలలో నీగ్రోల వోట్లు పెరుగుతున్నాయని తెలు తెలుస్తోంది.

**1921** లో దక్షిణరాష్ట్రాలలో వోటు హక్కు పొందడానికి 'వోటుపన్ను' అనే పేర కొంత పన్ను కట్టాలని విధించారు. ఈ నియమంవల్ల ఉభయ జాతులవారిలోను డబ్బులేనివారు వోటులేని వారయ్యారు. **1944** లో ఆరాష్ట్రాలలో వోటు చేయవలసినవారిలో **100కి10** మంది మాత్రం ఆపన్ను కట్టి వోటు వేశారట. **150** ఏళ్ళక్రితం సర్వసమాన్యంగా ఉన్న 'ఆస్తిగల వారికే ఓటు' అనే విధానపు చివర చిహ్నంఇది. ఈవోటు పన్నును ఫెడరల్ శాసనరీత్యా నిషేధించడానికి సెనేటులో జరిగిన ప్రయత్నాలన్నీ'కాలహరణ' విధానం ద్వారా వమ్ము చేయబడ్డాయి. కాని తరువాత చాలా రాష్ట్రాలు తామే ఆ పన్నులు రద్దు చేశాయి. పౌరస్వామ్యాలలో మరొకటి—ఆయుధాలు ధరించడానికిగలహక్కు.ఈహక్కువిపత్కరమైనదే అయినా అల్పసంఖ్యాకు లకు అధిక సంఖ్యాకులతో సమానత్వమనే ప్రజాస్వామ్య లక్ష్యానికి ఇది చిహ్నం. పూర్వం సాయుధ సైన్యాలలో నీగ్రోలకు, ఇతర అల్పసంఖ్యాక

జాతులవారికి యిష్టం చేయనవసరంలేని ఉద్యోగాలు యిచ్చేవారు. సేనాధిపతులను తయారుచేసే పాఠశాలలో నీగ్రోలను చేర్చుకొనేవారుకాదు. కాని కొద్దికాలం క్రిందట సాయుధ సైన్యాలన్నింటిలో జాతి విచక్షణకు వీలున్నంత త్వరలో స్వస్తి చెప్పమని ఆజ్ఞాపించారు.

1945 లో ఫ్రాన్సులో తెల్లసైనికుల దళాలలో నీగ్రోలను చేర్చుకొమ్మని ఆజ్ఞాపిస్తే చాలామందికి అపని యిష్టం లేకపోయింది. కాని నీగ్రోలు బాగా పోరాడగలరని తెలిసికొన్నతర్వాత, దక్షిణరాష్ట్రాల వారితో సహా, అందరు తెల్లవారూ వారిని ఆదరించి గౌరవించేవారు. సాయుధ సైన్యదళాలలో నీగ్రోలను కలిపివేయడం 1953 లో జరిగిన తర్వాత చాలా సత్ఫలితాలు కలిగాయి. సైన్యాలలో వర్ణ విచక్షణ పూర్తిగా సమసింపచేయడం కన్పడుతోంది.

రంగుజాతులను వేరుచేసే పద్ధతికి స్వస్తిచెప్పబడగానే అంటే ఉదాహరణకు నీగ్రోలను తెల్లవారి వినోదశాలల్లోకి, ఆహారశాలల్లోకి రానివ్వడం ఆరంభిస్తే—చాలాయితర పరిస్థితులలో కూడా వారియెడల విముఖభావం తగ్గిపోతుంది. మనం భయపడ్డంత తీవ్రనిరోధం ఏమీ లేకుండా—తెల్లవారిప్రక్కనే నీగ్రోలను ఉంచి, కర్మాగారాల్లో పనులు చేయించవచ్చునని అనుభవంవల్ల తెలుస్తోంది.

నీగ్రోలు, తెల్లవారు కలిసి మెసలడంవల్ల వారి విభేదాలు తీవ్రరూపం ధరించే బదులు పూర్తిగా తగ్గిపోతాయనే విషయం—వర్ణ విభజనకు విరుద్ధంగా శాసనాలు కావాలన్నవారికి ప్రోత్సాహకరంగా ఉన్నది. ఇవుడున్న పరిస్థితిని మార్చకుండా కొంతకాలం సాగనిస్తే—రంగు విభేదాన్ని తప్పనిసరిగా నిషేధించాలన్న శాసనాన్ని అందరూ తేలికగా ఆమోదిస్తారని వారి వాదన.

1941 లో అధ్యక్షుడు రూజ్ వెల్టు ప్రభుత్వంలోనూ, యుద్ధకాలపు అవసరాలకోసం పనిచేస్తున్న ప్రైవేటు సంస్థలలోనూ, ఉద్యోగులను నియమించడంలో నిష్పక్షపాత విధానం అనుసరించబడేట్టు చూడడానికి ఒక సంఘాన్ని నియమించాడు. ఈ సంఘం పరిశీలించిన వివాదాలలో ప్రతి ఐదు వివాదాలలోను నాలుగు, ఉద్యోగాలనుంచి వెళ్ళగొట్టబడిన నీగ్రోల వివాదాలు; లేక తెల్లవారికన్న తక్కువ జీతాలు యివ్వబడిన నీగ్రోల వివాదాలు ఉన్నాయి. మొత్తంవివాదాలలో నూటికి 8 వంతులు మతవిద్వేషం(ముఖ్యం

గా యూదులు యెడల) చూపించబడిన వివాదాలు. ప్రభుత్వశాఖలు, వస్త్రక సంస్థలు, కార్మికసంఘాలు అన్నీ అల్పసంఖ్యాకుల యెడల సవతితల్లి ప్రేమతో ప్రవర్తించినవే ! యుద్ధసమయంలో రూజ్ వెల్టు నియమించిన సంఘం పనిచేస్తున్నకాలంలో ఉద్యోగావకాశాలలో హెచ్చుతగ్గులు చాలా వరకు తగ్గించ బడ్డాయి. అందుకు చాలావరకు పనివారికొరత (Labour Scarcity) కారణం.

చాల రాష్ట్రాలలో ఉద్యోగాలలో నియమించడానికి న్యాయమైన సూత్రాలున్నాయి. అలాటి శాసనాలు చేయడానికి అనువైన రాష్ట్రాలలో ప్రజాభిప్రాయం సమానత్వం వైపు ఎక్కువగా మొగ్గుచూపుతున్నది. అందువలన అచట అల్పసంఖ్యాకులకు ఉద్యోగాలివ్వమని యజమానులను ఆదేశించే శాసనాలు ఆచరణసాధ్య మవుతున్నాయి. అన్ని రాష్ట్రాలలోనూ ఇట్టిసమానత్వాన్ని పాటించమని ఆదేశించే ఫెడరల్ శాసనాన్ని సెనేటులో అటకాయించారు. చాలా రాష్ట్రాలు ప్రభుత్వశాఖలలో నీగ్రోలకూ, తెల్లవారికీ మధ్య విభజన ఉండితీరాలని కోరాయి. రాష్ట్ర ప్రభుత్వం నీగ్రోలకు తెల్లవారితో సమానమైన ఉద్యోగా లిచ్చినట్లయితే, వారిని తెల్లవారినుండి వేరుచేసినా, ఆ విధానం 14 వ సవరణకు విరుద్ధంకాదని సుప్రీంకోర్టు 1896లో తీర్పు చెప్పింది. కాని అపుడు ఈ తీర్పుకు న్యాయమూర్తి హార్లాన్ అసంగీకారం తెలుపుతూ నిరసన భావాన్ని ప్రకటించాడు.

కాని నిజమేమిటంటే – నీగ్రోలకోసం ఏర్పరచబడ్డ పాఠశాలలూ, ఇతర సంస్థలూ సేవా ప్రమాణంలో గాని, వ్యక్తి సంపదలలో గాని తెల్లవారికోసం ఏర్పడిన తత్తుల్యసంస్థలతో ఎన్నడూ సరితూగలేదు. పైగా – బలవంతంగా ఈ జాతులను వేరుచేయడమనే పని న్యాయమూర్తి హార్లాన్ ఉద్ఘాటించినట్లుగా "మనసోదర పౌరు లనేకులపై, న్యాయశాసనం దృష్టిలో మన సమాను లనేకులపై బానిసచిహ్నాన్ని హైన్యముద్రనూ వేస్తుంది....సమానమైన ఉద్యోగాలనే ఉలిపిరితెర–ఎవరిని మభ్యపెట్టలేదు." 1896 లో జరిగిన నిర్ణయం 40 సంవత్సరాలపాటు నిలచింది. తరువాత సమానంగా లేని చాలా ఉద్యోగాలు – విభజింపబడి ఉన్నంతకాలమూ సమానంగా చేయబడడానికి వీలులేదని న్యాయస్థానం క్రమంగా సూచించడం ప్రారంభిం

చింది. న్యాయస్థానాలలో తీవ్రతరమౌతున్న నిక్కచ్చితనం – కేవలం నీగ్రోలకోసం అత్యున్నతస్థాయిలో విశ్వవిద్యాలయాలు నెలకొల్పడానికయే విపరీతవ్యయం – దక్షిణరాష్ట్రాలలో, ముఖ్యంగా కళాశాలా విద్యార్థులలో సహనభావం అభివృద్ధిపొందడం – మొదలైనవాటివల్ల కొన్ని దక్షిణాది కళాశాలలలో నీగ్రో విద్యార్థులు చేర్చుకొనబడటానికి వీలుకలిగింది. ఈ కొత్త చర్యకు ఏ విధమైన హింసాయుత ప్రతిఘటనా లేకుండా, ఉంటే యీ మార్పు దేశవ్యాప్తం కావడానికి వీలుంది.

ప్రభుత్వరంగానికి ఆవల, పెద్దపెద్ద బేస్‌బాల్ ఆటగాండ్ర సంఘాలు నీగ్రో ఆటగాండ్రను తమ జట్టులలో చేర్చుకొనడంతో జాతిమొత్తంపై యీ విషయంలో మంచి మార్పు వచ్చింది. బేస్‌బాల్ ఆటను లక్షలకొద్దీ అమెరికనులు వారి రాజ్యాంగ పతకం వంటి పవిత్రచిహ్నంగా, వారి నిత్యజీవితాలతో కంటే సన్నిహిత సంబంధం గలదానిగా, పరిగణిస్తారు. అమెరికాలో అగ్రగణ్యమైన జట్టు ఏదో నిశ్చయించే ఆటల పోటీలలో (దీనినే Wrold Series అంటారు) ఆడడానికి అనుమతి లభించడం అంటే పరిపూర్ణమైన అమెరికను పౌరునిగా పరిగణించబడినట్లు గుర్తింపువంటిది. 'బ్రూక్లిన్ డాడ్జర్స్' అనే జట్టులో నీగ్రో ఒకడు ఉన్నందుకు కొన్ని జట్లు తీవ్రంగా ప్రతిఘటించడం, అప్పుడు ఆటగాండ్ర సంఘాధ్యక్షుడు ఆ జట్టు వారలకు జవాబుచెప్పిన మాటలతీరు, చూస్తే–సమానత్వాన్ని గుర్తించడమే వారి ఆశయమని బోధపడుతుంది. ఆ సంఘాధ్యక్షుడు చెప్పినట్లుగా "ఇది అమెరికా ఆడడానికి ఒక పౌరుడికి ఉన్న హక్కు మిగిలిన పౌరులకీ ఉంటుంది."

అమానుష, మానుషశత్రువులందరి బారినుండీ రక్షించబడడానికి పౌరునికి గల హక్కు, పౌరులందరితోను సమానంగా చూపబడే హక్కు చాలా చోట్ల ఏకీభవిస్తాయి. ముఖ్యంగా నిరుద్యోగం, మూఢత్వం, దారిద్ర్యం, అనారోగ్యం, ప్రజలను చుట్టుముట్టినపుడు – పాలకవర్గమైన అధిక సంఖ్యాకుల కన్న అసహాయులైన అల్పసంఖ్యాకులు ఎక్కువబాధలకు లోనవుతారు. కాని ఎవ్వరూ రోగాలకూ మృత్యువుకూ అతీతులుకారు. అధిక సంఖ్యాకులు కూడా నిరుద్యోగ ప్రమాదానికీ ఇతర నష్టాలకూ లోనవుతుంటారు అసంఖ్యాకులైన ప్రజలు కూలిడబ్బులకై పనులు చేస్తుంటారు. వారికి కూలి బేర

చూడగల ఓపికను శాసనరీత్యా సమకూర్చకపోతే న్యాయమైన ప్రమాణంలో వారి జీవితం గడవదు.

కార్మికుల స్థితిగతులు యూరపు అమెరికాల ప్రభుత్వాలకు చాలా శతాబ్దాలపాటు కలవరం కలిగించాయి. మధ్యయుగపు రోజుల్లో విప్లవకరమైన అశాంతియుతమైన కార్మికవర్గపు బారినుండి ధనికవర్గాలను సంరక్షించడమే ప్రభుత్వ బాధ్యతగా ఉండేది. 19వ శతాబ్దంలో–కార్మిక సంఘాలను అణచివేయడం ప్రభుత్వాలకు యిష్టమయిన పని. ఈ సంఘాలను సాంప్రదాయిక ధర్మశాస్త్రం కుట్రదారుల కూటముగా చూచేది. నేడు న్యాయశాసనం కార్మికుల పక్షం వహించి కార్మికుల విషయంలో యజమానులు అనాలోచితంగా ప్రవర్తించ కుండాను, కొన్ని సాధారణమైన నష్టాలు వారికి జరగకుండాను చూస్తూంది.

1833 లో చేయబడిన జాతీయ పారిశ్రామిక ఉద్ధరణ శాసనం కార్మికులకు సంఘాలుగా ఏర్పడే హక్కును ఇచ్చి - ఆ సంఘాలను కార్మికుల తరపున జీతాలు బేరమాడే ప్రతినిధులుగా గుర్తించమని యజమానులకు ఆదేశించింది. తరువాత జరిగిన వాగ్నర్ శాసనం, టాఫ్ట్ – హార్ట్లీ శాసనం కార్మికులకన్న యజమానులకే లాభదాయకంగా ఉన్నాయి. కార్మికులకు యజమానులకు మధ్య న్యాయమైన పద్ధతిలో శాంతిని ఏర్పరచడానికి వీలుగా – న్యాయస్థానాలు అమలు పరచగల కొన్ని సూత్రాలను ఏర్పరచడమే ఈ శాసనాల ప్రధానోద్దేశ్యం.

అయితే 'న్యాయమైనపద్ధతి' కి యిచ్చే నిర్వచనంలోని అస్థిరత్వమే – ఈ విషయంలో రాజకీయాలకు తావు యిస్తుంది. గతంలో – కార్మికులు పలుబాధలకు లోనయినారు. తాము సుసంఘటితం అయ్యే హక్కు కోసం వారు, రక్తాన్ని ధారపోసి పోరాడవలసివచ్చింది. వారినాయకులు సంప్రదింపులు జరపడంలో కన్నా–పోరాటంలో ఆరితేరినవారు, అటువంటి స్థితిలో న్యాయశాసనం వారిపక్షం వహించింది. దీనస్థితిలో నున్న కార్మికులయెడల ప్రజలకున్న సానుభూతి-తాము దీనస్థితిలో లేమని కార్మిక సంఘాలు ఋజువు చేయడంతో క్రమంగా తగ్గిపోయింది. అపుడు రాజకీయ వాతావరణంలోని మార్పులవల్ల కాంగ్రెసులో రిపబ్లికన్‌పార్టీ అధికారంలోకి వచ్చింది.

వారు 1947 లో యజమానుల హక్కులను సంరక్షిస్తూ–'టాఫ్ట్, హార్లే' శాసనం చేశారు. ఈసమయంలో కార్మికుల నాయకులు అటు పెట్టుబడిదారులతో గాని, ఇటు రిపబ్లికన్‌పార్టీలతో గాని, పోరాడడానికి కావలసిన ఐకమత్యంతో లేరు. 1952 లో రిపబ్లికనులు అధికారంలోకి వెళ్ళడానికి వారే సహాయ పడ్డారు. కార్మికులు అనేక సమస్యలపై సొంతంగా, స్వేచ్ఛగా వోటు చేసుకోడానికి వీలయినంత బాగా వారి హక్కులు భద్రపరుప బడ్డా యనేది– దీనివలన తేలే విషయం.

చాలా రాష్ట్రాలలో ఏవో రకమైన సాంఘిక భద్రతా శాసనాలుఉన్నా, దేశ వ్యాప్తంగా ఒకే "జాతీయ సాంఘికభద్రతా వ్యవస్థ" ఏర్పాటు చేయడంలో అమెరికా నేటి నాగరిక ప్రపంచంలో చాల దేశాలకన్న వెనుకబడింది. 1935 లో జాతీయశాసనం ఆమోదించబడిన తర్వాతనుండీ ముసలికాలపు భీమాపద్ధతి చాలారకాల కార్మికులకు కూడా వర్తింప చేయబడింది. నిరుద్యోగులకు భీమా, అంధులకూ అశక్తులకూ ప్రభుత్వ సహాయం, అసహాయులైన పిల్లలకు సహాయం, వంటివి–ఫెడరల్ ప్రభుత్వం చేతనో, రాష్ట్రప్రభుత్వం చేతనో అమలు పరుపబడుతున్నాయి. సాంఘిక భద్రతవలన–వృద్ధాప్యంలోను, అనారోగ్యంలోను దేశవ్యాప్త నిరుద్యోగ సమయంలోనూ కూడా ప్రజలకు కొనుగోలుశక్తి పడిపోకుండా నిలుస్తుందనే సత్యాన్ని యిప్పు డంతా గుర్తిస్తున్నారు. కార్మికులకు, వ్యాపారస్థులకు కూడా ఇందువల్ల ఆర్థికలాభాలు కలుగుతాయని గుర్తింపబడడంతో ఉభయ రాజకీయ పక్షాలు ఎక్కువగా సాంఘిక భద్రతా కార్యక్రమాన్ని బల పరుస్తున్నాయి.

అమెరికన్ ప్రజలు ప్రభుత్వంలోని వివిధ అంతస్థులనుండి కోరే వివిధ రక్షణలు విలక్షణమైన రాజకీయ వివాదానికి కారణం మవుతాయి. సాంఘిక భద్రత విషయంలో జరిగే ప్రతి నూతన ప్రయత్నమూ సమాజవాద లక్షణాలు కలదనీ, అది ఆచరణలో పెడితే పన్నులు చెల్లించే పౌరుల డబ్బు వృథా అవుతుందనీ, ప్రజలకు నిజంగా కావలసినదంతా 'ప్రైవేటు' సంస్థలే చేయగలవనీ–సంప్రదాయ వాదులు అంటారు. అలాకాదు – ప్రైవేటు సంస్థలు ప్రజల కవసరమైన వన్నీ చేయడం లేదు – అనేక కారణాలవల్ల అవి

అలా చేయనూ లేవు-అందుచేత ఈ నూతన ప్రయత్నం సాగనిస్తే, దాని వలన కొంత నష్టం తగ్గుతుంది-పౌరుల ధనం చాలా పొదుపు అవుతుంది-అని ఔదార్యవాదు లంటారు.

ఈ వాదాలలోని తప్పొప్పులు ప్రతి ప్రత్యేక సందర్భానికీ మారుతుంటాయి. రాజకీయ వివాదాలు తత్కాలానికి అవిషయాన్ని నిశ్చయిస్తాయి. క్రొత్తపరిస్థితులవల్ల పాత నిశ్చయాలలో సందేహాలు వస్తే – ఆ నిశ్చయాన్ని పునః పరిగణనకు తీసుకొస్తాయి. మొత్తంమీద ప్రభుత్వం నిరోధించగల ప్రమాదాల నుండి ప్రజలను రక్షించడానికి వీలుగా ఎక్కువగా ప్రభుత్వమే సేవ చేయా లనే భావం – ఇప్పుడు ప్రజలలో ఎక్కువగా ఉన్నది.

అమెరికన్ ప్రజలు ఐక్యరాజ్య సమితిలో చేరే టప్పుడు సర్వమానవ స్వాతంత్ర్యాన్ని, స్వత్వాలను, అభివృద్ధి చేయడంలో ఆ సమితికి తోడ్పడడం తమ సభ్యత్వపు బాధ్యతలలో ఒకటిగా భావించారు. శ్రీమతి రూజ్‌వెల్టు, అమెరికాప్రతినిధిగాను, అధ్యక్షురాలుగాను ఉన్న ఒక ప్రత్యేక సంఘం ఒక 'మానవస్వత్వ ప్రకటనను' తయారు చేసింది. ఆ ప్రకటనను – సోవియట్ రష్యా, దాని ఉపగ్రహ రాజ్యాలూ తీవ్రంగా నిరోధిస్తున్నా-ఐక్యరాజ్య సభ ఆమోదించింది; అనుసరించింది.

అమెరికా రాజ్యాంగంలోని 'హక్కుల పత్రం' కన్న ఈ మానవస్వత్వ ప్రకటన పురోగామిగా ఉండడానికి కారణం- హిట్లరు, సోవియట్ రష్యాల వల్ల అప్పటికి ఎవరూ ఎరుగని క్రొత్త అన్యాయాలు జరుగడమే. ఉదాహరణకు సమూహ వినాశనం – లేక ఒక జాతి సంతతిని ప్రభుత్వం సాధికార ప్రయత్నంవల్ల సర్వనాశనం చేయడం– చాల పురాతన కాలపు అలవాటులోదే అయినా– 20-వ శతాబ్దంలో దానిని నియంతృత్వ దేశాలు పునరుద్ధరించాయి కాబట్టి - ఐక్య రాజ్యాల ప్రకటనలో దానికి ప్రత్యేక శ్రద్ధ చూపబడింది.

'మానవస్వత్వ ప్రకటన' తో పాటు, ఆ సంఘాన్ని ఒక ఒడబడికరూపంలో ఏక పత్రాన్ని రచించుమన్నారు. దానిని అన్ని సభ్యదేశాలకు ఆమోదార్థం పంపించాలని ఉద్దేశించారు. మొదట చేయబడిన ప్రతిపాదన ప్రకారం ఈ ఒడంబడికలో అన్యాయం చెయ్యడం, అణగద్రొక్కడం మొదలైన వాని

నుండి ప్రజలకు రక్షణయేకాక, నిరుద్యోగంవంటి దురదృష్టాల నుండి రక్షణ మొదలైన అన్ని హక్కులూ ఉండిఉండేవి.

ఈ పనికై రెండు ఒడంబడిక లుండాలని అమెరికనులు అన్నారు. ఒకదానిలో న్యాయస్థానాలు సాధికారంగా అమలుపరచగల హక్కులు 'హక్కులు పత్రం' లో ఉన్నట్టు ఉంటాయి. రెండవదానిలో ప్రభుత్వాలు తొలగించడానికి అంకీకరించిన అనారోగ్యం. దారిద్ర్యం వంటి విషయాలుంటాయి. వీటి విషయంలో సంపూర్ణవిజయం ఆశించలేము కాబట్టి ఇవి కేవలం 'అంగీకారాల' రూపంలోనే ఉంటాయి. ఇవి న్యాయస్థానాలకు పోవడం మూలంగా లభించే హక్కులు కావు. అధికారంలో ఉన్నపార్టీ ప్రజలను రక్షించడంలోనూ, ప్రభుత్వబాధ్యకు, వ్యక్తుల బాధ్యతకు, తౌల్యం సాధించడం లోనూ పొందినవిజయం ఆధారంగా— ప్రజలు ఆ పార్టీకి యిచ్చే గౌరవాగౌరవాల వల్ల ఈ హక్కులు లభ్యమౌతాయి.

కాని ఈ ఒడంబడికల్లో ఏదీ అమెరికా సెనేటుకు ధృవపరిచే నిమిత్తం పంపబడేట్టు లేదు. అమెరికా శాసనాలలో అంగీకృతమైన అన్నిహక్కులూ ఈ ఒడంబడికలో చేర్చడానికి సమితి సభ్యులు అంగీకరించ లేదనేది ప్రధానమైన ఆటంకం. ఏ ఇతర ఒడంబడిక వలననూ అమెరికన్ ప్రజలకు వారి రాజ్యాంగం భద్రపరచే హక్కులు తగ్గవని చెప్పడానికి బలమైన న్యాయ ప్రమాణం ఉన్నా – ఈ విషయం సర్వజన సమ్మతం కాలేదు. అందుచేత సాహసంచేసి ఆ ఒడంబడికలను ఆమోదించే సూచనలను సెనేటు కన్పరచడం లేదు.

అన్ని జాతులలోనూ వ్యక్తి స్వామ్యాలకు శాసనయుతరక్షణ కలిగించడాన్ని ఐక్యరాజ్య సమితిలో అమెరికా బలపరుస్తుంది. కాని ఈవిషయంలో సర్వ సమగ్ర పరిణతి ఎక్కడా కలుగుతుందని అది ఆశించదు. మా దేశంలోనే మాశాసనాలలోనూ, మా ఆచారాలలోనూ అనేక లోపాలు ఉండడాన్ని మేము గమనిస్తున్నాము ; అంగీకరిస్తున్నాము. కాని ఇతోధిక న్యాయం వైపు,సమానత్వంవైపు జరిగే పురోగమనాన్ని కూడా మాదేశంలో చూడగలుతున్నాం. మాభావనా శక్తి పరిణతి పొందించగలంత వేగంతో మారాజకీయ విధానం వ్యక్తిస్వామ్య సూత్రాలను రూపొందిస్తోంది. అంతకన్నా మంచి మార్గం మాకు తెలియదు.

---

# అమెరికన్ ప్రభుత్వ తత్వం

రాజ్యాంగరీత్యా సంయుక్తరాష్ట్రప్రభుత్వం ప్రతిరాష్ట్రమూ రిపబ్లికన్ ప్రభుత్వం ఏర్పరచుకొనే హక్కును భద్రంగా రక్షిస్తుంది. ఈ దేశంలో రాజకీయ సిద్ధాంతలపై చర్చలన్నీ ప్రభుత్వాలు సక్రమంగా ఏ విధమైన పని చేయ గలవు అనే విషయంపైనే జరుగుతాయి కాబట్టి, ఈరాజ్యాంగ సూత్రాన్ని స్మరించవలసిన అవసరం కలగలేదు. నియంతృత్వాన్ని స్థాపించాలనే తీవ్రవాదులు ఎప్పుడూ స్థానికంగానైనా అధికారంలోనికి రాలేదు. అయితే 1840 లో మాత్రం రోడ్ ద్వీపరాష్ట్రంలో విప్లవం చెలరేగింది. అప్పుడు అధ్యక్షుడు తాను ధర్మ మనుకొన్న పక్షానికి సహాయం చేశాడు. స్త్రీలకు వోటుహక్కు ఇవ్వని రాష్ట్రాల ప్రభుత్వం రిపబ్లికన్ ప్రభుత్వం కాదని ప్రకటించాలని 1874 లో స్త్రీలకు వోటుహక్కు ఇవ్వాలనే ఉద్యమనాయకులు విఫలప్రయత్నం చేశారు. మొత్తంమీద 'రిపబ్లికన్' ప్రభుత్వం అంటే ఏమిటో నిర్వచించడానికే న్యాయస్థానాలు– అది 'రాజకీయ' విషయం అని చెప్పి– నిరాకరించాయి.

అందుచేత దీని సారాం మేమిటంటే – లూయిజియానా రాష్ట్రంలో 1930 ప్రాంతాల్లో హ్యూలాంగ్ పాలించిన ప్రభుత్వంవంటి ప్రభుత్వం నియంతృత్వ ప్రభుత్వమా ? కాదా ? అందులో మిగిలిన అమెరికన్‌జాతి జోక్యం కలిగించుకోవాలా ? వద్దా? అనే విషయాన్ని రాజకీయ చర్య ద్వారా అమెరికన్ ప్రజలు నిశ్చయిస్తారు. మిగిలిన అమెరికా రాష్ట్రాలన్నీ ఒకరాష్ట్రం విషయంలో జోక్యం కల్గించుకోదలంచుకుంటె అప్పుడు ఆ రాష్ట్రంలో రిపబ్లికన్ ప్రభుత్వ విధానానికి భంగం కలిగిన పరిస్థితి ఏర్పడిసదని ప్రకటిస్తాడు. దానికి సుప్రీంకోర్టు అభ్యంతర పెట్టదు.

మామూలుగా అమెరికనులచేత 'రిపబ్లికన్' రాజ్యాలుగా పరిగణింపబడుతూన్న ప్రభుత్వాలను– అవినీతి పరులయిన రాజకీయవేత్తలు వాటి తత్వాన్ని ఎంత అతిక్రమించినా– 'రిపబ్లికన్' రాజ్యాలుగానే పరిగణిస్తారు. ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ రాజ్యాంగం తనకు యిచ్చిన అధికారాలతో పాలిస్తుంది. ఆ రాజ్యాంగాన్ని హింసాయుత విప్లవం అక్కరలేకుండా ప్రజలు

సవరించుకోవచ్చు. ప్రజలకు బాధ్యులైన ప్రతినిధులు శాసనాలను చేస్తారు. శాసనరీత్యా రక్షించబడాలని ప్రజలు భావించిన అన్ని వ్యక్తిస్వామ్యాలు ఆ విధంగా శాసనరీత్యా రక్షించబడుతూంటాయి. కాని ఆదరణలో ఒక్కొక్కప్పుడు ఆ శాసనప్రవర్తన అపమార్గాలు పట్టవచ్చు. ప్రభుత్వ పీడననుండి తనను రక్షించ మని పౌరుడు అర్థించడానికి న్యాయస్థానాలు ఉన్నాయి. అమెరికనులు రిపబ్లికన్ రాజ్యవిధాన మని పేర్కొనే రాజ్యానికి ముఖ్య లక్షణా లివి. ఇవి ఎల్లప్పుడూ పుస్తకాలలోని సూత్రాల ప్రకారమే వర్తించక పోవచ్చు కాని, అంత మాత్రాన అవి నిష్ఫలం అయినట్టు కాదు.

20–వ శతాబ్దంలో ప్రపంచ ప్రజానీకమంతా హిట్లరు, సోవియట్ రష్యా చేస్తున్న పన్నులు గమనిస్తూన్న సమయంలో స్వేచ్ఛాప్రియ ప్రజలు వాంఛించే రాజ్యవిధానాల బహిరాకారాలే చాలా విలువైనవిగా పరిగణించబడ్డాయి. రష్యావంటి దేశపు రాజ్యాంగంలో కూడా– ఇంచుమించు అమెరికనులు తమ స్వాతంత్ర్యం రక్షించుకోవడానికి అవసరమనుకొన్న హక్కులన్నీ ప్రజలకు వాగ్దానం చేయబడి ఉండవచ్చు. కాని రాజకీయ ప్రతిపక్షాన్ని ఏర్పరచి, ప్రభుత్వ నిర్వాహకులకు పోటీ నిలబడగల అవకాశం ప్రజలకు లేకపోతే ఈ వాగ్దానా లన్నీ వట్టి శుష్కప్రియా లవుతాయి. 'రిపబ్లికన్' ప్రభుత్వాన్ని ఏర్పరచే న్యాయ శాసన సంచయ మంతా–అవినీతికరం కావడానికి అవకాశా లున్నాయి. కాని ప్రజలకు రాజకీయసంఘటనాస్వాతంత్ర్యం ఉంటే–వారే ఆ అవినీతిని తుడిచిపెట్టి యథేచ్ఛగా సాంప్రదాయిక స్వాతంత్ర్యాలను తిరిగి స్థాపించుకుంటారు. స్వేచ్ఛగల దేశంలో వోటరు వోటు వేస్తున్నప్పుడు ఎవరూ గమనించడంగాని, బెదరించడంగాని కూడదనే శాసనం ఉంటే, ఆ శాసనాన్ని అందరూ శిరసావహిస్తూంటే, ప్రజలు తమ యిష్టంవచ్చిన శాసన సభను, అధ్యక్షుణ్ణి ఎన్నుకొనడానికి వీలుంటుంది. వారికి అవసరమని వారు భావించిన హక్కులను ఏర్పరచమని పాలకులను అడగడానికి వీలుంటుంది,

సర్వ స్వాధికారులుగా వ్యవహరించడానికి ప్రజలకు వీలున్న రాజ్య రూపాలు అమలులో ఉన్నప్పుడు, అనేక పరపరవిరుద్ధ ప్రయోజనాల వలననూ, వారి నిశ్చయ సూత్రాల వలననూ, వారి భావవిధానం వల్లనూ, వారి

చర్యలు నిచ్చయించ బడతాయి. అమెరికన్ ప్రజల రాజకీయతత్వం చాలా క్లిష్టమైనదీ, ఒక్కొక్కప్పుడు పరస్పర విరుద్ధమైనదీని.

అమెరికన్ ప్రభుత్వ సిద్ధాంతంపై అమెరికమలూ, ఇంగ్లీషు వారూ ప్రభుత్వ పీడనను ఎదుర్కొంటూ చేసిన పోరాటపు దీర్ఘచరిత్రయొక్క ప్రభావం ఉన్నది. ఈ చరిత్రలో గమనార్హమైన మొదటి మైలురాయి- 1215 లో మొదటి జాన్‌కు వ్యతిరేకంగా భూస్వాములు జరిపిన పోరాటం. దీని ఫలితం గానే లిఖితపూర్వమైన హక్కుల పత్రంగా 'మాగ్నా కార్టా' లభించింది. కాని, 'మాగ్నా కార్టా' లో ప్రభువుల హక్కులను గురించే ఎక్కువగా ప్రస్తావించ బడింది గాని, అందులో సామాన్యుల హక్కుల విషయమై హామీలు ఏమీలేవు. కాని రాజు చేసిన విపరీత దుర్వ్యయం వల్ల, లంచగొండులైన ఉద్యోగుల నుండి ప్రజలను రక్షించలేక పోవడం వల్ల, ప్రజలు రాజు యెడల కుపితులై ఆ పోరాటంలో భూస్వాములను బలపరిచారు.

ఇంచుమించు ఇలాటి వివాదమే మరల అమెరికన్ విప్లవ సందర్భంలో సంభవించింది' అపుడు ప్రజలంతా రాజు వ్యతిరేకంగా వలస ప్రభుత్వాలను బలపరచారు. రాజులు శాసనాధికారాన్ని దుర్వినియోగం చేయడమే తమ కష్టాలకు కారణ మనీ, మనరాజ్యాల శాసనసభలూ, వారి వారసులైన రాష్ట్ర ప్రభుత్వాలూ తమ హక్కులకై పోరాడుతా యనీ ప్రజలు భావించారు.

'మాగ్నాకార్టా' నాటి నుండి, కార్మికులకు సంఘాలుగా ఏర్పడి పనిచేసే హక్కు శాసనరీత్యా ఇవ్వబడిన నేటి రోజు వరకూ – అమెరికన్ సంప్రదాయపు పునాదులైన స్వాతంత్ర్య, సమానత్వ భావాలు రూపొందించడానికి మురికి యిళ్ళ న్లోంచి వచ్చే విప్లవ వాదులు కాక ఏవో కొన్ని హక్కులనైనా అనుభవిస్తున్న ప్రజలు కారకులైనారు. ఇంగ్లండులో పూర్వపు రోజులలో సామాన్య ప్రజలు తమకన్న అధికులపై ఒక్కొక్కప్పుడు తిరుగబడ్డారు. ఉదాహరణకు 1381 లో వాట్‌టేలర్ తిరుగుబాటు ఇటువంటిది. కాని వివేకవంతమైన ఆవేశరహితమైన నాయకత్వం లేకపోవడంతో వారుకోరిన సంస్కరణలు జరుగలేదు. చివరకు ఇతోధిక ప్రజాస్వామికసమాజం ఏర్పడేవీలు పాబల్యము, ప్రాపకము కలిగినవ్యక్తులు ప్రబలులైన ఇతరవ్యక్తులను, ప్రభు

త్వాలను నిరోధించి పోరాడడం మూలంగానే కలిగింది. ఈ విధమైనచరిత్ర ఫలితంగానే — అమెరికనుల తత్వంలో 'మధ్యతరగతివారి భావ ప్రభావం' గాఢంగా ఉంటూంది. సుసంఘటితులైన కార్మికులు తాము పీడిత కార్మిక జనానికి చెందినవారమని అనుకోరు. వారు తమ సంఘాలను బలపరుస్తారు కాని కమ్యూనిస్టు నియంతృత్వం ఏర్పరచే ఉద్దేశ్యంతో కాదు. మధ్యతరగతి. జీవనప్రమాణాన్ని సాధించడానికి, దానిని రక్షించుకోవడానికి, ఆలంబనంగాను, అమెరికను సమాజంలో మధ్యతరగతి వ్యక్తికున్న గౌరవాన్ని సంపాదించడానికి సహాయకరంగాను మాత్రమే వారు తమ సంఘాలను ఉపయోగించు కొంటారు.

అందుచేతనే అమెరికన్ రాజకీయ సంప్రదాయం గౌరవనీయమైన, సుసంఘటితమైన వ్యక్తుల ప్రయోజనాల మధ్య నిత్యమూ జరిగే సంఘర్షణల ఫలితంగా రూపొందింది. అమెరికన్ విప్లవంలోని వైలక్షణ్యం ఇదే. రాజు పక్షాన — వ్యాపారంలో అమెరికనుల పోటీ తప్పించుకోవాలనుకుంటున్న పెద్ద వర్తకులు, వస్త్ర నిర్మాతలు ఉన్నారు. వారి ప్రయోజనాలన్నీ రాజు, పార్లమెంటుల శాసనాధికార రీత్యా బలీయమై ఉన్నాయి. అమెరికనుల పక్షాన అమెరికన్ వర్తకులు, పుగాకురైతులు, భూస్వాములు, బ్రిటిష్‌వారి పన్నులూ, వర్తక నియమాలూ తమ నష్టం కలిగిస్తున్నాయని భావించే అనేకులు ఇతర రైతులూ, కార్మికులూ ఉన్నారు. కాంటినెంటల్ కాంగ్రెసులో అమెరికనులంతా వారి రాష్ట్ర ప్రభుత్వాల నాయకత్వాన కలసి ఉన్నా, వారిలో బలమైన ఐకమత్యం లేదు. తరువాత అందులో రాచరికవాదులైన కొందరు అమెరికన్ ప్రముఖులను తొలగించి వేశారు. మిగిలినవారు ఒక నూతన జాతిని నిర్మించి, దాని చరిత్రను రచించ వలసిన బాధ్యత నిర్వహించుటకు పూనికొని — బలమైన కేంద్ర ప్రభుత్వం నిరంకుశాధికారులు వహించగల అవకాశాలున్నాయనీ, కేంద్ర ప్రభుత్వాన్ని నిరోధించగల సంఘటిత సాధనంగా రాష్ట్ర ప్రభుత్వం ఉపయోగ పడుతుందనీ, గట్టిగా విశ్వసించారు- ఈ విషయాల్లో మొదటి జాన్‌కు వ్యతిరేకంగా భూస్వాముల పక్షం వహించిన వీరి ప్రాచీనులకూ, వీరికీ పోలికలున్నాయి.

థామస్ జెఫర్సన్ అనుయాయుల మొట్టమొదటి సూత్రమే కేంద్ర ప్రభుత్వం యెడల వారికిగల భయాన్ని అనిష్టాన్ని వ్యక్తంచేస్తుంది. 'జెఫర్సన్

ప్రజాస్వామ్యపు' నినాదం – "అత్యల్పంగా పాలించే ప్రభుత్వమే అత్యుత్తమ ప్రభుత్వము"– అని.

పైగా కేంద్రప్రభుత్వమే ప్రజలహక్కులను హరిస్తే–దానిని స్థానికప్రభుత్వాలు నిరోధించ వలసిన అవసరం రావచ్చు. అయినా ప్రజలకు కేంద్ర ప్రభుత్వమే తీర్చగల కొన్ని అవసరా లున్నాయి. విప్లవానికి తరువాత కేంద్ర ప్రభుత్వ వ్యతిరేకతను అధిగమించిన తీవ్రతగల పరిస్థితి దేశంలో ఏర్పడింది. వర్తకం పడిపోవడం, దేశరక్షణ సైన్యాలు బలహీనం కావడం– ఇవన్నీ వ్యాపారులకూ, ధనికులకూ, పదవులలో ఉన్నవారికి కూడా స్పష్టంగా తెలిశాయి. వారినాయకుడు అలెగ్జాండరు హామిల్టన్, హామిల్టన్ అనుయాయులు (లేక ఫెడరలిష్టులు) ఇగ్లండులో కేంద్రప్రభుత్వానికి వ్యతిరేకులే అయినా–అమెరికా సంయుక్తరాష్ట్రాలలో బలీయమైన కేంద్రప్రభుత్వం కావాలని పరిస్థితుల ప్రాబల్యం వలన అంగీకరించి, దానికై పట్టుపట్టారు. జెఫర్సన్ అనుయాయులు కూడా, రాజ్యాంగాన్ని ధృవీకరించవలసి వచ్చినపుడు యిష్టం లేకపోయినా దానిని అంగీకరించారు.

అమెరికనులు నేటికి హామిల్టన్, జెఫర్సన్ సిద్ధాంతాలలో వారి మనస్సులోని రాజకీయ ఉద్దేశ్యాలకు ఏది అనుకూలంగా ఉంటే దాని వైపు గంతు వేస్తున్నారు.

ఈ విధమైన ఊగులాట పద్ధతికి దృష్టాంతం 1933–55 మధ్యకాలంలో డెమోక్రటిక్ పార్టీ విధానాలలో కనిపిస్తుంది. డెమోక్రటిక్ పార్టీ జెఫర్సన్ నాయకత్వాన ఏర్పడి నేటికి అతని భావాలు ప్రకటిస్తూనే ఉన్నా–ఆ పార్టీ వారైన ట్రూమన్, రూజ్‌వెల్ట్‌లు ఫెడరల్ ప్రభుత్వాన్ని చాలా బలీయం చేశారు.

1933 లో అమెరికన్ ప్రజలు చాలా తీవ్రమైన ఆర్థికమాంద్యంతో బాధపడుతున్నారు. 1786–87 లో ఉండిన కష్టదశలాంటిదే యిది. సరిగ్గా 1787 లో హామిల్టన్ భావించి నట్లుగానే, డెమోక్రట్లు గూడా ఫెడరల్ ప్రభుత్వ అధికారాలు వినియోగించడం ద్వారా ప్రజల అవసరాలు సమర్థవంతగా నెరవేర్చ వచ్చునని భావించారు. అందుచేత పరిస్థితులకు సరిపడ్డట్లుగా వారి సిద్ధాంతాన్ని గూడా మలచుకొనవలసి వచ్చింది.

జెఫర్సన్, హామిల్టన్‌ల ప్రభుత్వ పద్ధతులే కాక, ప్రభుత్వ లక్షణాలకు ఉద్దేశ్యాలకు సంబంధించిన యితర సిద్ధాంతాలు కూడా అమెరికన్ రాజకీయ తత్వంపై ప్రభావాన్ని ప్రసరింప చేశాయి. ప్రస్తుత చర్యకు ఉపయోగపడే ఈరకమైన సిద్ధాంతాలు నాలుగుముఖ్యమైన విధాలుగా ఉన్నాయి. అరాజక వాదం, (Anarchism) సామాజవాదం (Socialism) అనేరెండు తీవ్రవాదాలకు మధ్యగా–అమెరికను రాజకీయ వివాదాలలో తరుచు కన్పించే మరి రెండు మితవాత సిద్ధాంతాలు కూడా ఉన్నవి. ఇందులో ఒక దాని పేరు 'వైయక్తికవాదం' (Individualism). రెండవ దానికి అమెరికనుల భాషలో నిశ్చితమైన పేరు ఏదీలేదు కాని, దానిసారంమాత్రం దేశాభివృద్ధిని సాధించడంలో ప్రభుత్వం తప్పకుండా సహకరించాలని. దీనిని "ప్రభుత్వ సంసర్గ వాదం" అనవచ్చు. (Interventionalism)

అమెరికన్ రాజకీయాలపై అరాజకవాదానికీ సమాజవాదానికీ ఇంచుమించు ఏమీ ప్రభావం లేదు. రాజ్యవ్యవస్థ చాలా కర్కోటక మైనదనీ దానిని పూర్తిగా రద్దుచేసి అసలు ప్రభుత్వమే లేకుండా చేయలనే తీవ్రవాదం– అరాజకవాదం. ఇక సమాజవాదం– పరిశ్రమలు, వర్తకం, వ్యక్తులచేతులలో ఉంటే ప్రజలు పీడించబడతారనీ, కార్మికులు పనిచేయడానికి వీలున్న అన్ని పరిశ్రమలనూ ప్రభుత్వమే స్వయంగా నిర్వహించాలని చెపుతుంది. ఇది ఇంకొక తీవ్రరూపం. ఈ సిద్ధాంతలేవీ అమెరికన్ ప్రజలకు రుచించ లేదు. చాలామంది అమెరికనుల మధ్య తరగతి భావాలు తీవ్రవాదాలకు ప్రతికూల మైనవి. బహుశా హామిల్టన్, జెఫర్సన్ సిద్ధాంతాల మధ్య ఊగులాడిన దీర్ఘ చరిత్రవల్ల అమెరికా ప్రజలకు- ఏ సైద్ధాంతిక వాదానికీ పూర్తిగా అంటకుండా మధ్యగా ఉండడం క్షేమకరమనే భావం కలిగి ఉండవచ్చు. ఏమైనా ప్రభుత్వంయొక్క క్రమమైన పనులను గురించిన వివాదాలలో నిత్యమూ చెప్పబడుతున్న సిద్ధాంతాలు రెండు. ఒకటి : జెఫర్సన్ పద్ధతికి అనుకూలంగా ఉండే 'వైయక్తిక వాదము'. రెండు : హామిల్టన్ నాయకత్వాన వెలువడిన ప్రభుత్వ సంసర్గవాదము.

వైయక్తికవాదం రీత్యా–అంతరంగిక శాంతి నిర్వహణ, విదేశ దండయాత్ర నుండి రక్షణ మాత్రమే ప్రభుత్వోచిత కార్యాలు. ఈ సిద్ధాంతానికి 'రాజ్య తాటస్థ్య వాద' (Laissez faire) సిద్ధాంతమని కూడా పేరుంది.

అంటే ప్రజలను వారి దారి వారినే చూచుకో నివ్వమని ప్రభుత్వం తాటస్థ్యం వహించడం. దోషులుతప్ప ఇతర ప్రజలంతా, వారి ప్రయోజనాలు చూచుకొనడానికి వారిని వదలిపెడితే, వారి క్షేమాన్ని వారే అత్యుత్తమమైన పద్ధతిలో సాధించుకుంటారనే విశ్వాసం ఈ వాదానికి మూలం. వారి యిష్టానుగుణంగా వారు తమ ప్రతిపక్షులతో సహకరించడమో, పోటీచేయడమో, లేక వారిని నిరోధించడమో చేస్తారు. ప్రజలందరి వ్యవహారాలను వివేకయుత నిర్ణయాలప్రకారం నడిపిస్తూ మంచివిషయాలకూ, చెడ్డవానికీ, మధ్య న్యాయమైన విచక్షణను చూపే "అగోచరమైన శక్తి" ఒకటున్నదని యీ వాదం నమ్ముతుంది. ఏ కొద్ది యాదృచ్ఛిక సందర్భాలలో నైనా కొందరు తగని కష్టాలు పడుతుంటే వారిని వ్యక్తుల ఔదార్యం, విరాళాలవల్ల పోషించవచ్చు.

ఈ వైయక్తిక సిద్ధాంతంలో ప్రజలకు ఒక సరుకు సరఫరా చేసే ఒకే ఒక మిల్లు దివాలా తీయడంవంటి నష్టమేదైనా జరిగితే – అది అర్థశాస్త్ర సూత్రాల ప్రకారం జరగవలసి జరిగిన పని అని భావించబడుతుంది. దేశం ఆర్థిక మాంద్యంలో పడితే అదికూడ అర్థశాస్త్ర ఫలితమే అంటారు. పరిస్థితుల సహజక్రమంలో జోక్యం కల్గించుకోడానికి చేసే ప్రయత్నాలన్ని విపత్కరములనీ, వివేకహీనములనీ, ఈ సిద్ధాంతపు అభిప్రాయం. ప్రకృతి సూత్రాల విషయంలో జోక్య కల్గించుకొంటే పరిస్థితులు మరింత విషమిస్తాయనే భయం ఈ విశ్వాసాలకు కారణం. 1929 లో ఆరంభమైన ఆర్థిక మహామాంద్యం సమయంలో ఈ వాదాలన్నీ ఉపయోగించ బడ్డాయి.

ఇక రెండవ సిద్ధాంతం ఎప్పుడూ స్వీయరక్షణ మాత్రమే చేసికొంటూ ఉంటుంది. కాబట్టి, దానికంత ప్రసిద్ధమైన పేరు రాలేదు. పైగా ప్రభుత్వం నుండి సహాయం పొందడం సిగ్గుచేటు వ్యవహారమనే భావం అమెరికనులలో బాగా పాతుకొని పోయింది. కాబట్టి అటువంటి సహాయాన్ని ప్రతిపాదించే సిద్ధాంతం ఒకటి తమ కున్నదని అంగీకరించరు. అందుచేత అమెరికనులు తమకు ప్రభుత్వం ఏదైనా చెయ్యాలని ఆశించే టప్పుడు–"దీనికి ఏదైనా శాసనం ఉండాలని" అనుకొన్నప్పటికీ, ఎవరి కైనా సహాయం జరగడం కోసం వారు పన్నులు కడుతున్నప్పుడు– అటువంటి అలవాట్లుఅమెరికన్ సాంప్రదాయాన్ని నాశనం చేయవచ్చునని బాధ పడతారు.

ప్రజలకు శాంతి, దేశానికి రక్షణ కల్పించడం మాత్రమే కాక, ప్రభుత్వమే చేయగల మరికొన్ని పను లున్నాయనేది రాజ్య సంసర్గ వాదపు సారాంశం. వర్తకులు తమ్ము నానాబాధలు పెట్టే అంతర్రాష్ట్ర వర్తక నిరోధాల నుండీ, డబ్బు విలువ విపరీతంగా చంచల మవడం నుండీ, తప్పించుకొనడానికి వర్తకంపై దేశవ్యాప్త నియమనం కావాలని తీవ్రంగా పట్టు బట్టి ఉండకపోతే రాజ్యాంగం రచింపబడి ఉండేదే కాదు. వర్తకాన్నీ, విత్తాన్నీ, పోస్టల్ వవ్యస్థనీ, పేటెంటు హక్కులనూ, రక్షించడానికి కేంద్ర ప్రభుత్వానికి ఎక్కువ అధికారాన్నిచ్చే ప్రత్యేకోద్దేశ్యంతోనూ, దేశక్షేమం సాధించాలనే విశాల భావంతోనూ, రాజ్యాంగం రూపొందించ బడింది.

ఈ విధంగా నేటి రిపబ్లికనుల పూర్వీకులైన ఫెడరలిస్టులు— ప్రభుత్వం శాంతి భద్రతలు కాపాడడమూ, శత్రువులను పారద్రోలడమే కాక ఇంకా చాలాపనులు చేయాలన్న వాదంతో తమ పార్టీని ప్రారంభించారు. అభివృద్ధికి, పురోగమనానికి, అవసర మైనంత పరిమితులలో వ్యాపారానికి ప్రభుత్వ సహాయం కావాలని కోరేవారే వీరంతా.

ఫెడరలిస్టులు ఏ సూత్రం ఆధారంగా రాజ్యాంగాన్ని బలపరచారో ఆ సూత్రప్రకారమే వారి వారసులు పరిశ్రమాభివృద్ధిని ప్రోత్సహించడానికి "రక్షణ సుంకాలు" విధించడాన్ని బలపరచారు. దేశచరిత్ర యొక్క తొలి దినాలలో ఫెడరల్ ప్రభుత్వం చేసిన చాలా ప్రజాక్షేమ కార్యావల్ల చిన్న రైతులు కార్మికుల కంటె, వ్యాపారస్థులకే ఎక్కువ లాభం కల్గింది. అందుకనే జెఫర్సన్ అనుయాయులు ప్రజోపయోగకర కార్యక్రమాల వ్యాప్తిని వ్యతిరేకించి, వైయక్తిక సిద్ధాంతాన్ని అనుసరించారు. సరిహద్దుప్రజల నాయకుడైన ఆండ్రూ జాక్సన్ 1828 లో అధ్యక్షుడై — నేషనల్ బ్యాంకు—సరిహద్దు ప్రాంతాలలోని చిన్నరైతులకూ, చిన్న వర్తకులకూ చేసే సహాయంకన్నా నగరంలోని పెద్ద వ్యాపారస్థులకు ఎక్కువ అనుకూలంగా పనిచేస్తోందని ఆ బ్యాంకుతో దెబ్బలాడాడు.

ఈ విధంగా ఒక పార్టీ ఒకసారి, మరొకపార్టీ ఒకసారి వైయక్తిక సిద్ధాంతాన్ని, ప్రభుత్వ సంసర్గ విధానాన్ని ఎందుకు బలపరుస్తుందో అర్థం చేసుకొనడానికి— ఏ సిద్ధాంతం ఎక్కువ ఆస్వాద్యంగా కనిపించేదో మనం అర్థం చేసుకోవాలి. కాని ఈ రెండు పక్షాలవాళ్ళూ రాజీపడి, ప్రతి వ్యక్తికీ కావల

సిన దంతా ప్రభుత్వమే సమకూర్చడానికి అంగీకరించకూడదా? అనవచ్చు. కొంతవరకు ఈ పనికూడా వారు చేస్తారు. కాంగ్రెస్ సభ్యుడు తన జిల్లాలో పోస్టాఫీసో, ఆనకట్టో కట్టాలని కోరుతాడు. తనతో సహకరించి మిగిలినవారు ఓటుచేస్తే వారి పనులకు అనుకూలంగా తాను ఓటుచేస్తాడు. ఫెడరల్ ప్రభుత్వపు పనులను విశాలవ్యాప్తం చేయడానికి చేసే ఈ రకమైన పనికి కూడా కొన్ని పరిమితు లున్నాయి. ఒకటి: ఎక్కువ పన్నుల యెడల ప్రజలకున్న అనిష్టం. రెండవది: చాలా ప్రభుత్వ కార్యక్రమాల వల్ల ప్రైవేటు వ్యాపార రంగంలో ప్రభుత్వం జోక్యం కల్గించుకొనడమో లేక దానిని క్రమబద్ధం చేయడమో జరుగవలసి రావడం. ఉదాహరణకు 'నిర్వాహక సంస్థా నిషేధక శాసనాన్ని' అమలు పరిస్తే, మొత్తంపై వ్యాపారం బాగు పడినా, తప్పకుండా కొన్ని కంపెనీలకు— తరుచు చాలా పెద్దవాటికి— నష్టం కలుగుతుంది. ఈవిధంగా నష్టపోయినవాళ్ళు తరుచు వైయక్తిక వాదాన్ని, ఫెడరల్ ప్రభుత్వ కార్యక్రమాలను పరిమితంచేసే వాదాన్ని, బల పరుస్తారు.

కాని పార్టీలు చేసే వాదనలు తరచు వారివారి ప్రత్యేక ప్రయోజనాలకు అనుగుణంగా ఉన్నా— అదే పార్టీల విధాన నిర్ణాయకసూత్రం అని పొరపడ కూడదు. ఒకప్రక్క అరాజక వాదమూ, వేరొకప్రక్క సమాజ వాదమూ ఉండగా మధ్యన ఉన్న ఈ రెండు అంచుల రాజకీయ సిద్ధాంతం వల్ల అమెరికన్ ప్రజలు అర్థికాభివృద్ధిని, అనేక విపత్తుల నుండి రక్షణనూ పొందారు. అందుకని వారు ఒకవంక ప్రభుత్వపు జోక్యాలవలని ప్రయోజనాలని గురించి వాదిస్తూ, రెండవ వంక వైయక్తిక ప్రవృత్తిని అణచివేస్తే వచ్చే ప్రమాదాలను గురించి హెచ్చరిస్తూ, ఈ మధ్యే మార్గంలోనే నడుస్తారు. తార్కికంగా చూస్తే ఈ రెండు వాదనలూ కూడ పాక్షిక సత్యాలు. ఓటుదార్లు ఈ రెంటికి మధ్య అనువైన పద్ధతిలో వర్తిస్తే సరిగ్గా అమెరికన్ప్రజలు కోరే ప్రభుత్వం వస్తుంది.

ఫెడరలిస్టుల వారసులు వైయక్తిక వాదాన్ని బలపరిచేవారు గాను, జెఫర్సన్ అనుయాయులు ప్రభుత్వపు అధికారాలు వ్యాప్తి చెందాలని వాదించే వారుగాను తయారవడానికి దేశంలో జరిగిన శాస్త్రాభివృద్ధి. నూతన వస్తు సృష్టి కారణం. 19–వ శతాబ్దారంభంలో అమెరికా ప్రజలలో అధికసంఖ్యా

కులు రైతులు. వారికి ప్రభుత్వం చేసిపెట్టవలసిన పనులేవీ ఉండేవి కావు. పశ్చిమ భాగాన్ని ప్రభుత్వం కొనడమో, జయించడమో చేసి ఆ ప్రాంతాన్ని రైతులకు స్వేచ్ఛగా వదలివేసి, యెర్ర ఇండియను జాతులనుండి వారికి నష్టం రాకుండా సైన్యసహాయం మాత్రం యిచ్చింది. తరువాత నుండి వారే వారి అభివృద్ధిని సాధించుకొన్నారు. వారు స్థిరపడి సంఘ వ్యవస్థను ఏర్పరచుకొనే టప్పుడు వారు ఎన్నుకొన్న నాయకులచేతనే పాలించబడ్డారు. వారి గొడ్డలను దొంగిలించినవారిని వారే శిక్షించారు. ఈ ప్రజలకు అమెరికన్ ప్రభుత్వాంగాలు పరిచితమే. వారికి ఎప్పుడు అట్టి ప్రభుత్వం కావలసి వచ్చినా ఒక సభచేసి అందులో దానిని అమోదించేవారు. అందుచేత 'సాంఘికసమయం' వల్ల(Social Compact) ప్రభుత్వం ఏర్పడిం దనడానికి పురాతన జాతులకన్నా ఇది చాల సన్నిహితమైన ఉదాహరణ.

ఇటువంటి అనుభవాలవల్ల పశ్చిమప్రాంతాల రైతులకేకాక అమెరికన్ ప్రజలకందరికీ-తమ వ్యవహారాలలో ప్రభుత్వ జోక్యం అవసరమయితే, అట్టి చాలా విషయాలలో స్థానికప్రభుత్వాలు కల్పించుకుంటే చాలునని నమ్మకం కుదిరింది. తరువాత శాస్త్రాభివృద్ధి వలని ఫలితాలు రానురాను ప్రబలం కాజొచ్చాయి. ట్రాన్సుకాంటినెంటల్ రైల్వే పసిఫిక్ సముద్రతీరం పొడుగునా వేశారు; కాలిఫోర్నియా ప్రజలు ధరలు విపరీతంగా ఉన్నాయనీ, తమ యెడల అన్యాయమైన విచక్షణ చూపబడుతోందనీ అనేవారు. ఈరైల్వేలు ఏ రాష్ట్రమూ నిర్వహించలేనంత పెద్దవైపోయాయి. పెట్రోల్ కనిపెట్ట బడడంతో ప్రజలు దీపాలకు క్రొవ్వొత్తులనూ, తిమింగిలపు చమురునూ, వాడడం మాని "రాతిచమురు" (పెట్రోలు) వాడడం ప్రారంభించారు. ఈ పెట్రోలు వ్యాపారం అతికొనలంలో గుత్తవ్యాపారమై పోయింది.

అందువలని ఫలితాలు ప్రజలకు యిష్టమైనవి కావు. రైలుమార్గాలు ఫెడరల్ ప్రభుత్వం నిర్వహించాలనీ, గుత్తవ్యాపారాన్ని ఫెడరల్ ప్రభుత్వమే అణగద్రొక్కాలని ప్రజలు కోరారు.

20 వ శతాబ్దంలో కొత్త అభివృద్ధులు ఇంకా త్వరితంగా వచ్చాయి. కొన్ని వ్యాపారాలు రాష్ట్ర సరిహద్దులు దాటి వ్యాపించటట్టి రాష్ట్ర ప్రభుత్వం కన్నా పెద్దదైన ప్రభుత్వం వాటిని నిగ్రహించవలసి వచ్చింది. రేడియోకు

వివిధమార్గాలు క్రమంగా కేటాయిస్తే తప్ప అమెరికాలో అది సరిగా పనిచే యడం కష్టమైంది. విమాన మార్గాలు క్షేమకరసూత్రాలు అనుసరించేటట్లు చూడడానికి, లైసెన్సులు ఇవ్వడానికీ, ఫెడరల్ ప్రభుత్వపు పర్యవేక్షణ అవసరమైంది. ఫెడరల్ ప్రభుత్వ సహాయం అవసరమైన పెద్దపని ప్రారం భించబడ్డప్పుడల్లా ఒక్కొక్క కొత్త ప్రభుత్వశాఖ వాషింగ్‌టన్‌లో ఏర్పడేది. ఆఖరుకు పౌరుడు స్వయంగా నడుపుకొనే మోటారుకార్లకుకూడా ఏరాష్ట్రమూ ఫెడరల్ ప్రభుత్వ సహాయం లేకుండా నిర్మించలేనన్ని పెద్దరోడ్లు కావలసి వచ్చినవి!

ఈలోపున ప్రకృతి శాస్త్రాభివృద్ధివల్ల కనుగొనబడిన నూతన పదార్థాలను ఫెడరల్ ప్రభుత్వం ప్రజలకు చాలా తక్కువధరకో, ఉచితంగానో అంద జేస్తే ప్రజలకు చాలా లాభంకలిగే పరిస్థితి ఏర్పడింది.తత్ఫలితంగా మొదట శాస్త్రీయవ్యవసాయాభివృద్ధికి వ్యవసాయశాఖ ఏర్పడినది. ఇందులో రాష్ట్రా లకు కూడ భాగస్వామ్యం ఉన్నది.శాస్త్రీయవావ్యసాయిక పరిజ్ఞానం అభివృద్ధి కావడంతో కొద్దిమందితో వ్యవసాయం జరిగి, వ్యవసాయ క్షేత్రాలలో ఉండే చాలమంది యితర పనులు చేసికొనడానికి వీలు కలిగింది. అమెరికాలో పెద్దయెత్తున పారిశ్రామిక ఉత్పత్తి జరగడానికి ఇది ముఖ్యమైన కారణం. వ్యవసాయ క్షేత్రాలలోఉన్న కొద్ది లక్షలమంది రైతులే మామూలుకన్నా ఎక్కువ పంట పండిస్తున్నారు. అందుచేత ఆపంటలు అమ్ముడు పోయే టట్టు చేయవలసిన బాధ్యతకూడా ఫెడరల్ ప్రభుత్వం తనపైన వేసికొన వలసి వచ్చింది.

ప్రజారోగ్యం విషయమై కనుగొనబడిన నూతన విషయాలు ప్రజలు సరా సరి జీవన పరిమితిని చాలా ఎక్కువ చేసినవి. కాని ఈవిషయమై బాధ్యత ప్రైవేటు డాక్టర్లపైన, నీటి సరఫరాకు, పారిశుద్ధ్యానికి బాధ్యులైన స్థానిక ప్రభుత్వాధి కారులపైననే పడి అక్కడితో ఆగలేదు. ఈవిషయమై దేశవ్యాప్త స్థాయిలో తప్ప మరొకవిధంగా చేయవీలుపడని కొన్నిపనులు ఏర్పడ్డాయి. అందువలననే అమెరికా ప్రజారోగ్యశాఖ ఏర్పడింది. వైద్య శాస్త్రాభివృద్ధి వల్ల, వ్యవసాయక్షేత్రాల నుండి రైతులు నగరాలకు రావడంవల్ల, కలిగిన మరొకఫలితం—ఎక్కువమందికి వృద్ధాప్యంలో ఉపకారవేతనాలు ఇవ్వడం.

పౌరులు ఒక రాష్ట్రంనుండి మరొకరాష్ట్రానికి తరలినా ఇది వారికి వర్తించ వలసి ఉన్నది. కాబట్టి ఇదీ ఫెడరల్ ప్రభుత్వ బాధ్యతే అయింది.

ఇక ఇతర శాఖలైనవాతావరణ కార్యాలయం, జనాభాలెక్కల కార్యాల యంవంటి వాటిని కేవలం పేర్లు ఉదాహరిస్తేచాలు. ఇవన్నీ పంటలు, జనాభా, వస్తూత్పత్తి మొదలైనవాటినిగురించి లెక్కలను తయారుచేస్తాయి. అమెరికన్ ప్రజలు వారి శాస్త్రజ్ఞానాన్ని, యాంత్రిక నైపుణ్యాన్ని ఉపయో గించుకొనేందుకు యీ శాఖలు అందించే సమాచారం అవసనరమని భావిం చబడింది. ఇంకా ఇలాటి చాలా ఇతరశాఖలను, ప్రైవేటు సంస్థలను, రాష్ట్ర ప్రభుత్వాలు కూడ ఏర్పాటు చేశాయి. కాని కొన్నిటిని నిర్వహించడం కేవ లం ఫెడరల్ ప్రభుత్వానికే సాధ్యమౌతుంది.

చిట్టచివరకు ఫెడరల్ప్రభుత్వపు ప్రాబల్యాభివృద్ధిలో అత్యద్భుత ఘట్టం 1932 లో రూజ్‌వెల్టు అధ్యక్షుడైనప్పుడు వచ్చిన ఆర్థిక మాంద్య తరు ణంలో వచ్చింది. ప్రజలు ఆర్థిక మాంద్యాన్ని చాలాకాలం ఓపికగా భరిం చారు. వాళ్ళు 'రాజ్య తాటస్థ్యవాదం' ప్రయోగించి చూచారు. ప్రకృతి సిద్ధ మైన మాంద్యంవల్ల మంచిరోజులు వాటంతట అవే వస్తాయేమోనని చూచారు. లాభం లేకపోయింది. వ్యక్తుల ధర్మాలవల్ల, స్థానిక రాష్ట్ర ప్రభు త్వాల సహాయంవల్ల, నిరుద్యోగాన్ని తగ్గించాలని చూచారు. అదీ నిష్ఫలమ యింది. చివరకు వారు ఫెడరల్ప్రభుత్వంపై ఈబాధ్యతపెట్టారు. అధ్యక్షుడు రూజ్‌వెల్టు చేసిన పనులన్నీ మచ్చుకి చేసిన ప్రయోగాలు మాత్రమే. కాని వాటివలన ఆర్థికమాంద్యం తగ్గిప్రజలు సుఖపడడంతో వాటినన్నిటినీ వారు ఆమోదించారు. 1946 లో ఆమోదించబడిన "ఉద్యోగ శాసనం"లో ఆర్థిక మాంద్యాన్ని అరికట్టడానికి ప్రభుత్వం "ఆచరణసాధ్యమైన సర్వసాధనాలు" ఉపయోగించాలని కాంగ్రెస్ గుర్తించడంతో ప్రభుత్వం ఈపనులన్నీ చేయా లన్న సిద్ధాంతంపై ఆమోదముద్ర పడింది.

ఈవిధంగా ఆమోదం లభించడంవల్ల ఈవిషయమై చర్చ పూర్తిఅయి నట్టు లేదు. ఇప్పటికీ అమెరికన్ ప్రజలు వైయక్తిక ప్రవృత్తిని వ్యాపారంలో స్వేచ్ఛగా పోటీఉండడాన్ని బలపరుస్తారు. గతంలో వివాదాస్పదంగా ఉన్న చాలా విషయాలలో నేడు ఉభయపక్షాలు ప్రభుత్వపు జోక్యాన్ని ఆమోదిం చాయి. కాని అంతమాత్రాన అవసరమైన పనులు, ప్రభుత్వేతర సంస్థలు

చేయగలిగిన పనులు కూడ ప్రభుత్వమే చేయాలని అమెరికన్ ప్రజలు కోరరు. 1952 లో ప్రజలు ఐసెన్ హెూవర్‌ను "డబ్బు పొదుపుచేస్తానన్న" అతని వాగ్దానంపై ఎన్నుకొన్నారు. దాని అర్థం-అతడు ప్రభుత్వ కార్యక్రమాల వృక్షాన్ని దులిపి ఎండుకొమ్మలను, విరగగొట్టి ప్రజలకు అక్కరలేని శాఖలను తీసివేసి బాగుచేస్తాడని.

ఫెడరల్ ప్రభుత్వ కార్యక్రమాలను వ్యాప్తంచేసే ఉద్యమాన్ని అలెగ్జాండర్ హామిల్టన్ నడిపిస్తున్నప్పుడు- అందువల్ల లాభం పొందబోయేది వ్యాపారస్థులు కాబట్టి- వారు హామిల్టన్ పక్షం వహించారు. 150 ఏండ్ల తర్వాత ఫ్రాంక్లిన్. డి. రూజ్‌వెల్టు ప్రభుత్వ కార్యక్రమాలు వ్యాప్తం చేస్తున్నప్పుడు తద్విధానం వలని ప్రత్యక్ష ఫలితాన్ని పొందేది నిరుద్యోగులు కాబట్టి వారు రూజ్‌వెల్టును బలపరిచారు. దీనివలన చివరకు వ్యాపారస్థులకుకూడా లాభం కలిగింది. కాని ముందుగా వారు ఎక్కువ పన్నులను చెల్లించవలసి వచ్చింది. తరువాతి సంవత్సరంలో ఆదాయం పెరుగబోవడంవల్ల వచ్చే ఆనందానికన్నా, తక్షణం చెల్లించవలసిన పన్నులవల్ల వచ్చే బాధ ఎక్కువ. ప్రజోపయోగ కార్యక్రమాలపై ప్రభుత్వాధిపత్యం అనివార్యమైనదని వారు తెలిసికొన్నారు. పైగా వారు ఫెడరల్ ప్రభుత్వంతో కంటె రాష్ట్రప్రభుత్వంతో తేలికగా వ్యవహరించ వచ్చుననికూడ గ్రహించారు. ప్రజోపయోగ కార్యక్రమాలలో స్వప్రయోజనాలు కలవాళ్ళు ఈ విషయాన్ని గ్రహించి ఫెడరల్ ప్రభుత్వ ప్రాబల్య వాదాన్ని వ్యతిరేకించి రాష్ట్రప్రభుత్వాలకు ఎక్కువ హక్కులు కావాలని వాదించారు. ఈ విధంగా శాస్త్ర పరిశోధన, నూత్న వస్తు సృష్టివలన పరిస్థితులలో కలిగిన మార్పు, డెమోక్రటిక్ పార్టీవారిని హామిల్టన్ అనుయాయులుగాను, రిపబ్లికన్ పార్టీవారిని జెఫర్సన్ అనుయాయులుగాను మార్చింది.

కాని నిజానికి అమెరికను లంతా ఈ రెండు వాదాలను కొంత కొంత బలపరుస్తారు. వారికి రెండూ పాక్షికంగా ఇష్టమే. వారు ప్రబలమైన ఫెడరల్ ప్రభుత్వం ఉండాలని, అయిష్టతతో ఆమోదించారు. సిద్ధాంత రీత్యా ఫెడరల్ ప్రభుత్వపు పనులు రాష్ట్ర ప్రభుత్వాలు చేయడం, రాష్ట్ర ప్రభుత్వాల పనులు స్థానిక ప్రభుత్వాలకు అప్పజెప్పడం అమెరికన్‌లకు యిష్టం. సాధ్య

మైతే ఈ మూడు ప్రభుత్వాలు చేసే పని అంతా ప్రభుత్వేతర సంస్థలకు అప్ప జెప్పడం వాళ్ళకు ఇంకా యిష్టం. 1952 లో జనరల్ ఐసెన్‌హొవర్, గవర్నరు స్టీవెన్‌సన్‌లు తమ ఎన్నికల ప్రచార సన్నాహాలలో - ఫెడరల్ ప్రభుత్వ వ్యాప్తిని తగ్గించాలనే వాంఛను పునః పునః ప్రకటించారు.

కాని ప్రభుత్వాధికారాలను వికేంద్రీకరించి వాని, వ్యాప్తిని తగ్గించడానికి అందరూ ఆమోదించిన ఆచరణమార్గం ఒక్కటీలేదు. వారు చేసేదల్లా- ముందు డబ్బు పోగుచేయాలని పట్టుబట్టడం- తరువాత వారికి నిత్య వ్యవహారాలలో అవసరమైన ప్రభుత్వశాఖ ఉంచాలని ఆమోదించడం.కాని వికేంద్రీకరణకు ఒక సిద్ధాంతం ఉన్నది. అది అనతికాలంలో అనేకుల ఆమోదాన్ని పొందవచ్చు. జాతీయ సహజసంపదల సంఘం అధ్యక్షుడు ఫెడరిక్ డిలానో దానిని "Unplanning" (పథకరహితం) అన్నాడు. బహుశా టెనిస్సీలోయ పాలకసంస్థ-దీనికి మంచిదృష్టాంతరం.

టెనిస్సీ లోయ పాలకసంస్థ (Tenessee valley authority) లో మొదటినుండి ఉన్న సుగుణ మేమిటంటే, అది కేవలం నదీ నిర్వహణనూ, తక్కువ ధరకు విద్యుత్ సరఫరా చేసే బాధ్యతనూ, ఇంకెవ్వరూ చేయడానికి ఒప్పుకోని శాస్త్రపరిశోధననూ మాత్రమే పైన వేసికొంది.తరువాత నుండి తమ పథకాలు తామే తయారుచేసికో దలచుకొన్న రాష్ట్రప్రభుత్వాలకు, స్థానిక ప్రభుత్వాలకు, నగారాలకు,అవసరమైన వివరాలను సలహాలను ఇవ్వడం ఆరంభించింది. "అన్‌ప్లానింగ్" అంటే అవసరమైన నిర్మాణం, నిర్వహణం, ధనసహాయం, శాస్త్రపరిశోధన మొదలైనవి ఫెడరల్ ప్రభుత్వం చేసి, మిగిలిన అంత పనిని తనచేతిలో ఉంచుకొనకుండా వదలివేయడం, స్థానికమైన చిన్నచిన్న పనులతో తమ కేమి సంబంధం లేకుండా కేంద్రాధికారులు స్థూలపథకాన్ని మాత్రం ఏర్పాటుచేయడం, ఇదే ఈ సిద్ధాంతపు లక్ష్యం.

ఈ విధమైన వికేంద్రీకరణ సిద్ధాంతమే ఫెడరల్ ప్రభుత్వపు పని. వ్యాపారం అభివృద్ధికావడానికి తగిన అనుకూల వాతావరణాన్ని కల్పించడమే ఉచితం అని రెండవ ప్రపంచ యుద్ధానంతర కాలంలో వ్యాప్తిపొందిన ఈ మాటలలో వ్యక్తమౌతోంది. ఇది కరుడుగట్టిన వైయక్తికవాదం ఎంత మాత్రమూ కాదు. ప్రజాజీవన శకటం ఒడిదుడుకులు లేకుండా సాగిపోవ

డానికి– సాధ్యమైన చర్యలన్నీ తీసికోవడం ప్రభుత్వపు బాధ్యత అని ఈ సిద్ధాంతం అంగీకరిస్తుంది. కాని అంతమాత్రాన ఆ బండికి ఉన్న ప్రతి చక్రం వద్ద కాపలా కాయడానికి ఒక ప్రభుత్వోద్యోగి ఉండనక్కరలేదు.

వ్యాపార రంగంలో అనుకూలమైన వాతావరణం ఏర్పడితే, దానిని గుర్తించి అర్థికవ్యవస్థను సాధ్యమైనంతవరకు నాతిశీతలంగా, నాత్యుష్ణంగా చేయడానికి ప్రభుత్వ శక్తి నంతటినీ ఆయత్తం చేయగల సమర్థులైన ఉద్యోగు లుంటే చాలు.

ప్రపంచ యుద్ధకాలమునుండి అర్థికశాస్త్ర శోధకులు చేస్తున్న పనిలో అధిక భాగానికి, అమెరికన్ వ్యవస్థను వికేంద్రీకరించి, అర్థిక వ్యవస్థను అనుకూల వాతావరణంలో ఉంచి, అమెరికన్ ప్రజలలోని అప్రయత్నసిద్ధ నిర్మాణ శక్తులను ప్రకటం చేయటం ఎలాగా అనే విషయం – లక్ష్యంగా ఉంది. ఈ విధంగా ఫెడరల్ ప్రభుత్వశక్తులను ఉపయోగించుకొవలసిన పద్ధతులు ఏర్పరచి, అవి అర్థికమాంద్య, ద్రవ్యోల్బణ స్థితులలో తట్టుకొని నిలువ గలవేమో పరీక్షించి, అప్పుడు వారు కనుగొన్న అమెరికన్ జీవిత సత్యానికి అనుగుణంగా వారి ప్రభుత్వ సిద్ధాంతాలను మరొకసారి సరిదిద్దుకుంటారని ఆశించవచ్చు.

---

# విదేశీయ బాంధవ్యములు

అమెరికా విదేశాంగ విధానంలోని చాల వైచిత్ర్యములు ఇతర దేశాల చరిత్రలో కలిగే అనుభవాలకు కొంత భిన్నమైన అనుభవాల ఫలితంగా వచ్చినవి.

అమెరికన్ ఇండియనులు తప్ప – మిగిలిన అమెరికా వాసులంతా ఇతర ప్రాంతాలనుండి అమెరికాకు వచ్చినవారే. వాళ్ళో, వాళ్ళపూర్వులో గడచిన 4 శతాబ్దాలలో ఉత్తర అమెరికాకు వలస వచ్చారు. అందుచేత వారు మొదట ఏదేశంవారో, ఎవరో పూర్తిగా మరిచిపోలేదు. అందులో అత్యధిక సంఖ్యాకులు యూరపు ఖండంనుంచి వచ్చినవారు. క్లిష్టదశలో వారు విడనాడి వచ్చిన పాతదేశాన్ని వారు ద్వేషిస్తారు–ప్రేమిస్తారు.

ఈ యూరపు ఖండవాసులు సముద్రాలు దాటి తరలి రావడానికి వారి స్వదేశాలలో వారనుభవించిన కష్టాలు, రాజకీయ పీడనయెడల వీరికిగల భయ విద్వేషాలు, అవధిలేని దారిద్ర్యం, మతసంబంధమైన యాతనలు– కొన్ని కారణాలు. స్వదేశంయెడల ప్రేమ- అచటిస్థితిగతుల యెడ ద్వేషము- ఈ రెంటిమధ్య వారి హృదయాలు నలిగిపోయాయి. విప్లవారంభం నుండి 1812 లో జరిగిన యుద్ధాంతంవరకూ ఇగ్లండులో నడచిన శతృత్వపు స్మృతులు ఈ ద్వేషభావాన్ని మరింత వృద్ధిపొందించాయి. అందుచేతనే అమెరికా చరిత్రలో అంతటా "మేము యూరపుఖండానికి ఏమైనాసరే మళ్ళా వెళ్ళిపోము" అన్న భావం వారి సంప్రదాయాలలో ఒక భాగంగా ఉంది. కాని, రక్తసంబంధం విడదీయ రానిది. అమెరికనులు అనుసరించే న్యాయసూత్రాలు, అచారాలు, వారి సాంఘిక రాజకీయ సంస్థలూ, న్యాయ నిష్ణయ ప్రమాణాలు- అన్నీ పశ్చిమ నాగరికతనుండి పుణికి పుచ్చుకున్నవే.

యూరపు ఖండం సర్వనాశనమయ్యే పరిస్థితి సంభవించినపుడు – ఆ దెబ్బ తమకుకూడా తగులుతుందని అమెరికనులు భయపడ్డారు. ఈ పరస్పర విరుద్ధ శక్తుల వలననే ఎప్పుడు యూరపు ఖండం విపత్కర స్థితిలో పడినా అమెరికాసంయుక్త రాష్ట్రాలలో పెద్దపెద్ద రాజకీయ సంఘర్షణలు ప్రారంభమవుతాయి. బ్రిటిష్ సంప్రదాయాన్ని అమెరికన్‌లలో ఇంచుమించు

సగంమంది అనుసరించినా, మిగిలిన పశ్చిమ సంప్రదాయాలతో, ముఖ్యంగా జర్మనీ, ఐర్లండుదేశాల సంప్రదాయాలతో పొత్తు కుదరకపోవడానికి కారణం ఈ ప్రాచీన భావాలు అమెరికన్ ప్రజాజీవితపు మూసలో ఇంకా పూర్తిగా కరగకపోవడమే.

అమెరికా ప్రవృత్తిని రూపొందించే ప్రబల ప్రభావాలలో రెండవది నిన్న మొన్నటివరకూ అమెరికా ఖండాన్ని సంరక్షించిన భౌగోళిక ఏకాంతత.

ఫ్రాన్సు రాయబారి ఏమ్. జూల్స్ జస్సెరాండ్ ఒకసారి – అమెరికా ఉత్తర దక్షిణాలలో బలహీనమైన దేశాలచేత, తూర్పు పశ్చిమాలలో చేపల చేత చుట్టబడి ఉండడం అదృష్టకరమన్నారు.

కాని, 1942 లో జర్మనీ జలాంతర్గాములు ప్రశాంత మయిన చేపల మధ్య యాదులాడుతూ హట్టెరాస్ అగ్రం సమీపానికి రావడం–చాలా బాధా కరమైంది. చికాగో, డిట్రాయిట్ నగరాలు సైబీరియా నుండి బాంబులు వేయడానికి అనువైనంత దూరంలో ఉండడం మరింత భయోత్పాదక మైనది. ఇక్కడ కూడా శతాబ్దాలపాటు సురక్షితంగా ఉండడం వలన ఏర్ప డిన భావాలకూ, హఠాత్తుగా శత్రువులదాడికి అవకాశం కలగడంవలన కలి గిన సంచలనానికీ, మధ్య సంఘర్షణ వచ్చింది. అమెరికనులు తప్పించు కొన్నామనుకొన్న యుగ యుగాల యూరపు ఖండపు భయాలన్నీ హఠా త్తుగా వారి గుమ్మంముందు ప్రత్యక్షమయాయి.

అమెరికా ప్రజలు, యూరపులో యుద్ధంచేస్తున్న సైన్యసమూహాలకు దూరంగా సురక్షితంగా పెరగడమే కాక. వారి రిపబ్లిక్ తొలిదినాలలో యూరపులో ప్రబల దేశాల మధ్య–ముఖ్యంగా ఫ్రాన్సు, బ్రిటన్, స్పెయిన్ దేశాలమధ్య నిత్యమూ ఉండే యుద్ధాలవల్ల ప్రయోజనంకూడా పొందారు. ఉదాహరణకు నెపోలియన్ లూయీజియానా ప్రాంతాన్ని స్వాధీనం చేసి కొని అమెరికా సంయుక్త రాష్ట్రాలకు పశ్చిమాన ప్రబలమైన పొరుగు రాజ్యాంగా దానిని రూపొందించాలని నిశ్చయించిన తరువాత మరల మనస్సు మార్చుకొని దానిని అమెరికాకే అమ్మివేయడానికి కారణం, అపుడు అతడు బ్రిటిష్‌వారితో యుద్ధానికి తనశక్తినంతటినీ సమాయత్తం చేయ వలసిరావడమే. అమెరికా ప్రాచీనచరిత్రలో అనేక పర్యాయాలు కొత్తగా ఏర్పడిన, బలహీనమైన అమెరికాతో ఇతరదేశాలు జోక్యం కలిగించుకో

కుండా, యూరపులోని యుద్ధాలు కాపాడడంవల్ల — యుద్ధాలు అమెరికాకు ప్రమాదకరములు కావు సరిగదా, లాభకరమనే భావం ప్రజలలో కలిగింది. కాని 20 వ శతాబ్దంలో అమెరికా రెండు ప్రపంచ సంగ్రామాల నెదుర్కొన వలసి రావడంతో ఈ భావాన్ని ఒక్కసారిగా విడనాడవలసి వచ్చింది.

మూడువందల సంవత్సరాలపాటు కొత్తవలసల నేర్పాటు చేయడానికి వీలున్న విశాల బహిరంగ ప్రదేశాలతో కూడుకొన్న సువిశాల ఖండంలో గడిపిన జీవితపు ప్రభావముద్ర అమెరికనుల భావాలపై స్పష్టంగా కన్పడు తుంది. మొట్టమొదట యూరపు ఖండ వాసులు కాలు పెట్టినపుడు ఉత్తర అమెరికా ఇంచుమించు నిర్మానుష్యంగా ఉంది. విప్లవానంతరం అపలాచి యన్ పర్వతమార్గాలనుండి అనేకమంది వలస వచ్చారు. 2000 మైళ్ల విశాలప్రదేశం వారి కళ్ళముందు ఉంది. ఈ సరిహద్దుప్రాంతాలలోని అనుభ వాలవల్ల ప్రజలకు కలిగిన తమ అభివృద్ధియెడల అచంచలమైన విశ్వాసం, మనోప్రవృత్తి ప్రస్తుత శతాబ్దంలోని పరిస్థితులకు సరిపడనివైనాయి.

మరొక ప్రభావం—దీర్ఘకాలం సముద్రంపై జరిగిన వర్తకం. తూర్పుతీ రాన ఉన్న ఇంగ్లీషు వలసలు తమకు కావలసిన వస్తువులను ఇంగ్లండు నుంచి తెప్పించుకొని పుగాకు, తోళ్ళు, కలప, ధాన్యాలు ఆ దేశానికి అమ్మే వారు. ఒక వలసకు మరొక వలసకు మధ్య రాకపోకలకు కూడా, చాలకా లంపాటు సముద్రమార్గమే—ఏకైక మార్గం కాకపోయినా ముఖ్య మార్గంగా-ఉండేది. అందుచేత అమెరికా కెల్ల అత్యంత ప్రాచీనమయిన, అత్యంత సంపన్నమైన ప్రాంతం సముద్ర ప్రయాణాలకు అలవాటు పడింది. ఇది అచటి ప్రజల రాజకీయ భావాలపై చాలా ప్రభావం కలిగించింది. సముద్ర తీర నగరాలతో సుగమమైన మార్గంలో వర్తకం చేయడానికి వీలులేకుండా దీర్ఘమై, దుర్గమమయిన పర్వతశ్రేణి అడ్డంగా ఉన్నప్పటికీ — మధ్యపశ్చిమ ప్రాంత ప్రజలు వారి ధాన్యాన్ని మిసిసిపీ నదిగుండా తీసుకొనిపోయి న్యూ అర్లియన్స్ మీదుగా యూరపుతో వర్తకం చేసేవారు.

19 వ శతాబ్దంలో దేశాంతర భాగంలో పురోభివృద్ధికి చాలధనం పెట్టు బడిగా కావలసివచ్చింది. ఈ పెట్టుబడిలో చాలభాగం బ్రిటిష్, డచ్ పెట్టు బడిదార్లనుండివచ్చింది. అమెరికన్ ప్రజలు విదేశాలనుండి అప్పులు పుచ్చు

కోవడానికి, అంతర్జాతీయ వాణిజ్యంపై ఆ అప్పుల వలని ఫలితాలనూ అల వాటు పడిపోయారు. అమెరికాకు అప్పుపెట్టిన విదేశీయులు ఆ అప్పుపై వచ్చిన వడ్డీ డబ్బుతో అమెరికా ధాన్యాన్ని, పశువులను కొనగలిగేవారు. వారు కొన్నవాటికి డబ్బు చెల్లించడానికి వారి సరుకు ఎక్కువగా అమ్మవ లసి వచ్చేదికాదు. ఈ విధంగా తమ వస్తువులు ఇతరదేశాలకు అమ్ముకోవ డం, ఇతర దేశాల వస్తువులు తమ దేశంలోకి రాకుండా వాణిజ్యసుంకాల గోడలు అడ్డంపెట్టడం అమెరికనులకు అలవాటైపోయింది. ఇందువల్ల వర్తకం తుల్యం కాకపోవడం — నష్టకరంగా కూడా కన్పడలేదు. అనేక తరాలపాటు సాగిన యీ పరిస్థితివల్ల వారికి కలిగిన అనుభవం — పూర్తిగా మారిపోయిన 20వ శతాబ్దపు పరిస్థితులను అర్థం చేసికొనడానికి చాలలేదు.

చివరి విషయంగా — అమెరికన్ ప్రజల ప్రవృత్తులు మాత్రం వారి ప్రజా స్వామిక సంస్థల దృష్ట్యా, వారి జీవితమార్గం దృష్ట్యా అర్థం చేసికోవాలి. అమెరికనుల రాజకీయ ప్రవర్తనలో యెన్ని లోపాలైనా ఉండవచ్చు. కాని బహిరంగంగా, స్వేచ్ఛగా అన్ని విషయాలు చర్చించే స్వాతంత్ర్యం లోపిం చడం మాత్రం ఎన్నడూ లేదు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు స్థాపింపబడిన నాటినుండి నేటివరకూ అచటికి వెళ్ళిన విదేశయాత్రికులంతా పరస్పర విరుద్ధ అభిప్రాయాలు ప్రక టించబడడం చూడగలరు. అక్కడి పత్రికలు వాటి యిష్టంవచ్చిన విష యాలు చెప్తాయి. రాష్ట్రప్రభుత్వం కష్టపడి జాగ్రత్తగా తయారుచేసిన ప్రభుత్వ విధానాన్ని కాంగ్రెసు సభ్యులు తీవ్రంగా ఖండించేస్తారు. శత్రు దేశాలతోనూ, స్నేహదేశాలతోను జరిగే అతి సున్నితమైన సంభాషణలు కూడా — చుట్టూ గుంపుచేరి అరుస్తూన్న జనసమూహం మధ్యనున్న జీర్ణ మైన గుడారాలలో జరుగు తుంటాయి. అతి ప్రమాదకరమైన సైనిక రహ స్యాలనుకూడా ఎవరో ఒకరు రేడియోలో మాట్లాడుతూ ఏ విధమైన సమాచా రం దేశద్రోహులు శత్రువులకు అందచేసి దేశాన్ని మోసం చేస్తారో చూపించ డానికి ఉదాహరణగా చెప్పేస్తారు!

ఇంత దారుణంగా క్రమశిక్షణ లేకపోవడంవల్ల, సోవియట్ రష్యా లాగ రహస్యంగానడిచే నియంతృత్వ దేశంతో పోటీ వచ్చినపుడు అమెరికా చాలా చిక్కు స్థితిలో పడుతుంది. నిజమే. కాని ఇలా విచ్చలవిడిగా మాట్లాడడం

దేశంలో ప్రజల అలవాట్లలో లోతుగా పాతుకుపోయింది· దానిని అదుపులో ఉంచడం ఇక సాధ్యంకాదు. అంతేకాక ఈ విధమైన వాక్స్వాతంత్ర్యం విధిగా ఉండే దేశాలకు సోవియట్ రష్యాలాగ విషపూరితంగా, రహస్యంగా మెలగే దేశాలకంటే నైతికంగా ఎక్కువబలం ఉంటుందని అమెరికనులు సంతృప్తి పడుతుంటారు.

ఇందువల్ల ఇతర స్వేచ్ఛాదేశాల ప్రజలు, అమెరికనులు చంచల మన స్కులనీ, వారిని నమ్మి ఆధారపడి ఉండడానికి వీలులేదనీ, ఎంతగా అనుకున్నా, వారు ప్రపంచపు స్వాతంత్ర్యాన్ని నాశనం చేయడానికి రహస్యపు ఎత్తులు వేయడంలేదని మాత్రం నమ్మడానికి వీలున్నది.

**1812** తరువాత ఒక శతాబ్దంపాటు అమెరికనులు తమ దృష్టినంతటినీ వారి అంతరంగిక అభివృద్ధిపై కేంద్రీకరించారు. విదేశాంగశాఖను పూర్తిగా నిర్లక్ష్యంచేసి, ఉన్న కొద్దివిదేశ వ్యవహారాలలోను కాంగ్రెసు ప్రాబల్యం తీసుకొంది. ఎప్పుడూ విదేశవ్యవహారంలోని చాణక్యంలో మునిగియున్న యూరపు రాజనీతిజ్ఞులతో పోల్చి చూస్తే-అమెరికా రాజనీతిశాఖ చాలా అనుభవ సూన్యంగా, విచ్చలవిడిగా ఉటుంది. విదేశాలలో రాయబారులుగా ఉండే అవకాశం చాలామంది ధనవంతులకే లభించేది. అందులో చాలామందికి గెల్చినపార్టీకి ఉదారంగా విరాళాలిచ్చారనే అర్హతతప్ప, రాజనీతిలో ప్రత్యేకంగా ఏ అర్హతా లేనివారు. అయినప్పటికీ ఎలాగో- బెంజిమన్ ఫ్రాంక్లిన్ రోజులనుండి నేటివరకూ కూడా రాయబారులుగాను, విదేశాంగశాఖా కార్యదర్శులుగాను పనిచేయడానికి అత్యంత సమర్థులను కొంతమందిని అమెరికా సమకూర్చుకో గలిగింది.

విదేశాంగశాఖలో విదేశీయులతో కలిసి తిరిగే మనుష్యులుంటారుకాబట్టి ప్రతిదేశపు ప్రజలకు తమ విదేశాంగశాఖను అనుమానంతో చూడటం చాలా సహజమయిన అలవాటు. అమెరికా విదేశాంగశాఖ విషయంలో కూడా ఇంతే. అది చేసే పనిలో ప్రత్యేకత వల్ల ఆశాఖ ప్రజాభిమానాన్ని కూడకట్టుకోవడం కష్టం. ఒక విదేశ ప్రభుత్వ తోడి సంప్రదింపులలో ప్రజలకు కావలసిన లాభాన్ని ఆ శాఖ సంపాదించిపెట్టలేకపోయినప్పుడు – దానికి కారణమయిన అదృశ్యరాజకీయశక్తులను స్వదేశంలోనివారు అర్థంచేసుకోరు. విదేశాంగ శాఖలో ఎవరో అమెరికాకు ద్రోహంచేశారనే అనుమానానికి- రాజకీ

యంగా దెబ్బతీయజూచే శత్రువులకు అద్భుతమైన అవకాశం ఇవ్వడానికి అనువైన అనుమానానికి— ఎప్పుడూ అవకాశ ముంది. 100 సంవత్సరాల క్రితం సర్వసామాన్యమైన నమ్మకానికి విరుద్ధమయిన విదేశ విధానాన్ని అను సరిస్తే, ఆచారంగా వస్తూన్న సూత్రాలను అతిక్రమించారని ఆందోళన పడే వాళ్ళు తప్పకుండా ఉంటారు. ఈ విధంగా విదేశాంగశాఖ తేలికగా అందరి ఖండన మండనలకూ గురి అవుతుంది.

1900 సంవత్సరంనుండి అభివృద్ధి చేయబడిన సంకీర్ణమైన, ఆర్థిక జిగిబిగిగల విదేశవర్తకము, విదేశ భాంధవ్యాలు, వివిధ జాతీయ సంస్థలలో సభ్యత్వమూ, దురాక్రమణదారులయెడ ప్రతిఘటన—ఇవన్నీ కలిసి — విదేశ ప్రభుత్వాలతో ప్రత్యక్ష బాంధవ్యాలన్నింటికీ విదేశాంగ శాఖయే ఏకైక స్థానంగా ఉండే పాతపద్ధతిని మార్చేశాయి. ఈనాడు ప్రభుత్వంలోని శాఖలు దాదాపు అన్నీ అమెరికన్ ప్రజల జీవితంలో విదేశ బాంధవ్యాలపై ప్రబల ప్రభావంగల ఏదో ఒక విషయాన్ని నిర్వహిస్తున్నాయి. చాలా శాఖలు విదేశీ యులతోనో విదేశ ప్రభుత్వంతోనో ప్రత్యక్షంగా వ్యవహరిస్తున్నాయి. దీనికి తోడు ఈ దేశంలో స్థానిక ప్రయోజనాలు— ప్రపంచ ప్రాముఖ్యంగల విదే శాంగ విధానానికి విరుద్ధంగా ఉంటాయి. ఉదాహరణకు 'సహాయం చేయ వద్దు — వర్తకం చెయ్యాలి' అనే (Trade not aid) విధానం — అమె రికా భద్రతకు చాల ముఖ్యమైనది అని అధ్యక్షుడు ట్రూమన్, ఐసెన్‌హోవ ర్లు ఇద్దరూ అంగీకరించారు. కాని బోలెడుమంది వ్యాపారస్థులు, రైతులు, కార్మికప్రతినిధులు ఈ విధానాన్ని నాశనం చేస్తూంటారు. వాళ్ళందరికీ జాతీయ వర్తక సుంకాల రక్షణ కావాలి. కాని వారు కోరే ఆ రక్షణవల్ల విదేశాలలో అమెరికా బేరమాడగల అవకాశానికి చాలా నష్టం కలుగుతోంది.

ఈ విధంగా విడివిడిగా, తరుచు పరస్పర విరుద్ధంగా ఉన్న వివిధశాఖ లను, ప్రభుత్వాంగాలను, కాంగ్రెసు సభాసంఘాలను, విదేశాంగ శాఖ ఒక దగ్గరకు చేర్చి బలీయమయిన వైరుధ్యరహితమైన విదేశాంగ విధానాన్ని ఏర్పాటు చేయలేదు. అధ్యక్షు డొక్కడే వివిధకార్యనిర్వాహక శాఖలపై సర్వా ధిపత్యం వహించి — వ్యవసాయశాఖ, దేశరక్షణ శాఖలవంటి విరుద్ధ

శాఖలు ఏకలక్ష్యంకోసం పనిచేసేటట్టు చేయగలడు. అధ్యక్షుడే ప్రభుత్వపు పగ్గాలన్నీ తనచేతిలో పెట్టుకొని తన యిష్టాన్ననుసరించి ఆ పగ్గాలను లాగి ప్రభుత్వరథాన్ని నడిపించడానికి అనువుగా వైట్‌హౌసులో ఉద్యోగి వర్గం ఏర్పరుపబడినా — అంత మాత్రాన ఈ విషయంలో సమగ్రత ఆశించడానికి అవకాశంలేదు.

విదేశాంగ విధానంలో కాంగ్రెసునభ జోక్యం కలిగించుకున్నప్పుడు స్థానిక ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోకుండా దానిని నడిపించడానికి అధ్యక్షు డొక్కనికే అవకాశం ఉంది. అధ్యక్షుడు ప్రత్యక్షంగా ప్రజల నుద్దేశించి మాట్లాడగలడు. విదేశాంగశాఖలో సమర్థులైన ఉద్యోగులుంటే వారు విదేశాంగ సమస్యలను గురించిన సవివర సమాచారాన్ని అందించి అధ్యక్షునికి ఈ పనిలో తోడ్పడగలరు. కాని చివరకు నాయకత్వం వహించవలసినది అధ్యక్షుడే. గొప్ప గొప్ప అధ్యక్షులందరూ ప్రజాబలంమీదనే ఆధారపడి వ్యవహరించారు.

విదేశ వ్యవహారాలలో విజయం కొంతవరకూ కాంగ్రెసులో రెండుపక్షాలూ చేసే సహాయంపై ఆధారపడి ఉంటుంది. తమ స్వీయ రాజకీయ ప్రయోజనాల కోసం, ప్రపంచ వ్యవహారాలలో ప్రభుత్వబలానికి నష్టం కలిగించడానికి కూడా జంకని సభ్యులు కొందరు కాంగ్రెసులో ఎప్పుడూ ఉంటారు. కాని రెండు పక్షాలలోనూ అధిక సంఖ్యాకులు మాత్రం వారు పదవీ స్వీకారం చేసినపుడు ప్రమాణం చేసిన ప్రకారం చేయడానికి సర్వదా సిద్ధపడే వారే. ఇరుపక్షాల వారిని ఒక విషయంపై సమీకరించి ఏకంచేయగల నాయకత్వం కాంగ్రెసులో ఉన్నా—వారు అన్నిసమయాల్లోనూ ఆ విధంగా ఏకం చేయగలగడం సాధ్యంకాదు. 18 వ కాంగ్రెసులో మార్షల్‌పథకం చర్చించబడేటప్పుడు—సెనేటర్ వాండెంబర్గ్ ధర్మమా అని యీ పద్ధతి బాగా పని చేసింది. మొత్తంమీద రెండుపక్షాల సహాయంతో నడిచే విదేశాంగ విధానం కాంగ్రెసులో స్వార్థరహిత నాయకత్వమూ, ప్రతిపక్ష నాయకులతో పేచీ లేకుండా నడపగల అధ్యక్షుని చాకచక్యమూ, ఈరెండూ కలసివస్తే బాగా నడుస్తుంది.

'వుడ్రోవిల్సన్ ఫౌండేషన్‌కు' సంబంధించిన ఒక సంఘం — కాంగ్రెసు సభ్యులకు 4 సంవత్సరాల పదవీ పరిమితి ఏర్పరుస్తూ రాజ్యాంగాన్ని సవ

రించమని సూచించింది. అధ్యక్షుని ఎన్నిక జరగని సమయంలో వోటింగ్ 'ముమ్మరంగా' ఉండదని, అప్పుడు స్థిరమైన విదేశాంగ విధానానికి వ్యతిరేకులైన స్వప్రయోజన పరులు తను ప్రతినిధులను ఎన్నుకొనడానికి వీలుంటుందనీ, అధ్యక్షుని ఎన్నిక సమయంలో ఉత్తేజితులైన ప్రజలు ఉండగా అది సాధ్యంకాదనీ వారు సూచించారు. కాంగ్రెసు సభవారికి అధ్యక్షుడు తన దీర్ఘకాలిక విదేశాంగ విధానాన్ని గురించి ఎక్కువ వివరాలు తెలియపరుస్తూండాలనీ,అందువల్ల దూరదృష్టిరహితమైన ప్రతిపాదనలను బలంగా అణచివేయ వచ్చుననీ ఈ కమిటివారు సూచించారు.

విపరీతమయిన ప్రతిఘటన ఉండని విదేశాంగ విధానాన్ని ఏర్పరచడంలోని కష్టం–రెండు ముఖ్య కారణాలవలన కలుగుతోంది. ఒకటి : తరుచు వచ్చే సందిగ్ధావస్థ. రెండవది : ప్రస్తుత శతాబ్దంలోని మార్పులవలన అమెరికనులు గాఢంగా గౌరవించే కొన్ని అభిప్రాయాలు తల్లక్రిందులు కావలసి రావడం.

సోవియట్ రష్యావంటి బలమయిన జిత్తులమారి దేశంతో వ్యవహరించేటప్పుడు సంధిగ్ధావస్థలు ఎప్పుడూసంభవిస్తుంటాయి. నష్టకరమయిన రెండు పనులలో ఏదోఒకటి తప్పక చేయవలసిన స్థితిలో అమెరికాదేశాన్ని నెట్టడానికి, శత్రువులు తమ శక్తినంతటినీ ధారపోస్తారు. ఉదాహరణకు కొరియాలో అలాంటి సంధిగ్ధావస్థలెన్నో వచ్చాయి. అలాంటి సమయంలో అమెరికా ఏ పనిచేసినా అది తప్పని ఖండించడానికి–దేశద్రోహుల మద్దత్తుతోనే కావచ్చు-చాలా అవకాశముంది. దేశం ఏదో ఒక విదేశాంగ విధానాన్ని అనుసరించడానికి చెల్లించవలసిన మూల్యమే – ఇలాంటి విమర్శనలన్నీ.

**20** వ శతాబ్దంలో అమెరికా విదేశాంగ విధానం సుస్థిరమయిన పాత పద్ధతులకు వ్యతిరేకంగా ఉండడంవల్ల స్వదేశంలో తీవ్ర రాజకీయం విమర్శలకు గురి అయింది. ఈ కాలంలో అమెరికా తాను శతాబ్దాధిక కాలం నుండీ అనుసరిస్తున్న, మాననీయుడైన వాషింగ్టన్ స్వయంగా రూపొందించిన 'ఏకాంత' విధానాన్ని, పునఃపరిశీలించవలసి వచ్చింది. ఫ్రాన్సు సహాయంతో స్వాతంత్ర్యాన్ని సాధించిన కొద్ది సంవత్సరాల తరువాతనే **1793** లో ఫ్రాన్సు ఇంగ్లండుల మధ్య అధ్యక్షుడు వాషింగ్టన్ తటస్థ

విధానాన్ని అనుసరించాడు. అప్పట్లో వాషింగ్‌టన్ ఉద్దేశ్యం – నూతనంగా జన్మించిన అమెరికా సంయుక్త రాష్ట్రాలు బలవత్తరం అయేందుకు తగిన వ్యవధిని సమకూర్చడమే. ఫ్రాన్సు యెడల అమెరికాకున్న కృతజ్ఞతా భావం కారణంగా, యూరపులోని మహాబలవంతులైన దేశాలతో యుద్ధానికి అమెరికాను ఈడ్చడానికి అతడు అంగీకరించలేదు. "విదేశాలకు సంబంధించినంతవరకూ మన నడవడికకు గొప్పసూత్రం–వారితో మనం వాణిజ్య బాంధవ్యాలు ఏర్పరచుకొంటూండడంలో రాజకీయ సంబంధాలు మాత్రం వీలయినంత తక్కువగా పెట్టుకొని ఉండడమే" అని అతడు తన ప్రజలకు అంత్యోపన్యాసంలో చెప్పాడు.

"బహిరంగ శత్రువు మనకు ఏవిధమయిన భౌతిక నష్టాన్ని కలిగించినా దానిని మనం ఎదుర్కొనగల స్థితి రావాలని మనదేశంలో భూభాగాన్ని సంపాదించడం అసాధ్యమయి, యుద్ధోన్మాదజాతులు మనకు కోపం కలిగించే పనులు తేలికగా చేయ సాహసించని రోజులు రావాలనీ, ధర్మమే మార్గదర్శకంగా – మన ప్రయోజనాలకు అవసరమయిన శాంతినో,యుద్ధాన్నో మనమే ఎంచుకొనే రోజులు రావాలనీ" అతడు వాంఛించాడు.

**1823** లో అధ్యక్షుడు మన్రో "యూరపుకు సంబంధించినంతవరకూ మన విధానం – యూరపుఖండ దేశాలలో దేని అంతరంగిక వ్యవహారాలలోనూ మనం జోక్యం కలిగించుకోకుండా ఉండడమే. ఈ విధానం–భూగోళంలో 4 వ వంతుభాగాన్ని ఇంతకాలంపాటు కల్లోలపరచిన యుద్ధాలు ప్రారంభమయినప్పుడే నిశ్చయించబడినా – దీనిలో నేటికీ మార్పులేదు" అని అన్నాడు. ఈ ప్రకటన గ్రీకు స్వాతంత్ర్య పోరాటాన్ని ఉద్దేశించి చేయబడింది. ఈ పోరాటం యెడల అమెరికనులలను గాఢమయిన సానుభూతి ఉన్నది. యూరపులో ఏం జరుగుతున్నా సరే, అత్యధిక సంఖ్యాకులు బలపరచిన అమెరికన్ విధానం మాత్రం – ఆ వ్యవహారాలలో జోక్యం కలిగించుకోకుండా ఉండడమే.

ఈ విధానంతోనే – అమెరికా తాటస్థ్యాన్ని నిలబెట్టడానికి వుడ్రో విల్సన్ పయత్నిస్తూండగానే, **1914–1917**మధ్య కష్టదశ సంభవించింది. అమెరికనుల ప్రాథమిక విధానాలలో ఒకటైన 'సముద్రయాన స్వేచ్ఛ' ప్రమాదావస్థకు లోనైంది. పరిస్థితుల ఒత్తిడివలన విల్సన్ తన మనసు మార్చుకొని

జర్మనీతో యుద్ధానికి అనుమతి నీయమని 1917లో కాంగ్రెసును కోరవలసి వచ్చింది. ఇంకా ఆ యుద్ధం పూర్తిగా ముగియక మునుపే విల్సన్ అమెరికాను నానాజాతి సమితిలో చేరేందుకు అనుమతించమని సెనేటును కోరి విఫలుడయ్యాడు. కాని అమెరికా ప్రజలలో అధికులు అమెరికా నానాజాతి సమితిలో చేరడానికి అనుకూలంగా ఉన్నారు!

కాని అంతమాత్రాన 'ఏకాంతంగా' ఉండే సంప్రదాయం నాశనం కాలేదు. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చిన తరువాత నాజీలు యూరపు దేశాల వారినేగాక స్వేచ్ఛా ప్రపంచాన్నంతటినీ నాశనం చేయదలచు కొన్నారని అంగీకరించడానికి అమెరికనులకు చాలా వ్యవధి పట్టింది. జపాను పెర్లహార్బర్‌పై ముట్టడి చేయడం, జర్మనీ ఇటలీలు అమెరికాపై యుద్ధం ప్రకటించడం జరిగేదాకా – అమెరికాలో 'ఏకాంతంగా' ఉండాలనే వాదం బలంగానే ఉంది. ఇప్పటికీ అది అమెరికన్ రాజకీయాల్లో బలమయిన అంతర్వాహినిగా ఉంది.

కాని, ఈ ఏకాంత భావంలో అంతర్గర్భితంగా ఉండి, సంప్రదాయ సిద్ధంగా వస్తూన్న యూరపు యెడల అయిష్ట భావం–ప్రపంచంలోని ఇతర భాగాలన్నింటికీ అదే విధంగా వర్తించదు. "అమెరికనులంతా – వాళ్ళ మొహాలు పశ్చిమంగా పెట్టుకొని పుట్టారని" అంటారు. ఏకాంత వాదంఅంటే అమెరికాకు పశ్చిమంగా ఉన్న ఏ దేశంనుండీ – చివరకు చైనానుండి గూడా – దూరంగా ఉండడం మాత్రం కాదు.

విదేశాంగ విధానంలో పెద్ద రాజకీయ వివాదాన్ని రేపిన రెండవ పెద్ద మార్పు – విదేశ వాణిజ్య సుంకాలు తగ్గించడం. 1933 లో డెమోక్రట్లు అధికారం వహించినప్పటి నుండీ వారి పార్టీ ఎప్పుడూ అనుసరిస్తున్న విధానానుసారం – వాణిజ్యసుంకాలు తగ్గించమని ఒత్తిడి చేయడం ప్రారంభించారు. కాని దక్షిణ ప్రాంతాలలో పరిశ్రమలు అభివృద్ధి అవడం, అందువల్ల దక్షిణాది డెమోక్రట్లు తమ పరిశ్రమలకు రక్షణ కోసం వాణిజ్య సుంకాలకు అనుకూల్యం చూపడంతో, పార్టీబలం కొంత చీలిపోయింది. కాని చరిత్ర గతి మాత్రం విపరీత విదేశ వాణిజ్యసుంకాలకు విరుద్ధంగా నడుస్తోంది.

మొదటి ప్రపంచయుద్ధ కాలంలో అమెరికా – ప్రపంచ వ్యవహారాలలో అప్పు పుచ్చుకునే స్థితినుండి అప్పులు ఇచ్చే స్థితికి వచ్చింది. అప్పటి

నుండీఅమెరికానుండి ధాన్యంగాని,మోటార్లుగానికావాలనుకొన్నవిదేశీయులు అమెరికాకు వాళ్ళ సరుకులు అమ్మి కొన్నిడాలర్లు సంపాదించవలసివచ్చేది. అదేకాక వాళ్ళ అప్పులపై వడ్డీ చెల్లించవలసివస్తే – ఇంకా ఎక్కువ సరుకులు అమ్మి, ఇంకా కొన్ని డాలర్లు సంపాదించవలసి వచ్చేది. సూక్ష్మంగా చెప్పాలంటే ఇచ్చిన అప్పులన్నీ చెల్లించబడి అమెరికా సరుకులు విదేశాలలో అమ్ముడుపోవాలంటే అమెరికావారు ఎగుమతుల కన్న ఎక్కువగా దిగుమతులు చేసుకోవలసివచ్చింది. అప్పు తీర్చడానికి ఇంకా కొంత అప్పు యిస్తూండడంవల్ల – యీ స్థితిని కొంతకాలం వాయిదావేయడం మాత్రం సాధ్యంకాని, ఎప్పటికైనా అప్పు యిచ్చినదేశం, ఎక్కువ దిగుమతులు చేసుకోవలసిందే – లేకపోతే చిక్కువస్తుంది. అందుచేత అమెరికా తప్పనిసరిగా విదేశవాణిజ్యంపై సుంకాలు తగ్గించవలసి వచ్చింది.

కాని అమెరికా పరిశ్రమలకు పెద్దపెద్ద విదేశ వాణిజ్య సుంకాలు అలవాటైనాయి. పైగా వాటికి రాజకీయ ప్రాపకం ఎక్కువగా ఉంది. అందుచేత మొదటి ప్రపంచ యుద్ధానంతరం 12 సంవత్సరాలపాటు ఆ సుంకాలు అత్యున్నత ప్రమాణంలో ఉన్నాయి. చివరకు – చిక్కువచ్చింది. యుద్ధ ఋణాలు స్థంభించిపోయాయి. యూరపుఖండ ఆర్థిక వ్యవస్థ పతనమైంది. అపుడు సంభవించిన ఆర్థికమాంద్యానికి అమెరికాలోని విదేశవాణిజ్య సుంకాలు కూడా కొంత బాధ్యత వహించాయి.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యుద్ధ ఋణాల సమస్య అంత తీవ్రంగా లేదు. "అప్పు–కౌలు"–పద్ధతివలన అమెరికా వారి ఆయుధాలు తక్షణం ధనం చెల్లించ నక్కరలేకుండా మిత్రమండలికి లభించడం ఇందుకు కారణం. తరువాత యూరపులో ప్రశాంతతకూ, పునర్నిర్మాణానికీ, అమెరికా పెద్దపెద్ద మొత్తాలు సహాయంగా యిచ్చింది. అమెరికా సంవత్సరానికి అనేక వేల మిలియనుల డాలర్లు సహాయంగా యిచ్చేస్తున్నంత కాలమూ విదేశ వాణిజ్యం తుల్యం (Balance) కావలసిన అవసరం లేకపోయింది. కాని అలా సహాయం ఇవ్వనక్కరలేకుండా నిలవడానికి అమెరికా తప్పకుండా విదేశ వస్తువులు దేశంలోనికి రానివ్వవలసి వచ్చింది. అందుచేతనే చాలమంది అమెరికనుల సాంప్రదాయిక విశ్వాసాలకు విరుద్ధమైనప్పటికీ– ప్రపంచపరిస్థితులవలన "సహాయం కాదు–వర్తకం చెయ్యి"

లనే విధానాన్ని (Trade-not-aid) అమెరికా అనుసరించవలసి వచ్చింది. ఇటువంటి ఉద్రేకాలను రెచ్చగెట్టే విదేశాంగ విధానాన్ని నిర్వహించడం సామాన్యమయిన పనికాదు !

అనేకులు అమెరికనులను ఆందోళన పరచిన యీ తీవ్రమయిన మార్పుతోపాటు, ఇంతకన్నా కొంచెం తక్కువ ఆందోళనతో-మరికొన్ని సాంప్రదాయిక విధానాలు కూడా మార్చబడ్డాయి.

ఇందులో 'మన్రో సిద్ధాంతం' ఒకటి. ప్రథమంలో ఈ సిద్ధాంతం-క్రొత్తగా స్థాపింపబడిన బలహీనమయిన లాటిన్ అమెరికన్ రిపబ్లిక్కులను యూరపు రాజ్యాల దండయాత్రనుండి రక్షించడానికి అమెరికా ప్రభుత్వమూ, తానూ ఏకం కావాలని బ్రిటిష్ ప్రభుత్వం చేసిన సూచన నుండి ఆరంభమయినది. పశ్చిమార్ధగోళంలో ఫ్రాన్సు, స్పెయిన్, రష్యాలు కొత్తరాజ్యాలు స్థాపించడం బ్రిటన్‌కు గాని, అమెరికాకుగాని ఇష్టంలేదు. కాని అధ్యక్షుడుమన్రోకు-ఒక్కొక్కప్పుడు అమెరికాకు రుచించని విధానాలను అనుసరించే బ్రిటన్‌తో సంబంధం పెట్టుకోవడం యిష్టంలేదు. అందుచేత 1823 డిశంబరు 2న ఉభయ అమెరికాలలోనూ, యూరపు వాసులైన వారెవరైనా రాజ్య విస్తరణ కోసం ప్రయత్నిస్తే-దానిని అమెరికా శాంతి భద్రతలకు ప్రమాదకరంగా భావిస్తామని అధ్యక్షుడు మన్రో ప్రకటించాడు. సముద్రాధిపత్యం వహిస్తున్న బ్రిటిష్ నౌకాదళం, తమ స్వీయ ప్రయోజనాలకోసమే మన్రో సిద్ధాంతాన్ని బలపరచవలసి వచ్చింది.

అందుచేత ఆ శతాబ్దంలో మిగిలిన కాలంపాటు ఈ విషయం ఇలా జరిగింది. 20 వ శతాబ్దారంభంలో లాటిన్ అమెరికన్ దేశాలలో అప్పులు వసూలు చేయడం మన్రోసిద్ధాంతానికి చాలా ప్రమాదకరంగా పరిణమించింది. యూరపుదేశపు వాసులైన అప్పులిచ్చినవారు కార్రిబియన్ తీరంలో చాలాకాలం నుండి ఉండిపోయిన అప్పులు సైన్యసహాయంతో వసూలు చేసుకుంటూ అక్కడే స్థిరనివాసం ఏర్పరచుకొని ఉండిపోవచ్చు. అందుచేత థియోడార్ రూజ్‌వెల్టు, మన్రో సిద్ధాంతానికి 'ఉప సిద్ధాంతం' ప్రతిపాదించాడు. దానితో యూరపియన్‌లైన ఆ అప్పులు ఇచ్చినవాళ్ళను తరిమివేశారు. అమెరికా ప్రభుత్వం ఆ దివాలాతీసిన దేశాలు తిరిగి తమ కాళ్ళమీద నిలబడగలిగే దాకా రిసీవరుగా నిలబడి ఎగుమతి దిగుమతి సుంకం

వసూలు చేయడానికీ, శాంతి భద్రతలు రక్షించడానికీ, లంచగొండితనం నిర్మూలించ డానికి పూనుకుంది.

ఒకదేశం తరువాత మరొక దేశంలో నౌకలను దింపడం—లాటిన్ అమెరికన్ దేశాలకు కోపకారణ మయింది. రూజ్‌వెల్టు ఉపసిద్ధాంతాన్ని అధ్యక్షుడు హెర్బర్ట్ హెూవర్ తిరస్కరించాడు. అతడు తాను ఎన్నిక అయిన 1928కీ పదవీ స్వీకారం చేసిన 1929కీ మధ్యకాలంలో లాటిన్ అమెరికాకు సుహృద్భావ ప్రయాణంచేసి – లాటిన్ అమెరికా యెడల స్నేహపూర్వకమయిన సంబంధం ప్రారంభించాడు. ఈసుహృద్భావ విధానం రూజ్‌వెల్టు, ట్రూమన్ కాలాల్లో గూడ కొనసాగింది. అమెరికా ఖండంలోని దేశాల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోనని అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వం హామీ యిచ్చింది. అమెరికా ఖండ దేశాల సంఘంలో—ఆ అర్ధగోళపు రక్షణ అందులోని సభ్యులందరి బాధ్యత—అని గుర్తించబడింది.

మన్రో సిద్ధాంతంలోని ఈ మార్పులవలన స్వేచ్ఛా ప్రపంచాన్ని రక్షించడంలో ఉన్న సంధిగ్ధావస్థ యెడల అందరిదృష్టి కేంద్రీకృతమైనది. స్వేచ్ఛగా ఉన్న దేశాలేవీ శాంతి భద్రతల రక్షణకై అమెరికా నౌకాసైన్యాన్ని తమ దేశ తీరాలకు రానీయవు. వారి అంతరంగిక సమస్యలను వారి యిష్టం వచ్చినట్లు పరిష్కరించుకోవడానికి వారికి స్వేచ్ఛ కావాలి. అవి అలా ఉండగా స్వేచ్ఛాప్రపంచం అంతటాగల ఔదార్యవాదులంతా – దక్షిణ అమెరికా ఖండంలోను, ఇతరచోట్లగల నియంతృత్వ ప్రభుత్వాలకు అమెరికా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వం సహాయపడడం చూచి నిరసనభావం ప్రకటిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీకూడా యీ విషయాన్ని తన ప్రచారంకోసం ఉపయోగిస్తోంది.

ఈ చిక్కు సమస్యకు గత శతాబ్దంనుండీ అమెరికా చెప్పుతున్నజవాబు—ఒక చిన్న దేశంలో అధికారంవహిస్తున్న నియంత—ఆ దేశాన్ని కబళించిన దురాక్రమణదారుని అంతగా ప్రపంచానికి ప్రమాదం తెచ్చిపెట్టడు—అని. పెద్ద అందుచేతనే ఒకదేశం ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోలేక పోయినా సరే దాని స్వాతంత్ర్యాన్ని మాత్రం పరిరక్షించడానికి అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం సహాయం చేస్తుంది.

"సముద్రయాన స్వేచ్ఛ" అనే సంప్రదాయం మొదట బ్రిటిష్‌వారిది. వారు మొదటి ఎలిజబెత్ కాలంనుండి ప్రపంచమంతటా సముద్ర వర్తకం చేసుకొనే స్వేచ్ఛ ఉండాలని పట్టుపడుతున్నారు. ఈ సంప్రదాయాన్ని అమెరికా కూడా అనుసరించింది. కాని ఈ సిద్ధాంతం – స్వేచ్ఛా ప్రపంచాన్ని నియంతృత్వ, దురాక్రమణ శక్తుల బారినుండి రక్షించడానికి అందరూ సహకరించవలసిన నవీనకాలానికి సరిపడలేదు. వర్తకంచేసికొనే స్వేచ్ఛ, అందులోనూ యుద్ధసమయంలో తటస్థంగా ఉండి వర్తకం చేసికొనే స్వేచ్ఛ, మొదటి ప్రపంచ సంగ్రామకాలంలోని పరిస్థితులలో చాలా చిక్కులకు దారి తీసింది. అధ్యక్షుడు విల్సన్ తమకు అట్టి స్వేచ్ఛ కావాలని మహాకోపంగా బ్రిటిష్‌వారితోనూ జర్మనీవారితోనూ వాదించాడు కాని–జర్మనీ కాని, బ్రిటన్ ఎదుటి దేశంతో అమెరికాను వర్తకం చేయనిచ్చింది కాదు. ఆ అవకాశమిస్తే తాము ఓడిపోతామని రెండు దేశాలనూ భయమే. చివరకు అమెరికా యుద్ధంలో ప్రవేశించడంతో యీ సమస్య ముగిసింది.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో అమెరికన్‌సైన్యాలను యుద్ధ భూభాగాలకు పోనివ్వకుండా నిషేధించే'తాటస్థ్య స్వామ్యాలను'అమెరికన్ కాంగ్రెసు విడనాడింది.రానురాను అమెరికా ఇతోధికంగా మిత్రమండలి పక్షం వహించడంతో ఆ పరిస్థితి కూడా తొలగిపోయింది.

చివరకు **1945** నుండి సాగిన ప్రచ్ఛన్న యుద్ధంలో సోవియట్ దేశాలతోడి వర్తకానికి ప్రతిబంధకా లుండాలని కోరడంలో అమెరికా ప్రపంచానికి నాయకత్వం వహించింది. పరిస్థితులు ఈ స్థితిని తారుమారు చేసినాయి. కాని సముద్రయాన స్వేచ్ఛ విషయంలో మాత్రం ఎవ్వరికి పట్టుదల లేదు. ఇప్పుడు వివాదం ఈ సూత్రం మీద కాదు. సముద్రయానంమీద ఏమాత్రం నియమాలు విధిస్తే సత్ఫలితాలు కలుగుతాయనే విషయంపైనే.

సముద్రయాన స్వేచ్ఛకు సంబంధించినదే చైనాకు స్వేచ్ఛామార్గం కావాలనే వాదం. చైనాతో వర్తకంతో తనకు సమానమైన హక్కులు అకాశాలు కావాలని అమెరికా కోరింది. కాని కమ్యూనిస్ట్ విప్లవంతో ఈసమస్య సమాప్తమయింది.

అమెరికా విదేశాంగ విధానం ఒక సామ్రాజ్యవాద దశను గడచిందని ఆ దశ 1898 లో స్పానిష్ సంగ్రామంతోనే అంతంపొందిందని అంగీకరించ వలసి ఉన్నది. 19-వ శతాబ్దంలో అమెరికా పశ్చిమాన పసిఫిక్ మహాసముద్రం వరకూ, దక్షిణాన రయోడిజనీరో వరకూ విస్తరించింది. ఈ రాజ్య విస్తరణ సమయంలో జరిగిన పెద్ద పోరాటం 1846-1848 లో జరిగిన మెక్సికో యుద్ధం. ఇంకా క్యూబాకు ఇతర కారిబియన్ ప్రాంతాన్ని కలుపుకో వాలని ఉద్యమాలు వచ్చినాయి కాని అవేవీ పెద్ద సామ్రాజ్యవాద దండ యాత్రకు దారి తీయలేదు.

1898 లో స్పానిష్ యుద్ధానికి స్పెయిన్‌వారిపై విప్లవం చేస్తున్న క్యూబ నులయెడ అమెరికన్ ప్రజలకుగల సానుభూతి, స్పెయిన్ భూభాగాన్ని ఆక్రమించుకొంటున్న జర్మనులు క్యూబాను ఆక్రమిస్తారేమోనన్న భయం కారణా లయినాయి. మెయినీ అను యుద్ధనౌక 'హవానా' నౌకాశ్రయంలో పేలిపోయినదని వార్తాపత్రికలు ప్రకటించడంతో అమెరికా ప్రజలలోని వ్యతి రేక భావం తీవ్ర క్రోధముగా ప్రజ్వరిల్లింది. ఈ యుద్ధంలో క్యూబా, పోర్టో రికో, ఫిలిప్పీన్స్ ద్వీపాలు అమెరికనుల వశమైనందుకు - అమెరికనులకన్న ఎక్కువ ఆశ్చర్యపడ్డవారు లేరు !

ఈసమయంలోనే రుడయార్డ్ కిప్లింగ్ అమెరికనులను ఉద్దేశించి వ్రాసిన పద్యంలో - వారిని 'శ్వేతజాతి బాధ్యతలను స్వీకరింపుడు' అని హెచ్చరిం చాడు. అమెరికా ఈ క్రొత్తరాజ్య భాగాలను ఏమి చేయాలా అని ఆలోచిస్తుం డగా సామ్రాజ్యవాదాన్నిగురించి దేశవ్యాప్తంగా వాదోపవాదాలు చెలరేగాయి. చివరకు జనాభిప్రాయం సామ్రాజ్యవాదానికి విరుద్ధంగానేతిరిగింది. ఇప్పుడు అమెరికనులకు ఎక్కడో దూరాన ఉన్న, వేరొక భాష ఆచార వ్యవహారాలు కల, జాతి ప్రజలను పాలించాలనే అభిప్రాయం లేదనే మాట స్పష్టం. విదేశంలో అమెరికా పతాకాన్ని దించరాదనే పాత నినాదానికి ఇప్పుడేమీ రాజకీయ బలంలేదు. అమెరికనులు జర్మనీ, జపానులలో వలె విదేశాన్ని పాలించవలసి వస్తే-వారు కోరుకొనేదల్లా వీలయినంత త్వరలో ఆ దేశాన్ని వదలి వచ్చెయ్యడమే.

అందుచేత విదేశాంగ విధానంలో రాజకీయ పక్షాల పాత్ర అంతరంగిక వ్యవహారాలలో వాటి పాత్రవలె ఉండదు. అవి శత్రుదేశాలైనా- విదేశాలతోడి

వ్యవహారంలో రెండు పక్షాలూ తరుచు సహకరించి పనిచేస్తూంటాయి. వట్టి బాధ్యతా రహితులైన వదరుబోతులే ఈ భావాన్ని పట్టించుకోరు. కాకపోతే ప్రభుత్వ వ్యయం విషయంలో వివిధ పక్షాలకు కలిగే నిజమైన భేదాభిప్రాయాలవల్ల మాత్రం— విదేశాలకు సహాయంవంటి విషయాలపై వివాదాలు వస్తాయి. ఇక కాంగ్రెసు సభ్యులు తప్పక గౌరవించవలసిన స్థానికుల స్వార్థ ఆర్థిక ప్రయోజనాలు ఉంటాయి. వాటిని కాంగ్రెసు సభ్యుడు లెక్క చేయకపోతే మలి ఎన్నికల్లో వాటిని లెక్కచేసేవాడు అతని స్థానంలో గెలుస్తాడు. నూతన ప్రపంచ పరిస్థితుల వలన సాంప్రదాయిక విధానాన్ని మార్చవలసి రావడంవల్ల వచ్చే రాజకీయ ఫలితాలుకూడా ఉన్నాయి.

ప్రపంచ పరిస్థితుల్లో మార్పువల్ల అమెరికా ప్రజలు నూతన విధానాలను నేర్చుకోవలసి వస్తోంది. సుదీర్ఘమైన, దేశవ్యాప్తమైన రాజకీయ వాదోపవాదాల మూలంగానే వారు మనోనిశ్చయం చేసికొని, ఏదిసాధించాలో తెలిసికోగలరు.

# రాజకీయాలు : ప్రజాస్వామ్యం

ప్రపంచంలో గల అత్యంత మానుష ప్రవృత్తి గల దేశాలలో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ఒకటి. అన్ని విధాలుగానూ అమానుష ప్రవృత్తి గల దేశాలలో సోవియట్ రష్యా ఒకటి. ఈ రెండు గొప్ప దేశాలలో కూడా తప్పులు లేకుండా లేవు. కాని ఇవి చేసే తప్పులలో తేడా లున్నాయి. ఆర్థిక వ్యవస్థ విషయంలో, మతం విషయంలో, అల్ప సంఖ్యాకుల యెడల ప్రభుత్వ దృక్పథం విషయంలో ఈ తేడా కొంత కన్పిస్తుంది. అమెరికా రష్యాలకు మధ్య గల అంతరాన్ని ప్రకటం చేయడానికి రాజకీయ విభేధాలు చూపడం ఒక మార్గం.

రష్యా ప్రజలను గురించి వారి ప్రభుత్వం చెప్పే విషయాలు మనం నమ్మితే – రష్యా ప్రజలు ఎప్పుడూ రాజకీయ చింతన లోను చర్యల లోను నిమగ్నులై ఉంటా రని అనుకొవాలి. కాని **40** లక్షల నుండి **2** కోట్ల మంది దాకా 'రాజకీయ' ఖైదీలు – నిర్బంధ సేవా శిబిరాలలో బంధింప బడి ఉన్నారు. న్యాయం గానో, అన్యాయం గానో యీ అభాగ్యులు రాజకీయ చర్చల వలననో, రాజకీయ విషయాలు ఆలోచించడం వలననో నేరం చేసిన వారైనారు. ఆ శిబిరాలలో మామూలు దొంగలు వీరి కన్నా బాగా చూడ బడుతూ, యీ ఖైదీలపై అధికారం చెలాయిస్తూంటారు. సోవియట్ ప్రభుత్వ వ్యవస్థలోని అమానుష ప్రవృత్తి – రాజకీయాలలో పాత్ర వహించడమే అన్ని నేరాల కన్న అత్యంత కఠిన శిక్షార్హమైన నేరం అనే యీ విషయం వల్ల స్పష్టం అవుతున్నది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఇతర ప్రజాస్వామిక దేశాల వలెనే సాధారణ స్థితిలో రాజకీయాలలో పాల్గొనడం నేరంగా చూడరు. కొన్ని రాజకీయాలు నేరం కావచ్చు. ఎందుకంటే – రాజకీయాలు కూడా మానుష సహజ మైనవి కాబట్టి. రాజకీయాలు – రాజ్యకార్య ధౌరంధర్యం నుండి, పట్టి లంచగొండితనం పర్యంతం ఉన్న – అన్ని స్థితులను పొందవచ్చును గదా !

రష్యా అమెరికాలలో మరొక తేడా – పౌర స్వామ్యాల యెడ వారి వారి దృక్పథాల విషయంలో ఉంది. రెండు దేశాలలోనూ భిన్న జాతుల

ప్రజలు, భిన్నభిన్న ఆచారాల తోను అలవాట్ల తోను, వివిధ జాతీయ భాషలు మాట్లాడుతూ ఉన్నారు. వారి నందరును ఒక కేంద్ర ప్రభుత్వ పాలన లోకి, ఒక ఆర్థిక వ్యవస్థ లోకి తెచ్చే టప్పుడు తప్పనిసరిగా చాలా సంఘర్షణలు వస్తాయి. అనివార్య మయిన ఈ సంఘర్షణల విషయంలో అమెరికా రష్యా ప్రభుత్వాలు భిన్న పద్ధతులలో వ్యవహరిస్తాయి-

సోవియట్ సంయుక్త రాజ్యంలో, తన విలక్షణ మయిన అలవాట్లూ, ఆచారాలనూ నిలబెట్టు కొనేదీ, లేక "సోవియట్ వ్యక్తి" రూపం లోకి పూర్తిగా మారిపోనిదీ, అయిన జాతి – నిరుపయోగంగా ఎంచబడి రూప రహితం చెయ్య బడుతుంది. కేంద్ర ప్రభుత్వం ఈ అభాగ్య పౌరుల నంద రనూ మోసుకొని పోవడానికి గూడ్సుబళ్లు పంపిస్తుంది. కొందరు ఆర్కిటిక్ సముద్ర తీరంలో వలస ఏర్పరచుకో వలసి వస్తుంది. కొందరు బానిస శిబి రాల్లో చచ్చిపోతారు. కొందరు రష్యన్ ప్రజా సమూహంలో చెల్లాచెదరై కలిసి పోతారు. మొత్తంమీద వారివైన సంస్కృతీ సంప్రదాయాలు గల జాతిగా మాత్రం వారు భూ ప్రపంచంపై ఉండరు.

సోవియట్ యూనియన్‌లో ప్రభుత్వానికి ఇష్టులైన జాతులవారు అదృష్టహీనులైన జాతుల వారిని నాశనం చేయుడం చూస్తే – ప్రాణులలో సహజ మయిన పోటీలో బలహీనులైన ప్రాణులు నాశనం అయిపోయి, బల మున్నవే బ్రతుక గలిగే స్థితి జ్ఞాపకం వస్తుంది. కాని పోలీసు రాజ్యంలో నిలువ గలిగే బలవంతులు అంటే, అతి నాగరికులు అని గాక అతి క్రూరులు అని చెప్పాలి.

అమెరికాలో కూడా చాల జాతులు, సంస్కృతులు, మతాలు ఉన్నాయి. అందులో కొన్ని ఎంత పరస్పర భిన్నమైన వంటే – మన ఊహ కందే భవిష్యత్తులో ఆ జాతులు ప్రజా సమూహంలో పూర్తిగా లీనమైపోయే అవకాశం లేదు. అమెరికాలో కూడా వ్యాపారంలో సంఘర్షణలు, జాతీయ సంస్కృతులలో, మతంలో సంఘర్షణలు ఉన్నాయి. అందులో కొన్ని చాలవరకూ పాతుకొని పోయినవి, తీవ్రమైనవి కూడా. తెల్లవాళ్లు–నీగ్రోలు, యూదులు–తదితరులు, కేథలిక్కులు–పొటెస్టంట్లు, అంతా వారి మధ్య వైమనస్యాలను మరచి పోయి, కలిసి ఆడి, పాడి, తిని, పనిచేసే సుదినం ఎప్పుడు వస్తుందో తెలియదు. ఈ లోపున మాత్రం వీరంతా ఇంకొక జాతికి

చెందిన తమ పొరుగు వారిని కూడా చూసి భయపడి ద్వేషిస్తుంటారు. ఒక్కొక్కప్పుడు వీరు తమ తోటి పౌరులకు హాని కలుగ చేస్తుంటారు. వీరు ద్వేషించే అల్పసంఖ్యాకుల అభివృద్ధికిగల అవకాశాలను పరిమితంచేస్తూ వీరు శాసనాలు చేయడం కూడా కద్దు. ఇదంతా మానవ సహజమైన పనే!

కాని భిన్నజాతుల మధ్య, స్నేహం, సౌహార్ద్రం కూడా మానవ సహజ మైనవే. పైగా ప్రజాస్వామ్య సమాజంలో వీటివలన కాల్రకమేణా ప్రయో జనం కన్పిస్తుంది. కాని యీ కాల్రకమం – చాల దీర్ఘమైనది. స్నేహార్ద్రి బాంధవ్యాలవైపు పురోగమనం చాలా నెమ్మదిగా సాగుతుంది. అమెరికాలో మాత్రం యీస్నేహార్ద్ర సంబంధాలకు అభివృద్ధి సూచనలు కన్పిస్తున్నాయి. అమెరికన్ జీవిత విధానంలోని ఆచార వ్యవహారలలో, సంస్థలలో కొంత సత్యం ఉన్నదని యీ అభివృద్ధి వలననే విశ్వాసం కలుగుతూంది.

దేశంలోని జాతి భేద సమస్యను జాతి హత్యా మూలంగా – అంటే ఒక జాతి ప్రజల నందరనూ హత్య చేయడంవల్ల – పరిష్కరించడానికి అమెరి కన్ ప్రజలు తమ ప్రభుత్వానికి అనుమతి ఇవ్వరు. పైగా వాళ్ళు విద్య, న్యాయం, ప్రజాభిప్రాయం మొదలైన వాటితో కూడిన ఆచరణీయమైన క్రొత్త వ్యవస్థను కనుగొని, అందులో అందరి పౌరుల హక్కులు కాపాడే పద్ధతి ఆలోచిస్తారు.

కమ్యూనిస్టులు ప్రచారంలో–ముఖ్యంగా రంగు జాతులలో ప్రచారంలో– అమెరికాలో రంగుజాతుల యెడల ద్వేషబావాన్ని గోరంతలు కొండంతలు చేస్తున్నారు. అమెరికనులు యీ ప్రచారంలోంచి తప్పించుకోలేరు. వారు దానిని ఎదుర్కొని, వారి దేశంలో నీగ్రోల పరిస్థితి అభివృద్ధిపరచి, ఆ వాదా నికి జవాబు చెప్పవలసి ఉంది. అమెరికనులు రష్యా పద్ధతిని అవలంబించి అల్పసంఖ్యాకులను నాశనంచేసి రహస్యపు గోడల వెనకాల ఆ క్రౌర్యాన్ని దాచరు. ప్రజల హక్కులను ప్రజాస్వామ్య పద్ధతులద్వారా సాధించడమే వారి మార్గం. ప్రజాస్వామిక పద్ధతిలో పురోగమనం చాల నెమ్మది కావచ్చు. కాని, పురోగమనం మాత్రం నిజం.

అమెరికాలో ఇన్ని అవలక్షణా లున్నా – విదేశీయులకు ఆకర్షకంగా కన పడే కొన్నిగుణాలు అమెరికాలో ఉన్నాయనడానికి ఉదాహరణ – దేశపు లోపలిరూపాన్ని చూచే విదేశీయులలో చాలమంది అక్కడే ఉండిపోయి

అమెరికాను తమ స్వదేశం చేసుకొనడం. అమెరికా ప్రజల స్వాతంత్ర్యం చాల రకాలుగా అసంపూర్ణంగా ఉన్నప్పటికీ – అది చాలా జీవితరంగాలకు వ్యాప్తమై ఉంది. అది అభివృద్ధిపొందే సూచన లున్నాయి. అమెరికా స్వాతంత్ర్య బలం – అది సాధింపబడిన నాటి విచిత్ర పరిస్థితులకు సంబంధించినది.

అమెరికాకు వచ్చిన ప్రజలలో చాలామంది వారిని బధించి ఉంచిన పరిస్థితులను బద్దలుచేసుకొని వచ్చినవారు. వారంతా- జీవితం కష్టతరమయిన, ప్రమాద భరితమయిన ఈ నూతన దేశానికి వచ్చారు. చాలామంది ఇక్కడి వాతావరణ స్థితివల్లా, తిండిలేక పోవడంవల్లా చనిపోయారు. ఇంకాకొందరు ఎర్ర ఇండియనుల చేతిలో చచ్చిపోయారు. కాని వాళ్ళందరికీ అక్కడ స్వాతంత్ర్య వాయువులు పీల్చుకొనే వీలుంది. వాళ్లని బంధించిన గొలుసులను తెంచుకొన్నామనే సంతృప్తి ఉంది.

అదీకాక, ఇంచుమించు 3 శతాబ్దాలపాటు, అమెరికాకున్న భౌగోళికస్థితి మూలకంగా అమెరికనులకు స్వాతంత్ర్యం ఇంచుమించు పరిపాటివిషయం అయిపోయింది.అమెరికాకు వెనకాల అట్లాంటిక్ మహాసముద్రం.అందుచేత ఎప్పుడైనాసరే – 3000 మైళ్ళ దూరం సముద్రాన్ని దాటించి సైన్యాలను తీసుకు రాగలిగిన దేశాన్ని – అది బ్రిటన్ కాని మరేదైనా కాని – ఎదుర్కోడానికి కావలసినన్ని సైన్యాలను అమెరికనులు సమకూర్చుకో గలిగేవారు. ఈ అసరాకి తోడుగా – 19 వ శతాబ్దంలో అమెరికా దేశపు శైశవదశలో – యూరపులోని ఏ పెద్ద దేశమూ అమెరికాపై తన బలాన్నంతటినీ కేంద్రీకరించడానికి వీలులేనంతగా అక్కడ తీవ్ర యుద్ధాలు చెలరేగడం వల్ల అమెరికాకు బలం ద్విగుణీకృత మైంది.

భౌగోళికంగా స్వాతంత్ర్యానికీ, స్వేచ్ఛకూ అవకాశమిచ్చిన మరొక విషయం– దేశానికి పశ్చిమాన చాలా ఖాళీప్రదేశం ఉండడం. స్వేచ్ఛ అంటే ఇష్టంవచ్చిన చోటికి ఇష్టంవచ్చినట్లు పోవడానికి గల శక్తి అని చెప్పడంలో చాల సత్యమున్నది. ప్రభుత్వాల పీడన తప్పించుకోడానికి ఉన్న చక్కని వీలు – ఆ పీడితుడు మూటముల్లే కట్టి దూర ప్రాంతానికి పోగల అవకాశమే. ఈరకంగా వెళ్ళిపోవడానికి గల స్వేచ్ఛ ఇప్పటికీ అమెరికన్ జాతీయ జీవితంలో ముఖ్యమైన లక్షణం. సరిహద్దు ప్రాంతాలు ఉన్న రోజుల్లో అధి

కారుల యెడల, వ్యక్తిస్వాపృ్యాల యెడల అమెరికనుల ప్రవర్తనలో ఇది ఒక బలమైన లక్షణంగా ఉండేది.

అమెరికా ప్రజలు, ఆంగ్లేయుల న్యాయ విధానానికీ, న్యాయసంస్థలకూ వారసులు. ప్రజలకూ, రాజులకూ జరిగిన దీర్ఘసంఘర్షణలో యీ న్యాయ విధానమూ న్యాయసంస్థలూ రూపొందాయి. ఇవన్నీ ప్రభుత్వాల బారినుండి ప్రజలను రక్షించడానికి ఏర్పడ్డట్టివి. అమెరికా రాజ్యాంగానికి 5వసవరణలో చెప్పబడినట్లు ఏ పౌరుని స్వాతంత్ర్యం, ఆస్తి, స్వేచ్ఛా కూడ "సక్రమ న్యాయవిచారణ" లేనిదే హరించబడవు. అతని ఆస్తి ప్రజోపయోగానికి–న్యాయమైన నష్టపరిహారం లేనిదే తీసికొనబడదు.

అమెరికావారు అనుసరించిన ఈ ఆచారాలన్నీ మధ్య తరగతి వారి ఆచారాలు. అమెరికా–యూరపుకు సన్నిహితంగా ఉండడంతో అమెరికన్ప్రజలు కూడా మధ్యతరగతివారి భావాలే అలవరచుకొన్నారు. అమెరికాలోని కార్మికుడు తాను ధనవంతుల ఆస్తిని స్వాధీనం చేసుకోవాలని తాపత్రయపడే శ్రామికవర్గానికి చెందినవాడి ననుకొనే భావంతో కాక, తానొక ఇల్లు కొనుక్కోవాలనీ, కొంత వ్యాపారం సొంతగా చేసుకోవాలనీ మధ్యతరగతి వానిలా ప్రయత్నం చేస్తాడు. గతంలో చాలామంది శ్రామికులు పశ్చిమ ప్రాంతాలకు పోయి వ్యవసాయం ప్రారంభించడమో, వ్యాపారం చెయ్యడమో చేశారు. అందుచేత సంఘంలో వర్గాలు మారడానికి వీలులేదనీ ధనిక నిర్ధనిక వర్గాల మధ్య పోరాటం తప్పదనీ, చెప్పే సిద్ధాంతం ఈ దేశంలో ఎవరూ తేలికగా అంగీకరించరు.

అమెరికా దేశపు న్యాయశాసనాలూ, సంస్థలూ ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిరక్షించేందుకు బలీయమయిన రాజకీయ అయిధాలుగా బాగా ఉపయోగపడ్డాయి. సహజమైన రక్షణగా ఉపయోగపడే సముద్రం ఇప్పుడు అందరి చేతా అధిగమించ బడడంతోను, సరిహద్దు ప్రాంతాలు ఖాళీగా ఉండక అక్కడ కూడా జనం స్థిరపడ్డంతోను, ప్రజలకు అవసరమయిన నూతన రక్షణలను ప్రభుత్వాంగాలే కల్పించడానికి వీలయింది.

అమెరికా చరిత్ర శైశవదశలో దేశ సరిహద్దు ప్రాంతాలుఖాళీగా ఉండడంవల్ల ప్రజాస్వామ్యం దానంతట అదే లభ్యమయింది. ఎవడు ప్రభుత్వం

చేత బాధితులైనా, తన యిష్టంవచ్చిన చోటికి పోయి స్వేచ్ఛగా బ్రతికే వాడు. స్థిరపడిన ప్రజలున్న తూర్పుతీరంలో మాత్రం ఇంగ్లండులో వలెనే సాంఘిక, ఆర్థిక వర్గాలుండేవి. ఆస్తి గలవారికే వోటు హక్కుండబట్టి, రాజకీయ ప్రజాస్వామ్యం వారికే పరిమితమై ఉండేది.

కాని సరిహద్దు రానురాను పశ్చిమానికి జరిగింది. ఆస్తి గలవారికన్నా సామాన్యులెక్కువైపోయారు. వోటుహక్కు రానురాను ఎక్కువమందికి,చివరకు ఆడవారికికూడా ఇవ్వడంవల్ల రాజకీయ ప్రజాస్వామ్యపు అవధులు విస్తరించాయి. అధ్యక్షుడినీ, సెనేటు సభ్యులనూ ఎన్నుకొనేహక్కు ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. రాజకీయాధికారం ఉన్నత వర్గాల వారి గుత్తహక్కు కాకుండా పోవడంతో, రాజకీయాలలో సామాన్య ప్రజల గుణదోషాలే ప్రతిబింబించడం ప్రారంభించాయి. 20వ శతాబ్దపు క్లిష్ట పరిస్థితులలో అమెరికా నిలవడమో కూలడమో యీ గుణదోషాలపైనే ఆధారపడిఉంది.

ఏది ఒప్పు? ఏది తప్పు? ఏది వివేకం? ఏది అవివేకం? అనే విషయాలపై ప్రజలే వారి నిర్ణయాలు చేస్తున్నారు. జనవాక్యమే భగవద్వాక్యమనే నానుడికి – అమెరికా సమాజ వ్యవస్థను నిర్మించే సాధనం, సర్వస్వాధికారయుత అభీష్టాన్ని ప్రకటించే ప్రజల వాక్యమే – అని అర్థం. ఏదైనా అనూహ్యమైన సమస్య వచ్చి దానికి ఏది సరియైన పరిష్కారమార్గమో ఆచరణలోనే చూచి నిశ్చయించవలసి వస్తే, అపుడు ప్రజలు ఆ పద్ధతులను ప్రయోగించి వాటి ఫలితాలు చూస్తారు. తప్పుఫలితం వస్తే– వారు అనుసరించింది అవివేక మార్గమని తెలుసుకుంటారు. తప్పు చేయడం మూలంగానే వారికి తప్పేదో తెలుస్తుంది. ఒక్కొక్కప్పుడు ప్రజలు సక్రమమార్గంలోనే నడిచి, దానివలని ఫలితాలకు సంతోషిస్తారు.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం అమెరికనులు నానాజాతి సమితిలో చేరి ప్రపంచ భద్రతకు వారి పాలు బాధ్యతను నిర్వర్తించక తప్పించుకొని శాంతికి శుష్కవాగ్దానాలు చేయడంలో, వారు తప్పే చేశారనిపిస్తుంది. వారు తప్పుచేసినట్లు వారి కెలా తెలుస్తుంది? శాంతికోసం వారు కాగితంమీద చేసిన ఘన ప్రయత్నాలన్నీ పెర్లహార్బర్ ముట్టడిలో సర్వనాశనం కావ

డంతో వారికి తాము తప్పుచేశామని తెలిసింది. అందుకని రెండవసారి చాలా వివేకంతో వర్తించారు.

రెండవసారి అమెరికనులు చాలా ఆతురతతో ఐక్యరాజ్యసమితిని స్థాపించడానికి ముందుకువచ్చి అది బలియమై స్థిరపడడానికి చాలా సహాయం చేశారు. ఐక్యరాజ్యసమితి నిలవడానికి ధైర్యంగా ఎదిరి పోరవలసి వచ్చిన తరుణంలో – కొరియాలో – అమెరికాయే ఆ సవాలును ఎదుర్కొని పోరాడింది. పెర్ల్‌హార్బర్ ముట్టడికి పూర్వమే అప్పు-కౌలు (Lend-lease) కార్యక్రమం అమోదించింది అమెరికా ప్రజలే. రెండవ ప్రపంచ యుద్ధానంతరం వారే మార్షల్ ప్రణాళికను అంగీకరించారు. ప్రజలు ఏ విధంగా గతంలో చేసిన తప్పులు గుర్తిస్తున్నారు? ఏ విధంగా వాళ్ళు క్రొత్తక్రొత్త ప్రమాదాలను ఎదుర్కొనడానికి క్రొత్త పద్ధతులు అన్వేషిస్తున్నారు? అనే విషయాలను ఈ చర్యలు చూపిస్తాయి.

భవిష్యత్తులో కూడా ప్రజలు నిస్సందేహంగా కొన్ని తప్పులూ చేస్తారు. కొన్ని ఒప్పులూ చేస్తారు. వారు నిలదొక్కుకో గలిగితే వారి తప్పులు ఏమిటో తెలుసుకో గలుగుతారు. మహా విపత్కర పరిస్థితులలో కూడా వారికి పురోభివృద్ధిలో విశ్వాసం ఉంటుంది. వారి చరిత్ర వారికి పురోభివృద్ధిలో అచంచల విశ్వాసాన్ని కలిగించింది. ఇదికూడా తప్పే కావచ్చును. కాని మంచి భవిష్యత్తును గమనించడానికి యిదే మంచిదారి. అమెరికనులు అంతా అభివృద్ధికర భావాలను తమ పూర్వీకులనుండి పొందడమే కాక, వారు ప్రపంచానికి మార్గదర్శకులుగా-ఇష్టం లేకపోయినా-పురోగమించవలసి వచ్చింది. అనుకోని సమస్యలూ, జవాబులు లేని ప్రశ్నలూ వారి నెదుర్కొంటాయి. తప్పో ఒప్పో – ఏది ఎదురైతే దానినల్లా వారు స్వీకరించవలసినదే.

అమెరికాలో రాజకీయ శక్తులు, దేశాన్ని ముందుకే కాక, వెనుకకు గూడ నడపడం సహజమేనని చెప్పాలి, చరిత్రలో కేవలం ధైర్యసాహసాలకే కాక, దూరదృష్టికి కూడా అవకాశం ఉంది. అంతేకాక కావలసిన దానిని సాధించడానికి, అడుగుననుండి నాశనంచేసే భయాలన్నింటినీ పెల్లగించి పారవేయడానికి అవసరమైన సాహసానికి కూడా చరిత్రలో అవకాశంఉంది. ఆశలూ, భయాలూ అన్ని సువ్యక్తం కావాలి. తీసికొనే నిర్ణయాలు సుదృఢ

వ్యవస్థాపితమునై ఉండాలి. ఈ పనినే అమెరికా రాజకీయ వ్యవస్థ–భయం కర వాద ప్రతివాదాల సుడిగుండంలో చిక్కుకొని కూడా–చెప్పుకోదగినంత విజయోపేతంగా సాధిస్తున్నది.

ప్రపంచ నాయకత్వం వహించవలసి వస్తున్న అమెరికాలో – అదృష్టం కొద్దీ, ప్రజలు రకరకాల జాతుల సమ్మేళనంగా ఉన్నారు.

వివిధ జాతుల ప్రజల ఆశలూ, భయాలూ, విశ్వాసాలూ, ద్వేషాలూ, అనుమానాలూ, వారి మధ్య సామరస్యం ఉండవలసిన అవసరం, ఇవేవీ– అమెరికన్ ప్రజలకు తెలియనివి కావు. ఈ సమస్యలన్నీ అమెరికన్ ప్రజల కున్నాయి. వారంతా హాయిగా సౌహార్ద్ర సామరస్యాలతో లేరు. కాని వారు అంతఃకలహాలు లేకుండా కలిసి మనగలుగుతున్నారు. ప్రపంచానికి కావల సినది ఇదే కాని వట్టి ఊహాస్వర్గాల పగటి కలలు కావు. అమెరికా ప్రజలకు స్వయంగా ఈ కష్టాలలో అనుభవం ఉండబట్టి వారి కివన్నీ పరిచితమే.

అమెరికనుల ఆశయాలలో ఊహాస్వర్గాలు లేవు. 300 సంవత్సరాల వెనుక మేం ఒక సుదీర్ఘ యాత్రకు బయలుదేరాం మేం చాలాదూరం ప్రయాణం చేశాం. కాని యింకా గమ్యస్థానం కనపడటంలేదు. ఇది నిర్బం ధంకాదు. ఇది ప్రజలే వారంతట వారు బయలుదేరిన ప్రయాణం. చిన్నా పెద్దా అంతా బయలుదేరారు. ప్రజలందరికీ ఈ ప్రయాణం ఇష్టం. మామూ లుగా ఈ దారి రాను రాను పైకి తీసుకెళ్ళుతుందనీ, రాను రాను ఒకప్పుడు కన్పించిన దారికంటే ఎక్కువ కనిపిస్తోందనీ అనిపిస్తోంది. శతాబ్దాధిక కాలం క్రితం ఫ్రెంచి యాత్రీకుడు డీటాక్విల్లే చెప్పినట్లుగా "తమ వ్యవహారాలు తామే నిర్వహించుకోవడంలో ఎక్కువకాలం అలవాటు లేని వారికీ – రాజ నీతిశాస్త్రం అతి సామాన్య ప్రజల స్థాయిలోకి రాని దేశాలవారికీ గూడా అమెరికన్ రాజ్య వ్యవస్థ సరిపడదు."

అందుకనే అమెరికా – యుగ యుగాల నియంతృత్వ పాలననుండి విముక్తమైన దేశాలకు అమెరికన్ ప్రజల విచిత్ర అనుభవాలనుండి రూపొంది విచిత్ర విషయాలతో కూడిన యీ అమెరికన్ రాజ్యాంగ విధానాన్ని అనుస రించమని సలహా చెప్పదు. అది సలహా చెప్పేదల్లా, రాజకీయ స్వాతం

త్రాన్ని సాధించిన దేశాలవారు, ప్రజాస్వామిక అభ్యుదయ పథంలో వారి ప్రతిభా సంపత్తులతో, వారి సంప్రదాయానుగుణంగా, ఆ మార్గంలో ఎన్ని కష్టాలున్నా అదే ప్రజలకు శ్రీరామరక్ష అనే విశ్వాసంతో పురోగమించమని.

ప్రజలు తమ యాత్రామార్గాలను అనేక విధాలుగా నిర్ణయిస్తారు. వారు విజ్ఞానశాస్త్రంనుండి నేర్చుకోవలసిందేమైనా ఉంటే నేర్చుకుంటారు, వారు మత బోధనల మార్గదర్శకత్వాన్ని గూడా అంగీకరిస్తారు. ఇలా నిత్యజీవితంలో – అమెరికన్ పద్ధతిని రూపొందిస్తారు. వారి ప్రభుత్వాంగాలలో – ప్రజాస్వామ్య విధానాలయిన–చర్చ, రాజీ, ఒప్పుదల మొదలయిన వాటిని వారికి చేతనయినంత చక్కగా ఉపయోగిస్తారు. అంటే వారు రాజకీయాలను ప్రయోగిస్తున్నా రన్నమాట. నియంతృత్వ విధానాల్లో రాజకీయాలకు స్థానం లేదు. ప్రజాస్వామ్యపు గందరగోళానికి తావులేదు. మంచికో చెడుకో అమెరికన్ ప్రజలు ప్రజాస్వామ్య మార్గంలో 20 వ శతాబ్దపు భవిష్యత్తును ఎదుర్కొన నిశ్చయించారు. ఫలితం ఏమైనా సరే.



సమాప్తం.

AMERICA RAJYAMGAMU (Tel.) Rs. 2-00
[The United States Political System.]



# అమెరికా రాజ్యాంగము

ప్రపంచంలోకల్లా అతిపురాతన రాజ్యాంగంగా పేరుపొందిన అమెరికా ఇప్పటి ప్రగతికి ఎలా రాగలిగింది? అమెరికారాజ్యాంగం ఎటువంటిది? అది ఎలా పనిచేస్తోంది?

ఈ విషయాలన్నీ 'అమెరికా రాజ్యాంగము'లో విపులీకరింపబడ్డాయి.

రాజకీయపార్టీలు, న్యాయస్థానాలు, కాంగ్రెస్, ఫెడరలు, రాష్ట్రస్థానికప్రభుత్వాలు—ఇవన్నీ కలిసి ఈ బృహత్కార్యంలో ఎలా చేతులు కలిపి పనిచేస్తాయో వివరంగా ఉంది.

అమెరికన్‌ప్రజలు స్వాతంత్రప్రియులు.
పురోగమించడంఅంటే వారికెంతో ఇష్టం.
ఇదే వారి ప్రగతికి ముఖ్యకారణం.

---



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

BC



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 10 \| 149 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 189 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CT, D, BCT |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |